# ఆంధ్ర సచిత్ర వారపత్రి



ANDHRA PATRIKA
LLUSTRATED WEEKLY

25 నయాపైసలు
2-7-1958



కోడిపిల్లలు

ఫొటో : పి. వి. నారాయణ, రాజమం

సంవత్సర చందా
రు. 13-0-0
విడిపత్రిక 25న.పై

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 45
2-7-58

Founder : K. NAGESWARA RAO

విలంబి ఆషాఢ బహుళ ప్రథమ బుధవారం


 విషయానుక్రమణిక 

ముఖచిత్రం :

హిందీనటి మాలాసిన్హా

★

# ★ ఆంధ్రనాటక కళాపరిషత్తు ★





గుడివాడ సభల సమీక్ష





ఎం. ఎస్. శకుంతల

పోటీలలో కర్నూలు అభ్యుదయ కళాసమితివారు ప్రదర్శించిన నాటకం "జన్మహక్కు" లో నటించి ఉత్తమ నటిగా బహుమతి పొందారు.

కే. ప్రసాదరావు

"దొంగవీరడు" లో నటించి ఉత్తమ హాస్యనటుడుగా ఎన్నికైనారు. వీరు ఢిల్లీలోని ఏషియన్ థియేటర్ లో (యునెస్కో యాజమాన్యాన) శిక్షణ పొందుతున్నారు.

ఆటల పోటీలు, నాటకాల పోటీలు జరిగిన తర్వాత జరిగే బహుమతి ప్రదానోత్సవాలు కూడా నాటకాల కోవకి చెందినవే. రంగస్థల వేదిక, మైక్రఫోను, ఫడ్ లైట్లు, ప్రక్కకు తొలగించిన తెరలు ఈ కార్యక్రమంలో వినపడే 'డైలాగ్సు' ఎక్కడ వినపడకుండా పోతాయో అని ఆత్రుతతో ఆలకించే ప్రేక్షకులు. ఆ ఇచ్చే బహుమతులన్నీ తానే ఇస్తున్నట్టుగా తాత్కాలికంగా నటించే రాజకీయవేత్త, లేదా అధికార ప్రముఖుడు; కేవలం కృతజ్ఞత వెల్లివిరిసి పోతున్నట్లుగా ముఖం పెట్టి, వినమ్రతతో వంగి వంగి నమస్కారం చేసే బహుమానగ్రహీత! ఈ నాటకంలో సూత్రధారి పాత్రధరించే కార్యదర్శి. ఈ దృశ్యమంతా గమనిస్తే, బహుమతి ప్రదానోత్సవంకూడా ఒక నాటకప్రదర్శన వంటిదే అనిపిస్తుంది.

ఈ బహుమతి ప్రదానోత్సవ మహా నాటకానికి ఇద్దరో, ముగ్గురో ప్రవీణులు కలిసి 'స్క్రిప్టు' అందచేస్తారు. రాత్రిం బవళ్ళు కూచొని కన్నుమూయకుండా పదిపదిహేను నాటకాలలో, నాటికలలో, ఆటలలో, పాటలలో చూసి, విని, వీరి 'స్క్రిప్టు' తయారు చేసారు ఈ స్క్రిప్టు సిద్ధంచేసే ముందు ప్రేక్షకజనాళికి దూరంగాపోయి సమాధి నిష్ఠాగరిష్ఠులౌతారు.

## "ప్రవీణ్"

ప్రేక్షక జనానికి దూరంగాపోయి, సమాధి నిష్ఠాగరిష్ఠులయిన తరువాత ఈ ఇద్దరు ముగ్గురు ప్రవీణులు సమిష్టిగా తయారుచేసే స్క్రిప్టు బాగుంటే, ఆ నాటకం బాగుంటుంది. పోటీలు బాగా జరిగాయంటారు ప్రజలు. పోటీలవల్ల సత్ఫలితాలే కలిగాయని సంతోషిస్తారు విమర్శకులు.

పోటీలు సక్రమంగా నిర్వహించడానికి న్యాయాధిపతులు ఎంత కృషి చేసినా, ఒకటో రెండో లోపాలు ఉండకమానవు లోపాలున్నా లేకపోయినా, ఎంతో కొంత వరకు న్యాయాధిపతుల నెత్తిమీద అక్షింతలు రాలకమానవు. జూన్ మొదటివారంలో ఆంధ్ర నాటక కళాపరిషత్తు పోటీలు గుడివాడలో జరిగినప్పుడు ఇటువంటి సంఘటనే ఒకటి జరిగింది. ఒకపూట భోజనాలదగ్గర ఒక నాటకబృందానికి చెందిన పెద్దమనిషి ఉచ్చస్వరంలో డైలాగు ప్రారంభించాడు: "మీరు పరిషత్తుకి మా నాటకం ఎందుకు ఎన్నుకోలేదు. ఫలానా నాటకం చూడండి ఎంత ఘోరంగా ఉందో! మాకు పదిరోజుల వ్యవధి ఇవ్వండి ఇంతకంటె పదిరెట్లు మంచి ప్రదర్శన ఇస్తాము" అంటూ. ఆ పెద్దమనిషి కోపం కరిగించేసరికి తాతలు దిగొచ్చారు. నిర్వాహకుల తాతలు!

ప్రతి సంవత్సరం పరిషత్తు కార్యక్రమాలలో పాల్గొనడానికి యావదాంధ్రంనుంచి అనేక నాటక సంస్థలు ఉత్సాహపడుతూంటాయి కేవలం నాలుగురోజులు మాత్రమే జరిగే పరిషత్తు కార్యక్రమాలలో .ఈ సంస్థలన్నింటికీ ప్రాతినిధ్యం ఇవ్వడం సాధ్యం కాదు. అందువల పరిషత్తు పరిశీలకులు ఇద్దరో ముగ్గురో ఆంధ్రదేశమంతటా పర్య

# ★ ఆంధ్ర నాటకకళాపరిషత్తు ★

టించి, నాటక ప్రదర్శనను నిర్ణయిస్తారు. ఈ సంవత్సరం పరిషత్తు పక్షాన శ్రీయుత్రోజు మాధవాచార్యులు, శ్రీ వడ్డమూడి సీతారామారావు పరిశీలకులుగా వ్యవహరించారు. ముందు వేసంగిలో దేశమంతా పర్యటించి, వీరు ఎనిమిది నాటకాలు, పన్నెండు నాటికలు, దుర్యోధన పాత్రాభినయ పోటీకి ఎనిమిదిమంది అభ్యర్థులను ఎన్నుకున్నారు. వీరు చేసిన ఎన్నిక చాలా వరకు సమంజసంగానే ఉందని చెప్పాలి. కాని ఎన్నిక కాని నాటక బృందాలకు ఎన్నిక అసంతృప్తికరంగా ఉండడం, వారు తమకేదో అన్యాయం జరిగిందని భావించడం సహజమే! సంస్కారులు, కళాప్రియులైన వ్యక్తులు సాధారణంగా తమ అసంతృప్తిని వ్యక్తంచేయరు.

అంతమాత్రంచేత పోటీలలో న్యాయాధిపతుల నిర్ణయాలు సమంజసంగానే ఉంటాయని భావించలేము. న్యాయాధిపతులు కూడా మానవమాత్రులే కావడంవల్ల వారి నిర్ణయాలలో లోపాలుండక తప్పదు. లోపాలు చిన్నవైనప్పుడు, వాటిని విస్మరించడమే మంచిది. లోపాలు పెద్దవై, పోటీల నిర్వహణను హాస్యాస్పదం చేసినప్పుడు, న్యాయాధిపతుల నిర్ణయాలను విమర్శించడం విమర్శకుల విధి ఔతుంది.



కే. వెంకటేశ్వరరావు

నాటకపోటీలలో విజయవాడ ర. స. స. సమాఖ్య ప్రదర్శించిన "దొంగవీరడు" నాటకంలో నటించి ఉత్తమ నటుడుగా ఎన్నికైనారు.

ముందు పరిషణ్మహాసభల సమీక్ష ఆలకించండి!

జూన్ రెండవ తేదీ ఉదయం గుడివాడ శరత్ టాకీస్ హాలులో ప్రారంభమయ్యాయి పరిషణ్మహాసభలు. ఒకటవ తేదీ రాత్రికి, రెండవ తేదీ ఉదయానికి ఆంధ్రదేశ మంతటి నుంచి గుడివాడ చేరుకున్నారు యాత్రికులు. యాత్రికులందరికీ గుడివాడ కళాశాలావరణంలో భోజనాది సౌకర్యాలు ఏర్పాటు చేశారు నిర్వాహకులు.

పరిషణ్మహాసభలను ప్రారంభించవలసిన శ్రీ బి. ఎస్. రెడ్డి కారణాంతరాలవల్ల రాలేక పోయినందువల్ల శ్రీ మేకా రంగయ్యప్పారావు మహాసభలను ప్రారంభించారు. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ అధ్యక్షులు శ్రీ ఆర్. బి. రామకృష్ణంరాజు అధ్యక్షత వహించారు. పరిషత్తు ఈ మూడు దశాబ్దాలలో ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సాధించిన విషయాలనుగురించి శ్రీ అప్పారావు తమ ఉపన్యాసంలో ప్రస్తావించారు.

మూడవ తేదీ ఉదయం జరిగిన నాట్యగోష్ఠిలో శ్రీ పి. రాజారాందాస్; ప్రొ. వి. చంద్రశేఖరం; శ్రీ యండమూరి సత్యనారాయణరావు (శ్రీవాత్సవ) పాల్గొన్నారు. శ్రీ శ్రీవాత్సవ ఉపన్యాసం ఒక చిన్న గాలిదుమారం లేవదీసింది. ఈ నాట్యగోష్ఠిలో పాల్గొనమని పరిషత్తు నిర్వాహకులు ఆహ్వానించారు. వారు తమ ఉపన్యాసంలో దుర్యోధన పాత్రాభినయ పోటీలలో పాల్గొంటున్న ఒకరినిగురించి ప్రస్తావించి, వారి ప్రతిభను ప్రశంసించారు. రెండవ తేదీ నాటకంలో ఒకటి రెండు సంభాషణలను పేర్కొని, సహృదయులు కనుక, ఆ సంభాషణలు పలుకవలసిన తీరు ఏదో తెలిపారు. ఈ రెండు ప్రస్తావనలు పోటీలు జరుగుతున్న కాలంలో చేయడం సమంజసం కాదని వారికి తెలియక పోవడం, వారీ విధంగా ప్రస్తావిస్తారని పరిషత్తు నిర్వాహకులకు తెలియకపోవడం, కార్యక్రమాలలో పాల్గొంటున్న కొందరు కళాకారులకి అసంతృప్తి కలిగించింది. శ్రీ శ్రీవాత్సవ ప్రస్తావన ప్రభావం న్యాయాధిపతుల నిర్ణయాలపై పడినట్లు కనపడక పోవడంవల్ల, ఈ అసంతృప్తికి తీర్మానాల రూపంలోకి అనువాదం కాకుండానే హరించుకపోయింది.

నాల్గవ తేదీ ఉదయం నాట్యగోష్ఠిలో శ్రీయుతులు పోణంగి శ్రీరామ అప్పారావు, శ్రీనివాస చక్రవర్తి, పైడిపాటి సుబ్బరామశాస్త్రి పాల్గొన్నారు. ఐదవ తేదీ నాట్యగోష్ఠిలో శ్రీయుతులు వి. ఎల్. సుందరరావు, రామాచారి, డా॥ జి. రాజారావు



జి. వి. సుబ్బారావు

"దొంగవీరడు" నాటకంలో "దొంగవీరడు" పాత్ర ధరించి ప్రత్యేక బహుమతి పొందిన విజయవాడ వాస్తవ్యులు.

పాల్గొన్నారు. అదే ఉదయం శ్రీ జమ్ములమడక మాధవ రామశర్మ సంస్కృతం నుంచి అనువదించిన 'నాట్యవేదం' ఆవిష్కరించబడి, శ్రీ బందా కనకలింగేశ్వరరావుకి అంకితమీయబడింది.

మూడు నాలుగు తేదీలలో శ్రీయుతులు సోమంచి యజ్ఞన్నశాస్త్రి, పి. సూరిబాబు, ఎన్. టి. రామారావు, పి. పులయ్య, వెంపటి సత్యనారాయణమూర్తి, శ్రీమతులు సురభి కమలాబాయి, సావిత్రీగణేశన్, చిత్తజల్లు వైదేహి సోదరీమణులు సన్మానించబడారు. పరిషత్తు ప్రధాన కార్యదర్శి శ్రీ పసల సూర్యచంద్రరావు సన్మానపత్రాలు చదివారు. అధ్యక్షులు శ్రీ అప్పారావు సన్మానితులకు శాలువలుకప్పి, చందన తాంబూలాలు సమర్పించి, సత్కరించారు.

పరిషత్తు ఉత్సవాలలో మొత్తం ఎనిమిది నాటకాలు ప్రదర్శించబడాయి. ఈ ఎనిమిది నాటకాలకి పరిషత్తు పన్నెండు బహుమానాలనిచ్చింది. ప్రదర్శనకి ప్రథమ బహుమానం ర. స. స. సమాఖ్యవారి 'దొంగవీరడు'కి పోయింది. ద్వితీయ బహుమానం 'పంజరం' ప్రదర్శించిన శ్రీకాకుళం బృందంవారికి లభించింది. 'రంగాలంకరణ' బహుమతి కూడా వారికే లభించింది. నాటకాలలో నటుడిగా ప్రథమ బహుమతి 'దొంగవీరడు'లో రామబ్రహ్మంగా ఉత్తమస్థాయిలో నటించిన శ్రీ వెంకటేశ్వరరావుకి లభించింది. నాటకాలలో నటిగా ప్రథమ బహుమతి 'జన్మహక్కు' నాటకంలో క్రిస్టియన్ హరిజనవితంతు స్త్రీ పాత్రధారిణి, శ్రీమతి ఎం. ఎస్.



సి. హెచ్. పుష్పకుమారి

గూడూరు సంస్కృతి సమ్మేళనం ఆధ్వర్యాన జరిగిన నాటకోత్సవాలలో విజయవాడ వాణీ ఆర్ట్ థియేటర్స్‌వారి 'పునర్జన్మ'లో నటించి ఉత్తమ నటిగా బహుమతి నందుకున్నారు.

---

శకుంతల (కర్నూలు)కివచ్చింది. నాటికలలో ఉత్తమ నటుడుగా శ్రీ సింగరాజు నాగభూషణరావు, ఉత్తమనటిగా శ్రీమతి తులసీదేవి (గుడివాడ) ఎన్నికైనారు.

ఎనిమిది నాటకాలలో పరిషత్తు నిర్ణయించిన పన్నెండు బహుమతులు నాలుగు నాటకాలవారు పంచుకొన్నారు. ఇందులో 'దొంగవీరడు' బృందానికి నాలుగు బహుమానాలు, 'పంజరం' బృందానికి ఐదు, 'జన్మహక్కు'కి రెండు, 'సమతి'కి ఒకటి లభించాయి. అసలు బహుమతికి నోచుకొని నాటకాలు నాలుగు. 'ఒకేకుటుంబం'; తెరలో తెర'; 'అధికారి'; 'కొంగజపం'.

ప్రఖ్యాత రష్యన్ రచయిత గొగోల్ రచించిన 'ఇన్స్పెక్టర్-జనరల్' నాటకానికి తెలుగులో చాలా అనుసరణలు వచ్చాయి. 'అధికారి' నాటకం గొగోల్ నాటకానికి శ్రీ గిడుతూరి సూర్యం అనుసరణ. ఈ నాటకంలో పేర్కొనవలసిన దోషాలు రెండు మూడు ఉన్నాయి. మూలంలో 'నకిలీ అధికారి' ఒక అమాయకుడు. 'అధికారి' నాటకంలో అతడొక నవగిరీశం. తెలిసి లంచగొండి అధికారులను మోసంచేస్తాడు. అనుసరణకూడా సమకాలీన ఆంధ్రదేశ పరిసితులకు అనుగుణంగా జరిగిందనడానికి వీలులేదు. దీన్ని గొగోల్ రచనకు అనుసరణగా కాక స్వతంత్ర రచనగా నిర్వాహకులు ప్రదర్శించవలసింది ఆవిధంగా చేయడం గ్రంథచౌర్యం క్రిందికివస్తుందని ప్రదర్శకులు భయపడినట్టున్నారు. పరిషత్తు పోటీలలో అనుసరణలకి రచనాబహుమతి అందుకొనడానికి అర్హతలేదు. ఈ విషయం తెలిసికూడా ప్రదర్శకులు 'అధికారి'ని అనుసరణగా ప్రకటించుకున్నారు.

ఇండియన్ నేషనల్ థియేటర్, హైదరాబాదుశాఖ, పరిషత్తులో ప్రదర్శించిన 'అధికారి' నాటకం ఒక 'ఫార్సు' 'ఫార్సు'ను ప్రదర్శించడానికి, తదితర స్వాభావికతా ప్రధానమైన నాటకాల ప్రదర్శనకి భేదం ఉంటుంది. సంభాషణలలో అతిశయోక్తి నటనలోకి ప్రదర్శనలోకి అనువాదం కావాలి. ప్రదర్శకులు స్పష్టమైన సందేశాన్ని ప్రేక్షకులకు అందివ్వాలనే ఉద్దేశ్యంతో నాటకప్రదర్శనలో మార్పులు తెస్తే, ఆమార్పులు హాస్యాస్పదంగా పరిణమించేవి పరిషత్తు చరిత్రలో మొదటిసారిగా ఒక హాస్యప్రధానమైన నాటకం ప్రదర్శించబడింది. 'ఫార్సు' ఏవిధంగా ప్రదర్శించాలో తెలిసి ప్రదర్శించారు ఐ. ఎన్. టి. (హైదరాబాదు) వారు. ఒకటి రెండు పాత్రల నటనలో అక్కడక్కడ లోపాలు కనిపించినా, ప్రదర్శన లోపరహితంగా ఉంది. పాత్రధారులనటన ఉత్తమస్థాయిలో ఉంది. ఒకటి రెండు పాత్రలు ఉన్నతస్థాయి నటనా ప్రతిభను వ్యక్తంచేశారు. 'అధికారి' నాటకానికి పరిషత్తులో ఏ బహుమానమూ రాలేదు.

రచయిత ఒక నాటకం రాయడానికి పూనుకొంటాడు. ఒక సన్నివేశం సృష్టిస్తాడు. ఆ పాత్రదారుల మన సత్వాల ననుసరించి సన్నివేశం అతను అనుకొన్నవిధంగా కాక మరోవిధంగా పరిణామాల నిస్తుంది. అతడు చేసిన రెండవ ప్రయత్నం కూడా విఫలమౌతుంది. అనుకొన్న ఫలితాలకు దారి తీసేటట్టు పాత్రలు నడుచుకొనేటట్లు ప్రయత్నించి మూడోసారి రచయిత విజయంసాధిస్తాడు. కథారచనకుగాని నాటకరచనకుగాని ఉపక్రమించిన రచయిత ఎవరైనా-ఉత్తమ రచయిత ఎవరైనా - ఈ అనుభవాలకు సాక్ష్యం పలుకుతాడు. ఈ అనుభవాలను ఇతివృత్తంగా తీసుకొని డా. గంగాధరం 'తెరలో తెర' అనే నాటకం రచియించారు. నాటకంలో రచయిత సుధాకరంగా రచయిత డా. గంగాధరం చక్కగా నటించారు. మిగిలిన పాత్రధారులుకూడా తమ తమ పాత్రలను అర్థంచేసుకొని నటించారు. ముఖ్యంగా మూడవ రంగంలో దాదాపు అన్ని పాత్రలను రంగస్థలంపై నిలిపి 'గ్రూపింగు'లో మరో విజయాన్ని సాధించారు ప్రదర్శకులు. ఇటువంటి విజయం 'దొంగవీరడు'లో కాని, 'పంజరం'లో కాని, 'అధికారి'లో కాని కనబడలేదు. 'తెరలో తెర' చూసిన తర్వాత, ఆ నాటకం రచన బహుమతికి అర్హమేమో అనిపించింది. ఒకరు ఒకరిద్దరు పాత్రధారులు ప్రత్యేక బహుమతి సంపాదించుకోగలరేమో అనిపించింది. నటనకు గాని, రచనకు గాని, ప్రదర్శనకు గాని 'తెరలో తెర' ఏ బహుమానానికీ నోచుకోలేదు.

"పంజరం" నాటకం మధ్యలో ప్రదర్శకులు రంగస్థలంపైగల దీపాలన్నీ ఆర్పివేస్తారు. రంగస్థలంపై ప్రేక్షకులకు దగ్గరగా ఉన్న "ఉన్మాద" పాత్రధారి రంగస్థలం వెనుకనున్న గవాక్షంవద్దకు చేరుకుంటాడు. గవాక్షం వెనుకనుంచి వెలుతురు పడుతూంటుంది. 'వింగ్సు'లోనుండి స్పాటులైటులో నుండి మొదట కంగారుగా అటూ ఇటూ కదిలి చివరకు ఉన్మాదుడి మొహంపై పడుతుంది. ఇది ప్రదర్శనలో క్షమించరాని లోపం. టెలిఫోను మ్రోగితే, మాధవ పాత్రధారి రిసీవరు ఎత్తి మాట్లాడి మళ్ళీ రిసీవరును 'ప్రాస్'పై పెట్టేస్తాడు. ఇంతలో నాయకుడు పరుగెత్తుకువచ్చి, రిసీవర్ ఎత్తి టెలిఫోన్‌లో ప్రసంగిస్తాడు! ఆ నాయక పాత్రధారికి ప్రత్యేక బహుమతి లభించింది. నాటకానికి ప్రదర్శనకి ద్వితీయ బహుమతి లభించింది. దొంగవీరడు నాటకంలో ఇంటి కాంపౌండు గోడకున్న తలుపుకి తెరలు కట్టేరు. గురవయ్యశెట్టి మొహం మీద ఉమ్మేసి, అతన్ని రెండు మాగుపార్లు క్రిందపడేసి, ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించారు ప్రదర్శకులు. ధన్యుడు గురవయ్యశెట్టి బహుమతి నందుకొన్నాడు. 'దొంగ

(12- వ పేజీ చూడండి)



జి. మహేశ్వరి

గూడూరు నాటకోత్సవాలలో 'పునర్జన్మ' ప్రథమ బహుమతి పొందిన బాలనటి.

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘం

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో 1958 జులై 1-వ తేదినుంచి 'బాలలసంఘం' ఒకదాన్ని స్థాపించబోతున్నాము. జులై 1-వ తేదినాటికి 15 సంవత్సరాల వయస్సు నిండని, ఆరేళ్ళ వయస్సుకు తక్కువగాని ప్రతి తెలుగుబాలుడూ, బాలికా సభ్యత్వం పొందవచ్చు. సభ్యత్వానికి రుసుము ఏమీ చెల్లించవలసిన పనిలేదు. తెలుగు బాలబాలికలందరూ వెంటనే సభ్యులుగా చేరి సచిత్ర వారపత్రిక అప్పుడప్పుడు నిర్వహించే చిన్న చిన్న పోటీలలో పాల్గొని "సంఘం" ఆశయాలను జయప్రదం చేయడానికి సహాయపడతారని ఆశిస్తున్నాము.

### గమనిక

పదకొండు మొదలు 15 సంవత్సరాలవరకూ వయస్సుగలవారిని 'A' వర్గంగానూ, ఆరు మొదలు 10 సంవత్సరాల వయస్సువరకూ గలవారిని 'B' వర్గంగానూ విభజించడం జరుగుతుంది.

## ముఖ్య విషయాలు

సభ్యులుగా చేరదలచిన బాలబాలికలు చేయవలసిందొకటే. దీనితోపాటు ఒక సభ్యత్వపు దరఖాస్తును ముద్రిస్తున్నాము. అందులోని ఖాళీస్థలాలను మీ వివరాలతో జాగ్రత్తగా నింపి (కొట్టివేతలు, దిద్దుపులు ఉండకూడదు.) ఆ అచ్చు దరఖాస్తును తిన్నగా కత్తిరించి కవరులో

సంపాదకుడు,
ఆంధ్ర పత్రిక సచిత్ర వారపత్రిక,
తంబుచెట్టివీధి, మద్రాసు-1.

అనే చిరునామాకు పంపాలి. కవరుమీద వెనుకవైపు "సచిత్ర వారపత్రిక బాలల సంఘం" అని స్పష్టంగా వ్రాయాలి. మామూలు కాగితాలమీద వ్రాసిపంపే దరఖాస్తులను స్వీకరించము.

ఒక్కొక్క దరఖాస్తుమీదా ఒక్కొక సభ్యుని, లేదా, సభ్యురాలి పేరుమాత్రమే వుండాలి. సభ్యత్వపు దరఖాస్తును సచిత్ర వారపత్రికలో సాధ్యమైనంతవరకు వారం వారం ప్రచురిస్తుంటాము.

పూర్తిచేసిన దరఖాస్తుతోపాటు ఒక్కొక సభ్యుడూ 8 నయాపైసల తపాలా బిళ్ళలు పంపితే, సభ్యులుగా చేర్చుకున్నట్లు ఒక్కొకరి పేరా విడివిడిగా ఒక్కొక సభ్యత్వపు కార్డును పంపుతాము. ఆ కార్డుమీద సభ్యత్వ క్రమాన్ని సూచించే ఒక సంఖ్య వుంటుంది. ముందు ముందు సభ్యులుగాని, సంఘంగాని జరిపే ఉత్తర ప్రత్యుత్తరాలలో ఆ సంఖ్యను ఉదహరిస్తూండడం జరుగుతుంది.

పదిహేనేళ్ళ వయస్సు పూర్తికాగానే, ఆ తేదీతో బాలల సంఘంలో సభ్యత్వం దానంతటదే రద్దయిపోతుంది.

## లక్ష్యాలు

(1) సభ్యులుగా చేరే బాలబాలికలను ఆరుమొదలు పదేళ్ళవరకూ ఒక వర్గంగానూ (B), పదకొండు మొదలు పదిహేనేళ్ళవరకూ మరొకవర్గంగానూ (A), విభజించి ఉభయ వర్గాలకూ విడివిడిగా అప్పుడప్పుడు రెండురకాల పోటీలు నిర్వహించి ప్రథమశ్రేణిలో నెగ్గేవారికి మాకు తోచిన బహుమతుల నివ్వడం (ఈ విషయంలో పోటీనిర్వాహకకర్తలదే తుదినిర్ణయం)

(2) సభ్యులలో వారివయస్సుకు తగినట్లుగా రచనాశక్తినీ, పఠనాశక్తినీ, కళాభిమానాన్నీ యథాశక్తి పెంపొందచేయడం.

(3) చిత్రలేఖనం, నృత్యం, అభినయం, గాత్రం, వీణ, వయొలిన్ మొదలయిన లలిత కళలలోనూ, వ్యాయామక్రీడలలోనూ ప్రత్యేక అభిరుచి, ప్రవేశం కనబరిచే బాలబాలికలను బహుమతులద్వారానూ, తదితరవిధంగానూ ప్రోత్సహించడం.

(4) ఏ ప్రాంతంలో నివసిస్తున్నవారైనప్పటికీ తెలుగు బాలబాలికలందరిమధ్యా స్నేహ సమైక్యభావాలను పెంపొందజేయడం.

(5) ఉన్నత పాఠశాలలలో చదివే విద్యార్థులకు ఉచిత విద్యార్థివేతనాలను బహూకరించడం. (దీనికి సంబంధించిన వివరాలను ముందుముందు ప్రకటిస్తాము) ★

---

ఆంధ్ర సచిత్ర వారపత్రిక
**బాలల సంఘం**
[సభ్యత్వపు దరఖాస్తు]

GROUP
**A లేక B**

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో) ....

పుట్టినతేదీ, నెల, సంవత్సరం: జులై 1 నాటికి వయస్సు ఏండ్లు: నెలలు: ....

తండ్రి, లేక, సంరక్షకుని పూర్తి పేరు: ....

ఊరిపేరు, జిల్లా, తాలూకా, పోస్టు [వీధి: నెంబరు] ....

* చదువుతున్న తరగతి, లేక, ఫారము: ....

పాఠశాల పేరు: ....

ప్రధానోపాధ్యాయుని పేరు (తెలిస్తే):

అయ్యా:

ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘంలో నన్ను సభ్యునిగా/సభ్యురాలుగా చేర్చుకొన ప్రార్థన. పైన వ్రాసిన విషయాలన్నీ యథార్థములు.

ఇట్లు

[తేదీ: -1958]

(సంతకము)

* గమనిక! ఏ పాఠశాలలోనూ గాక ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు. 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా 'ప్రైవేట్ స్టడీ' అని వ్రాయాలి.

సంచిక: **2-7-58** | ఈ దరఖాస్తు **5-7-58** నాటికి మాకు చేరాలి |

# నేను వ్రాసిన కథలు

కృష్ణమూర్తికీ, రాఘవయ్యకూ ఇద్దరిమధ్య వరాకత్తు గోడదగ్గర తగాదా వచ్చింది. మాటలు ముదిరి చేతులు కలిసేదాకా వస్తే అక్కడ చేరిన నలుగురూ ఇద్దర్నీ విడదీశారు.

ఆ మర్నాడు ఉదయం కృష్ణమూర్తి ఇంటి వసారాలో కూర్చుని, నిన్న రాఘవయ్యకూ తనకూ జరిగిన తగాదానుగురించి తలపోసుకుంటూ వుండగా రంగయ్య వచ్చాడు. కృష్ణమూర్తి రంగయ్యనుచూసి ఆశ్చర్యపోయ్యాడు. రంగయ్య తన ఇంటికి రావడం తన కళ్ళను తాను నమ్మలేకపోయ్యాడు. రంగయ్యకూ, తనకూ విరోధం. ఒక విషయంలో రంగయ్య తన మీద శత్రుత్వం పూని, రెండు మూడేళ్ళనించి తనతో మాట్లాడటం మానివేశాడు. రంగయ్య మీద తనకేమీ విరోధంలేదు. ఆ మధ్య రంగయ్య బజారునుంచి వస్తుంటే కృష్ణమూర్తి పలకరించినా అతడు పలక్కుండా వెళ్ళిపోయ్యాడు అదివరకు ఇద్దరూ ఎంతో సన్నిహితులు; చాలా స్నేహంగా వుండే వాళ్ళు. అసలు ఈ విరోధానికి కారణం యేమిటంటే కృష్ణమూర్తి ఒక కేసులో రంగయ్యమీద వ్యతిరేకంగా సాక్ష్యమిచ్చాడు. కృష్ణమూర్తి రంగయ్య మీది ద్వేషంచేత అట్లా చెప్పలేదు; అతడు కోర్టులో నిజం చెప్పాడు. అది అతణ్ణి వెడిసి కొట్టింది. అదే రంగయ్య విరోధానికి కారణం. అప్పటినుంచి రంగయ్య కృష్ణమూర్తితో మాటాడటం మానివేశాడు. తర్వాత కృష్ణమూర్తి రంగయ్యతో విరోధం తెచ్చిపెట్టకున్నందుకు పశ్చాత్తాపపడ్డాడు.

నిజం నిలకడమీదగాని తెలియదు. రంగయ్య నిజాన్ని గ్రహించి తన తప్పు తాను సవరించుకొని, ఇప్పుడు తన ఇంటికి వచ్చాడు అని కృష్ణమూర్తి మనసులో అనుకుని వచ్చిన రంగయ్యను ఆప్యాయంగా పలకరించి కుర్చీలో కూర్చుండ జేసిన మీదట "మీ చెల్లెల్ని అత్తవారింటికి పంపావా కృష్ణమూర్తీ?" అని అడిగాడు రంగయ్య.

"పంపేశా రంగయ్యన్నా! అదో మద నమే సంబంధం దొరికింది కుర్రవాడుమంచి వాడు కాదు. అకాయగోకాయగా తిరిగే తరం. మొన్న మామవచ్చి అమ్మాయిని తీసుకెళ్ళాడు" అని చెప్పాడు కృష్ణమూర్తి.

"ఇంతకీ రాసిపెట్టి వున్నదాన్ని ఎవరు తప్పించగలరులే! మేమూ ఒక సంబంధం చేసి అఘోరిస్తున్నాం. యెక్కువ కట్నాలు పెట్టలేక ఏదో సంబంధం దొరికిందిగదా అని మా రెండోపిల్లనిచ్చి చేస్తే వాళ్ళతో నానా అవస్థలూ పడుతున్నాం యెందుకు తే చెప్పుకోవడం?" క్షణం ఆగి "అయితే నువ్వూ, రాఘవయ్యా హోరాహోరీ పోట్లాడుకున్నారటగా?" అని అడిగాడు రంగయ్య.

"అవును రంగయ్యన్నా వాడికేంపొయ్యే కాలం వచ్చిందో. వాళ్ళకూ, మాకూ మధ్య గోడ కట్టిస్తూ మావైపు జానెడు పైచిలుకు స్థలం కలుపుకుని పునాదులు తీశారు అదేమంటే పోట్లాటకు వచ్చాడు" అని చెప్పాడు కృష్ణమూర్తి.

"అంతా విన్నాను కలిసేస్థలం జానెడు కానీ, బెత్తెడుకానీ మళ్ళా రమ్మంటేవస్తుందా? స్థలం యెంత విలువైంది? వెయ్యి వరహాలు పెటినా పోయినస్థలం మళ్ళా దొరుకుతుందా? సామ్యం పోయి శనీ పట్టినట్లు అతి

**అందే నారాయణస్వామి**

గాడు నిన్న నానా మాటలూ అన్నాడటగా?" అని అడిగాడు రంగయ్య

నిజానికి కృష్ణమూర్తి, రాఘవయ్య ఇద్దరూ సమంగా అనుకున్నా రంగయ్య అడిగిన ప్రశ్నకు కృష్ణమూర్తి రెచ్చిపోయి "వాడి నోటికి హద్దాపద్దా రంగయ్యన్నా వాడి యిష్టం వచ్చినట్లల్లా కూశాడు" అన్నాడు ఉద్రేకంతో.

"వాడికి కళ్ళు నెత్తిమీదకొచ్చినై ఏమి చూసుకునో ఈ అహంకారం" అన్నాడు రంగయ్య.

"తిట్టడమేమిటి రంగయ్యన్నా, కొటటానికి మీదిమీదికి వచ్చాడు" అన్నాడు కృష్ణమూర్తి.

"నువ్వు మంచివాడివి కాబట్టి సరిపోయింది నువ్వు తలుచుకుంటే నీకింద వాడు యెంతమనిషి!" అన్నాడు రంగయ్య.

"వాడంటే ఓరెక్కా నాకు గుఱ్ఱం-గాడిదా ఒకటవుతుందని వూరుకున్నా గాని" అన్నాడు కృష్ణమూర్తి.

"వాడు నిన్నన్న మాటలూ, అవీ విని వుండబట్టలేక పొయ్యానంటే నమ్ము కృష్ణమూర్తీ! కాలు ఇంటివద్ద నిలవలేదు" అన్నాడు రంగయ్య.

"నామీద మీకుగలదయకు నిదర్శనంఅది" అన్నాడు కృష్ణమూర్తి.

"ఏమి నిదర్శనం ఏమిటో! వట్టివట్టిమాటల వల్ల ఏంలాభం: మళ్ళా నీస్థలం నీవు కలిపిన రోజున సంతోషిద్దాం" అన్నాడు రంగయ్య.

"పునాదు లేమో తేస్తున్నవి ఇప్పుడేమిటి దారి రంగయ్యన్నా?" అని అడిగాడు కృష్ణమూర్తి.

"దారికేం మంచిదారే వున్నది. సివిల్, క్రిమినల్ రెండు చర్యలూ [illegible] నాకోటివాడినటయితే ఇప్పటి [illegible] స్థలం ఆక్రమణచేసినందుకు దావా [illegible] నందుకు ఛార్జితగిలించి వాడిరోగం [illegible] వాణ్ణి. స్థలం పోతూవుంటే యెవరు మాత్రం వూరుకుంటారు?" అన్నాడు రంగయ్య.

"నేనుమాత్రం వూరుకుంటానటన్నా రంగయ్యన్నా! వాడి యెముకలు యేరను? స్థలం కలుపుకుందిగాకుండా పైగా తిడతాడా! వీణ్ణి వదిలిపెడతానని అనుకోవద్దు" అని ఉద్రేకంతో అన్నాడు కృష్ణమూర్తి.

పురియెక్కించి చక్కా వెళ్ళిపోయ్యాడు రంగయ్య. కృష్ణమూర్తికీ, రాఘవయ్య స్థలం కలుపుకున్నాడన్న విచారంకంటే అందుమూలకంగా మళ్ళీ రంగయ్య ప్రాపకం కలిగినందుకు యెన్నోరెట్లు సంతోషదాయకంగా వుంది. రంగయ్య ఆకాయగోకాయ మనిషి కాడు. గ్రామంలోని పెద్దమనుషుల్లో ఒకడు. మాట పొందలవున్నవాడు. అతను పూనుకున్నాడంటే ఏ సహాయమైనా చేసిపెట్టగలడు. ఇన్నాళ్ళ తలవని తలంపుగా రంగయ్య ప్రాపకం కలగడం ఎంత అదృష్టం అని పొంగిపోయింది కృష్ణమూర్తి హృదయం.

తర్వాత నాలుగు రోజులకు రంగయ్య ఉదయానే తనయింటి వసారాలో కుర్చీలో కూర్చున్నాడు. ఇంటిముందు ఖాళీస్థలంలో కట్టివేసిన గేదె పడుకుని నిశ్చింతగా నెమరు వేస్తున్నది. సూర్యకిరణాలు వేప చెట్టు సందుల్లోనించి వసారాలో పడుతున్నవి. రంగయ్య కుర్చీలో కూర్చుని ఒక విషయాన్ని గురించి దీర్ఘంగా ఆలోచిస్తున్నా

రాఘవయ్యకూ, రంగయ్య అల్లుడికీ దావా జరుగుతున్నది. రాఘవయ్యకు రంగయ్య అల్లుడు బాకీ. దాదాపు మూడేళ్ళ క్రితం ఇద్దరూ కలసి జాయింటుగాచేసిన వ్యాపారం తాలూకు బకాయిపడిన సొమ్ము వందలకు రాఘవయ్యకు రంగయ్య అల్లుడు ప్రోనోటు వ్రాసియిచ్చాడు. ఆ నోటుకు

# ★ తేనెపూసిన కత్తులు ★

కాయిదా లేకపోవడంవల్ల రాఘవయ్య వడ్డీతో సహా దావా వేశాడు. దావా నోటీసులు వచ్చినతరవాత రంగయ్య రాఘవయ్య దగ్గరకువెళ్ళి నోటుబాకీ పరిష్కారం చేసుకోమని అడగ్గా రంగయ్య అల్లుడు ఆసిపరుడు కావడంవల్ల, తన బాకీ దమ్మిడీలతో వచ్చే అవకాశం వున్నందున రాఘవయ్య బాకీ తగ్గించి తీసుకోడానికి ఒప్పుకోలేదు. అందులో రాఘవయ్య ధనవంతుడేమీ కాదు వేళకుతింటూ మర్యాదగా బ్రతుకుతున్నవాడు. రంగయ్య తన మేనల్లుడికే కూతురిని యిచ్చాడు. మేనల్లుడిది ఆగ్రామమే. మేనల్లుడికి కోర్టు వ్యవహారాలేమీ తెలియవని ఆభారమంతా తానే వహించి దావాలో అలుడి తరఫున తానే పని చేస్తున్నాడు. బాకీ రొఖ్ఖ పూర్వకంగా యిచ్చిందికాదని రంగయ్య అల్లుడిచేత కోర్టులో అన్సరు పెట్టించాడుగానీ చేతులారా వ్రాసియిచ్చిన ప్రోనోటు చెల్లకయెక్కడికిపోతుంది? తమ అన్సరు నిలవదని రంగయ్యకు తెలుసు. డిక్రీ అయిందంటే అమలు జరిపి కోర్టుద్వారా దమ్మిడీలతో సహా రాబట్టుకోగలడు. డిక్రీ కాకముందే బాకీ పరిష్కారం అయ్యేమార్గం యేమిటా అని అతని ఆలోచన.

అట్లా ఆలోచిస్తున్న రంగయ్యకు వీధి కి వెళ్ళుతున్న వో వ్యక్తి గుమ్మంగుండా కనిపించగా రంగయ్య చివాలున లేచి "తిరపతయ్యా! తిరపతయ్యా!" అని కేక వేశాడు. తిరపతయ్య లోనికివచ్చి రంగయ్య వరసను కుర్చీలో కూర్చున్నాడు. తిరపతయ్య రాఘవయ్య తమ్ముడు.

రంగయ్య "ఎందాకా బయలుదేరావు తిరపతయ్యా?" అని లాంఛనంగా అడగ్గా అతడు "ఇక్కడికే నండి" అని ముక్తసరిగా జవాబు చెప్పాడు.

రంగయ్య ఇక ఉపక్రమించాడు, "మొన్న మీ వాడికీ, కృష్ణమూర్తికీ గోడ దగ్గర తగాదా జరిగిందటగా?" అని అడిగాడు రంగయ్య.

"అవునండి జరిగిందట నేను వూళ్ళో లేను" అన్నాడు తిరపతయ్య.

"ఇద్దరికీ బాగా ముదిరిందట! హోరాహోరీ పోట్లాడుకున్నారట! చేతులుకూడా కలిసినయ్యట!" అన్నాడు రంగయ్య.

"అట్లాగా!" అన్నాడు తిరుపతయ్య.

"చెప్పొద్దూ! కృష్ణమూర్తి మీ అన్నమీద దండెత్తాడు. అతణ్ని తిట్టి కొట్టినందుకు ఛార్జీ, స్థలం ఆక్రమణ చేసినందుకు దావా రెండూ వేశాడు. అతనికి బలమైన సాక్ష్యం వున్నది. ఇదంతా నాకేం తెలుసు? మొన్న కృష్ణమూర్తి నన్ను పిలుపించుకుని ఈ కథంతా చెప్పి నా రెండు చేతులు పట్టుకుని ఈ విషయంలో తనకు సహాయం చెయ్యమని కోరాడు. అతని ఉద్రేకం, అతని పట్టుదల చూస్తే చాలాదూరకు పొయ్యేటట్టు కనిపించాడు. అతనికి దిటమైన చేతులు కమ్మక్కి కూడా వున్నది. ఇంతకీ ఇదంతా నీతో యెందుకు చెపుతున్నానంటే! ఒక వ్యక్తికి అపకారం జరుగుతుండంటే చూసి సహించే ఘటం కాదు నాది! ఇద్దరిమధ్యా చేరి అటు నాలుగు ఇటు నాలుగు పుల్లలు వేసి తగాదా పెంచేబాపతు కాదు మనది! మీ అన్నయ్యతో జాగ్రత్తగా మసులుకోమని నేను చెప్పినట్టుగా చెప్పు. ఒక్కడిబాగేం బాగు? అంతా బాగుండాలి" అని రంగయ్య చెప్పగా "సరే మా అన్నయ్యతో చెపుతాలేండి" అంటూ తిరుపతయ్య వెళ్ళిపొయ్యాడు.

ఆ సాయంత్రం రంగయ్య ఇంటి వసారాలో కూర్చుని యేదో కాగితాలు చూసుకుంటూవుండగా రాఘవయ్య వచ్చాడు. రాఘవయ్య రావడంచూచి రంగయ్య తన పాచిక పారినందుకు లోలోన ఉప్పొంగిపొయ్యాడు. ఇద్దరూ అదివరకు మాట్లాడుకునేవాళ్ళేగానీ దావా జరుగుతున్నప్పటినుంచి మాటాడడం మానివేశారు. వచ్చిన రాఘవయ్యను రంగయ్య సగౌరవంగా ఆహ్వానించి కూర్చోమన్నాడు. రాఘవయ్య కుర్చీలో కూర్చుని "చూశారా రంగయ్యగారు! కృష్ణమూర్తిగాడి దుర్మార్గం? మేము గోడ కట్టుకుంటూవుంటే తన స్థలం కలుపుకున్నామని నానా మాటలూ అని పైగా కొరకొచ్చాడట! మా తిరపతయ్య చెప్పిందికాకుండా ఈ సంగతి అదివరకే విన్నాను. ఎందుకు పుట్టిందో ఈ బుద్ధి! తాను దగ్గర వుండి కట్టినగోడ పగలకొట్టేస్తాడట. గోడ పగలకొట్టడం వాడితరమవుతుందా? నా గొంతులో వూపిరి వుండగా ఆపని చెయ్యలేడు. వాడికి పొయ్యేకాలం వచ్చింది. అందుకే ఈ బుద్ధులు! ఈ విషయంలో మీరు నాకు కాస్త సహాయంగా నిలబడాలి" అని చెప్పాడు రాఘవయ్య.

"మొన్న కృష్ణమూర్తి నన్ను తన ఇంటికి పిలిపించుకుని కథంతా చెప్పి తనకు సహాయం చెయ్యవలసిందని నా రెండుచేతులు పట్టుకన్నాడు. అతను ముందుగానే అన్ని ప్రయత్నాలు చేస్తున్నాడు!" అన్నాడు రంగయ్య.

"తగాదాకు కూర్చున్నవాడు ఎందుకు చెయ్యడూ? అట్లా కాదు మీరు న్యాయం విచారించాలి. అక్రమానికి యెవరు కూర్చున్నారో నిజం తెలుసుకోవాలి. మీ అల్లుడి బాకీకూడా మనం యేదో విధంగా పరిష్కారం చేసుకుందాం. మీరు నాతటు నిలబడాలి. మీరు దేవుడంటివారు. లేకపోతే మా తమ్ముడిచేత నాకెందుకు కబురుచేస్తారు? అన్నాడు రాఘవయ్య.

రంగయ్య నవ్వి ఇదిగో రాఘవయ్యా! అటూ ఇటూ చేరి అటు నాలుగు పుల్లలు ఇటు నాలుగు పుల్లలు వేసి, తగాదా పెంచే బాపతుకాదు మనది. కోర్టుకెక్కవాళ్ళను చూస్తే నాకు తగని రోత. అందుకనే మీ తమ్ముడిచేత నీకు కబురుచేశాను. పట్టుదలలు పెట్టుకుంటే మీరిద్దరూ చెడిపోతారు. నేను చెప్పేదేమిటంటే ఇద్దరూ రాజీ చేసుకోండి. నా సర్వశక్తులూ వినియోగించి మీ ఇద్దరికీ రాజీ చెయ్యడానికి ప్రయత్నిస్తాను. నేను చెప్తే ఈ వూళ్ళో కాదనేవాళ్ళెవరు! కృష్ణమూర్తి ఇంత భీంకారాలు తీస్తున్నా

[ స్కూలుకు ఇన్స్‌పెక్టరుగారు వచ్చారు. టీచరు ప్రశ్నలతో సహా జవాబు చెపుతూ పిల్లల్ని ప్రశ్నిస్తున్నాడు. పిల్లలు వెంటనే సమాధానం చెబుతున్నారు.

"మన వూరి పెద్ద ఎవరు? మునసబుగారి అబ్బాయి! నువ్వు చెప్పు?"

"మా అమ్మ"

"మీ అమ్మ ఏమిటి?" ప్రశ్నించారు ఇన్స్‌పెక్టరుగారు.

"వూరు అంతటికి మానాన్న పేరు చెబితే హడలు. కాని మానాన్నకు మా అమ్మపేరు చెబితే!!!" ★

—బోసుబాబు]

నేను చెపితే యెందుకు వినడో చూస్తాను. అయితే కోరక్క వాళ్ళను మాస్తే కోతని ముందే చెప్పాకదు. మా అల్లుడూ నువ్వూ ఇద్దరూ కలిసి కోర్టువాళ్ళను బాగుచెయ్యడం దేనికి? అదికూడా పరిష్కారం చేసుకోండి. మన కంటబడ్డ యెటువంటి తగాదా అయినా ఇక్కడే పరిష్కారం కావలసిందే! చెప్పాదూ మా అల్లుణ్ణి గురించే నాకు విచారం. అతగాడి సంసారం ఈ మధ్య లోటుకుపడ్డది. పైకి డంబాచారంగావున్నా లోగుట్టు యెవరికి తెలుస్తుంది?" అన్నాడు రంగయ్య. అల్లుడి పరిస్థితులు బాగున్నా రంగయ్య తన లౌకిక జ్ఞానాన్ని వుపయోగించి రాఘవయ్య యెదట అలా చెప్పాడు.

రాఘవయ్య రంగయ్యను పొగడుతూ సంతోషంగా వెళ్ళిపోయ్యాడు.

ఆ మూడవరోజున రంగయ్య అల్లుడి బాకీ పరిష్కారంతోపాటు, కృష్ణమూర్తి రాఘవయ్యల వ్యవహారంకూడా రాజీ అయిపోయింది. దీనితో ఎటువంటి వ్యవహారాలయినా అంతలో పరిష్కారంచేస్తాడనీ, ధర్మరాజనీ గ్రామంలో రంగయ్య వాసి పెరిగింది.

తర్వాత దాదాపు రెండు మాసాలకు ఒకనాటి ఉదయానే రంగయ్య పొలం వెళ్ళివచ్చి అతివృష్టివల్ల పొలాల్లో నీరు నిలిచి పైరు మునిగిపోవడంవల్ల ఈ సంవత్సరం పంట యెట్లానా అన్న విచారంతో వసారాలో కుర్చీలో కూర్చుని వుండగా అల్లుడు వచ్చి "విన్నావా మామయ్యా కృష్ణమూర్తి చెల్లెలు ఇంట్లో ఉరివేసుకుని చచ్చిపోయిందట! వాళ్ళ యింటిముందు జనం మూగారు" అని చెప్పాడు.

ఆమాట వినేసరికి విచారంతో వున్న రంగయ్య ముఖం వికాసవంతమైంది. "అల్లాగా! చిక్కాడు! ఈదెబ్బతో వాడి అంతు కనుక్కోవాలి" తనలో తాను అనుకున్నట్టు అన్నాడు.

ఈవార్త వినగానే రంగయ్య యెంతో విచారపడి కృష్ణమూర్తిని ఓదార్చడానికి వెళతాడని తలచిన అల్లుడు రంగయ్య అన్న మాటలకు విసుపోయి ఒకవేళ యెవరని భావించాడో అనుకుని "రాఘవయ్య ఇంటి పరపన వున్న మన కృష్ణమూర్తి మామయ్యా" అని మళ్ళా చెప్పాడు.

"అవును వాడేరా! దుర్మార్గుడు! లోగడ మనకు వ్యతిరేకంగా సాక్ష్యమిచ్చి యెటువంటి దెబ్బ కొట్టాడు! మొన్న వాణ్ణి కలుపుకున్నామంటే ఓ కార్యం సాధించటానికి కలుపుకోవలసి కలుపుకున్నాం. వాడు మనకు చేసిన అపకారం యెక్కడికి పోయింది? దుర్మార్గుడికి సమయం వచ్చినప్పుడే తగిన శాస్తి చెయ్యాలి!" అంటూ రంగయ్య లోనికి వెళ్ళి చొక్కా, ఉత్తరీయం వేసుకుని వడివడిగా వీధిలోకి వెళ్ళిపోయ్యాడు. 




# 60 వేలమంది కొత్త ఉపాధ్యాయులు

మానవునిపై మరికొన్ని పెట్టుబడులను గూర్చి ఈ మధ్య వార్తలు వచ్చాయి. కాంగ్రెసు కార్యదర్శులలో ఒకరైన శ్రీ శ్రీమన్నారాయణ్‌ను ప్లానింగ్ సంఘంలో సభ్యులుగా నియమించారు. విద్యావంతుల్లో నిరుద్యోగాన్ని తగించటానికిగాను వచ్చే మూడేళ్లలో ప్రాథమిక పాఠశాలలకు 60 వేల మంది ఉపాధ్యాయులను నియమిస్తామని ప్రభుత్వం ప్రకటించింది. వీరికయ్యేఖర్చును, పాఠశాలలకు అయ్యేఖర్చును నయా పైసలతో సహా ప్రభుత్వమే భరిస్తుంది. ప్రభుత్వంపై ఈ కార్యక్రమ భారం రెండవ పంచవర్ష ప్రణాళిక ఆఖరు వరకూగాని, డా॥ కె. ఆర్ శ్రీమాలి స్టేట్ మంత్రిత్వం ఉన్నంత కాలంగాని ఉంటుంది.

స్వాతంత్ర్యానికి ముందు టాటా–బిర్లా ప్రణాళిక ద్వారా శ్రీ శ్రీమన్నారాయణ్ పైకివచ్చారు. తరవాత గాంధేయ ప్రణాళికను కూడా ఈయన తయారు చేశారు. స్వాతంత్ర్యం రావటంతో ఈయన కూడా న్యూఢిల్లీ వచ్చేశారు. తరవాత కాంగ్రెసు కేంద్ర కార్యాలయంలో ప్రవేశించారు. కాంగ్రెసు 'ఎకనామిక్ రివ్యూ' ఈయన విడవకుండా వ్యాసాలు వ్రాసేవారు. ప్లానింగ్ సంఘంలో ఈయన శ్రీ గుల్జారీలాల్ నందా అభిప్రాయాలను బలపరుస్తారు. అనగా చర్ఖా ఖాది మద్యనిషేధం బలపడతాయన్నమాట.

శ్రీ శ్రీమన్నారాయణ్‌కు కొత్త ఉద్యోగం కల్పించటంతో కొన్ని ప్రశ్నలు బయలుదేరుతాయి. కాంగ్రెసు సంస్థ ఇప్పటికే బలహీనంగా ఉంది. నిర్మాణ కార్యక్రమంలోను, ముఖ్యంగా కాంగ్రెసు సంస్థ కార్యక్రమంలోను శ్రద్ధగాపనిచేసే అగ్రనాయకులు క్రమంగా కరువైపోతున్నారు. కాంగ్రెసులో శ్రీ శ్రీమన్నారాయణ్ చాలా చురుగ్గా వ్యవహరించేవారు. ఆయన స్థానాన్ని మళ్ళీ అలాంటి మనిషితో భర్తీచేయటం కష్టమే. 'సాను ప్లానింగ్ సంఘ సభ్యత్వం అక్కర్లేదని ఆయన చెప్పేసి ఉండవలసిందని ఇక్కడ కొందరి అభిప్రాయం. కాంగ్రెసునుంచి శ్రీ శ్రీమన్నారాయణ్ లాంటివ్యక్తిని ప్రభుత్వం లాగేసుకోవటం అంత మంచిపని కాదని మరి కొందరి అభిప్రాయం.

60 వేల మంది ప్రాథమికోపాధ్యాయుల మీద పెట్టిన పెట్టుబడికి వెనకాల కొంత భాగవతం ఉన్నది. రెండవ ప్రణాళికలో విద్యాశాఖకు కేటాయించిన ధనాన్ని విదేశ ద్రవ్యమారకం మొదలైనవాటి ఇబ్బందుల

శ్రీ కృష్ణ
[ ఆంధ్రపత్రిక ప్రతినిధి ]

మూలంగా అంతా ఖర్చుచేయలేకపోయారు. దేశంలోకూడా తగినంత డబ్బు సమకూడక పోవటంవలన ప్రణాళికలో రూ. 300 కోట్ల దాకా తగ్గిస్తున్నప్పటికీ, విద్యాశాఖకు మొదట్లో కేటాయించిన డబ్బును మాత్రం తగ్గించే శక్తి ఏ మానవమాత్రుడికీ ఉన్నట్లు లేదు. అందుచేత ఖర్చు చేయలేకపోయిన ధనాన్నికూడా ఏదో విధంగా తగలెయ్యక తప్పదు. సరేనని చెప్పి, విద్యాశాఖకు కర్పూర హారతిగా ఈ డబ్బు తగలేస్తున్నారు. ఒక పక్కన నిరుద్యోగాన్ని పెంచివేయటం, మరో పక్కన ఆ నిరుద్యోగాన్ని తగ్గించటానికి కొన్ని చర్యలు తీసుకోవటం చూస్తే అసలు నిరుద్యోగ సమస్యను పరిష్కరించాలనే శ్రద్ధ ప్రభుత్వానికున్నదా అని సందేహం కలుగుతోంది. మద్య నిషేధం వలన నిరుద్యోగం ఎంత అధికమైపోతుందో అనే ఆలోచనైనా లేకుండా ప్రభుత్వం మద్య నిషేధ విధానాన్ని అమల్లో పెట్టింది. నిరుద్యోగం పెరిగితే పెరిగింది, నైతికంగా ప్రజలు బాగుపడతారుగదా అని ప్రభుత్వం తన విధానాన్ని సమర్థించుకోవచ్చు. కాని దిగుమతి విధానం ఫలితంగా ఏర్పడిన నిరుద్యోగాన్ని నైతికంగా ఎలా సమర్థిస్తారు? మామూలుగా నిరుద్యోగులపై ఎంతో సానుభూతి చూపించే కార్మికశాఖ తమ దిగుమతి విధానంవలన ఎంతమందినిరుద్యోగులైపోయారో కనీసం లెక్కలైనా సేకరించలేదు. అందుచేత నిరుద్యోగులందరిమీదా ప్రభుత్వానికి సానుభూతి ఉందని మనం భావించనవసరం లేదు. సంఘటితులైన నిరుద్యోగులపై మాత్రమే వారికి శ్రద్ధఉన్నది అంటేఅలజడి చేయగలిగినవారిపట్ల శ్రద్ధవహిస్తుందన్నమాట.

మళ్ళీ ప్రాథమికోపాధ్యాయులపై పెట్టుబడివిషయం ఒకసారి పరిశీలిద్దాం. ఒకే ఉపాధ్యాయుడు ఉన్నపాఠశాలలు సరిగ్గా నడిచాయా అని మొదటిసందేహం. ఇప్పటిదాకా జరిగిన అనుభవాల్ని బట్టి ఈ సందేహం తీరటంలేదు సరిగదా బలపడుతోంది. ఉద్యోగాలు ఎక్కువ చెయ్యాలనే మిషతో పూర్వపు అనుభవాలనుకూడా విస్మరించి ప్రథమ ప్రణాళిక కాలంలో ఏకోపాధ్యాయ పాఠశాలలు స్థాపించేశారు. ఈ పాఠశాలల గతి ఎలాఉంది మళ్ళీ ఎప్పుడైనా సమీక్ష చేయించారా? చేయిస్తే దాని ఫలితాలను గమనించారా? విద్యావంతులైన నిరుద్యోగులు అలజడి చేయటానికి సమర్థులు అందుచేత వారికి ఉద్యోగాలివ్వటం దేశభక్తిఅనిపించుకుంటుంది! మరి పాఠశాలలకి చదువుకుందామని వెళ్ళే చిన్నపిల్లల సంగతేమిటి? బేసిక్ విద్య నేర్పుకోండ్రా అని రెండు రోజులకొకసారి గొంతెత్తి ఉద్ఘాటించే పెద్దలు తమపిల్లలను హిందికూడా నేర్పని పాఠశాలలకు పంపించటం పరిపాటైపోయింది. 1958 లో ఏంఫలితాలు కలిగాయి అనేదాన్ని బట్టి కాకుండా ఎంత డబ్బు ఖర్చు చెయ్యగలిగాం అనేదాన్ని బట్టి దేశాభివృద్ధికి కొలత కడుతున్నాము.

ఏ దేశానికైనా నిజమైన పెట్టుబడి పిల్లలు. నిరుద్యోగ నిర్మూలనము అనే శబ్దాడంబర కార్యక్రమంక్రింద పిల్లలకు న్యాయంజరుగుతోందా అని ఎవరూ ఆలోచించటం లేదు.

(56 వ పేజీ చూడండి)

# కూచిపూడి నాట్యం

## వాస్తవవిషయాలెందుకు బయటపెట్టరు?

కూచిపూడి నాట్యం శాస్త్రీయమైనది కాదని కేంద్ర నాట్య సదస్సు నిర్ణయం చేసింది. ఈ నిర్ణయం న్యాయసమ్మతమైనది కాదని, శాస్త్రవిరుద్ధమైనదనీ ఆంధ్రప్రదేశ్ అకాడమీకే గాక, ఢిల్లీ సెమినార్‌లో పాల్గొనడానికి వెళ్ళిన అకాడమీ ప్రతినిధికి కూడా తెలిసిన విషయమే. మొత్తంమీద ఢిల్లీలో జరిగిన నిర్ణయం ఆంధ్రుల నాట్యకళా సంస్కృతికి తీవ్ర అపకారం చేసింది. ఈ అపకారానికి ఎవరు బాధ్యులు?

ఆంధ్రప్రతినిధిగా శ్రీ విస్సా అప్పారావుగారు వెళ్ళివున్నట్లయితే, అక్కడ జరిగిన వాస్తవ విషయాలను వారు సవిస్తరంగా ఎందుకు వెల్లడించరు? శ్రీ అప్పారావుగారు నాట్యశాస్త్రంమీద అధికారికంగా ప్రసంగించడానికి అర్హులని అకాడమీ భావిస్తే భావించవచ్చు; శాస్త్రసంబంధమైన ఆధారాలను వీరు నిరూపించగలిగివుండవచ్చు. అయితే, శాస్త్రలక్షణాలను నాట్యప్రయోగం ద్వారా సమగ్రంగా నిరూపించాలంటే, నటులలో ప్రయోగ కౌశలం అత్యవసరం. ఢిల్లీ సెమినార్‌లో కూచిపూడి నాట్య ప్రయోగం ఎంతవరకు సవ్యంగా జరిగిందన్నది ప్రశ్న.

ప్రయోగంద్వారా కూచిపూడి నాట్యకళ విశిష్టతను ఇతరులకు ప్రదర్శించవలసివచ్చినప్పుడు ఆ కళలో ప్రామాణికులైన వారిని ఎన్నుకోవాలికదా? అలా ఎన్నుకునే అధికారాన్ని అకాడమీ శ్రీ అప్పారావుగారికి ఇచ్చిందా? ఆ అధికారాన్ని పురస్కరించుకొనే ఎన్నిక జరిగిందా? ఏది ఏమైనప్పటికీ, అక్కడ జరిగిన ప్రదర్శనంఫలితంగానే మన నాట్యకళా సంస్కృతికి తీరని అపచారం జరిగిందేమో ననిపిస్తున్నది. ఆంధ్రప్రదేశ్ అకాడమీ ఇప్పటికైనా కూచిపూడి శిష్టసంప్రదాయసిద్ధ నాట్యశాస్త్రంలో ఎవరు పరిశ్రమ చేస్తున్నారో తెలుసుకోడానికి ప్రయత్నించి, వారి సలహాలనుపొంది కొంతమంది నాట్యప్రవీణులచేత ఢిల్లీ అకాడమీ ఎదుట ప్రదర్శనం ఇప్పించినట్లయితే, కూచిపూడి నాట్యం సశాస్త్రీయమైనది కాదని జరిగిన నిర్ణయాన్ని రద్దుచేయించవచ్చు. ఇందుకు రాష్ట్ర అకాడమీ వెంటనే పూనుకుంటుందనీ, ఆంధ్రుల నాట్యప్రతిష్ఠను పునరుద్ధరిస్తుందనీ ఆశిస్తున్నాను. ★

**వెంపటి సత్యం**

# ప్రత్యేకసభలో పరీక్షించండి!

కూచిపూడివారు తరతరములనుండి నృత్యవిద్యను ఇంటివిద్యగా అనుష్ఠించుచున్నారు. అందువలన వారికది పుట్టుకతో లభించిన సహజ విద్య అయినది. రాబోవు తరమునకూడ ఈ విద్యకు కూచిపూడియందు లోటు కలుగదని ఇటీవల ఆ గ్రామమునకు వెళ్ళినపుడు తెలియగలిగితిమి.

కేవలము నృత్య విద్యయందేగాక కూచిపూడివారు వివిధ శాస్త్ర పండితులుగూడ అగుటచేత, భరత నందికేశ్వర యాజ్ఞవల్క్యాదులచే జెప్పబడిన నృత్యసంప్రదాయములను విద్వత్ప్రదతిన ఉన్నత స్థాయిలో ననుష్ఠించుచు కాపాడుకొనగలుగుతున్నారు. సాహిత్యమున శతావధానము, సహస్రావధానములకువలె ఈ విద్యయందు కూచిపూడివారు ఉత్తమ కల్పనాశక్తితో సహజపాండిత్యమును సాధించగలుగుతున్నారు.

కొందరు కూచిపూడి నృత్యము శాస్త్రీయమైనది కాదనినారట. ఈ సంగతి ఇటీవలే తెలియవచ్చినది. వారిశాస్త్ర మెట్టిదో? ఆ శాస్త్రము ప్రకారము ఇది సరిపోలేదు కాబోలు! బహుశా అది ఆంగ్లేయుల శాస్త్రమై వుండవచ్చును. భరత వర్షమున అనాది సిద్ధముగ వచ్చుచుండిన నృత్యవిద్య ఎట్టిదో నిర్ణయించ గలిగిన లక్ష్యలక్షణవేత్తలైన ప్రామాణికులు ఎందరున్నారు? వారెవరు? పై విమర్శకులలో అట్టివారున్నారా? ఇత్యాది విషయములను ఆలోచించక తోచిన రీతిని నిర్ణయములు చేయుటవల్ల వాటికి తృణమాత్రమైనను విలువ వుండనేరదు.

కేవలము తాళమునకే నాట్యమును నేర్పుట, జతిస్వరమునకే అభినయమును నేర్పుట, లక్ష్యారమును వదలి శబ్దార్థమున అనుసరించుట, అంగములను చూచుకొనుట మొదలైన దోషములుగల నేటిభరత నాట్యము శాస్త్రీయమైనదనుచు, కూచిపూడి నృత్యము అశాస్త్రీయమైనదని తీర్మానించిన, నేటి పాండిత్యధర్మ మీ విధముగనున్నదనీ, ఇట్టి నిర్ణయములను చేయువారే మహాపండితులనీ అందువలననే యిట్టివారికి స్థానములులభించినవనీ, అనుకొనవలసినదే గాని మనము కూడ వారి ననుసరించి తీరవలయునను శాపమేమున్నది. పంచాంగములు పోయిన నక్షత్రములు పోవునా? నాట్యశాస్త్రాది గ్రంథములను చదివినదెవరు? అవి ఎందరికి అర్థమైనవి? వాని ప్రకారము కూచిపూడినృత్యము సరికాకపోవుట ఎట్లు? ఇత్యాదులన్నియు ముందు తేలవలసిన తెల్పవలసిన విషయములు. ఈబాధ ఆంధ్రదేశమున ఎందరికో ఉన్నట్లు తోచదు. అయినను ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక ఎకాడమీ వారున్నారు. వారు ఈవిషయమై ఏమి నిర్ణయించెదరో చూడవలసి వున్నది.

మనదేశమున పై విమర్శకులకు తీసిపోని విద్వాంసులు కొందరులేకపోలేదు. లక్షణవే



అందరికీ ఆనందం అందిస్తూ, కళకళలాడే అలంకారాలతో కనువిందు కావిస్తూ, గుబుల్కొన్న పునుగు జవాది తావులను విరజిమ్ముతూ, పందిట్లో పెండ్లి అవుతున్నది.

వధూవరులు పెండ్లిపీటలమీద కూర్చొని వున్నారు. కాటుక రేఖలలో ప్రేమవల్లికలను పెనవైచి, ముగ్ధ వికచ ప్రసూనాన్ని తలపించే మోహనరూపంతో తనను ఇతరులు కననివిధంగా తన పతిని క్రీగంట చూస్తూ ఆనందిస్తున్నది పెండ్లికూతురు. కలకాలం నుండి తాను కంటూవున్న కలలు ఫలించి నట్లుగా తన జన్మ తరించినట్లుగా, అవి తన జీవితంలోని మరువలేని ఘట్టాలుగా ఉంచు కొంటూ తన ప్రక్కన కూర్చున్న అర్ధాం

గిని తన హృదయపీఠంమీద నిలుపుకొన్న ఆరాధ్యదేవతగా తలచుకొంటూ, కొలుచు కొంటూ పులకిస్తున్నాడు పెండ్లి కుమారుడు.

ఎవరిముఖం చూచినా ఆనందంతో కళ కళలాడుతూన్నది. పురోహితులు చదువుతూ వున్న మంత్రాలు పందిరి నలుమూలలా ప్రతిధ్వనిస్తున్నది. 'సీతం బేనా కొండక్కి తాహావ్యామి, సేమం బేది సేలక్కై' అనే గ్రామ ఫోన్ రికార్డు మైక్ నుండి వినవస్తున్నది. అటూ ఇటూ హడావుడిగా తిరుగుతూవున్న స్త్రీ పురుషులు ఒకరి నొకరు తాకుకుంటూ, అప్రయత్నంగా లభించిన స్పర్శసుఖాన్ని అనుకోకుండానే అనుభవిస్తూ. లొట్టలు వేస్తున్నారు. విద్యార్థులు ఇద్దరు అదే

#  అరువు సొమ్ము 

ర్తాతో మాటి మాటికీ గడియారాల వంక చూసుకొంటూ వున్నారు. ముహూర్తానికి సరిగా [illegible] నిముషాల వ్యవధిమాత్రమే వున్నది [illegible]గుల హృదయాలు అతివేగముగా కొట్టుకోసాగినవి. వారి హృదయ స్పందనాలకు శ్రుతిగా మేళగాళ్ళు తమ నైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ వడివడిగా వాయిద్యాలను వాయిస్తున్నారు.

ఇంతలో అకస్మాత్తుగా ఒకమూల పెద్ద గోల బయల్దేరింది. పెండ్లికొడుకు మంగళసూత్రం కట్టేశాడు. పెండ్లికుమార్తె మెడలో ఆ మూడుముళ్ళూ పడిపోయినవి. సరిగా అదేసమయంలో అరవింద మెడలోని చంద్రహారం అంతరానమయిపోయింది. సభలో కలకలం బయల్దేరింది. అందరూ ఆమూలకు చేరుకొన్నారు. అందరికన్నాముందు అరవింద భర్త రంగారావు అక్కడకు చేరుకొన్నాడు.

"ఆ...ఏమయింది అరూ?" అంటూ ఆదుర్దాతో ప్రశ్నించాడు. అరవిందవెంటనే సమాధానం ఇవ్వలేకపోయింది.

"చంద్రహారం క...క...కనిపించటం లేదండీ."

"ఆ అలాగా ఎప్పుడు పోయిందో?"

"ఏమో మరి. ఇప్పుడే చూసుకొంటున్నాను."

'వెదకండి, వెదకండి' అన్నారు అక్కడ చేరినవారు అందరు. అప్పుడప్పుడే కథలు వ్రాయటం మొదలెట్టిన ఒక డిటెక్టివ్ రచయిత, పెండ్లికొడుకుతరఫు బంధువు అందరిని త్రోసుకొని ముందుకు వచ్చాడు.

"ఏమండి ఆ హారం బరువు ఎంత వుంటుంది?"

"షుమారు యిరవై కాసులు వుంటుందండి."

"మీరు దాన్ని చివరసారిగా చూసింది ఎప్పుడు?"

"ఉదయం పది గంటలకు."

"దానిమీద మీ పేరువున్నదా?"

"లేదు."

"మీకు ఎవరన్నా విరోధులు వున్నారా?"

"లేరు."

"క్షమించండి. మీరు మీ భర్తగారు అన్యోన్యంగా వుంటారా?"

అరవింద విచారం ఒక్కసారిగా కోపంగా మారిపోయింది.

'చాలు చాలు బైటకు నడవండి' అని కసిరింది.

ఆ డిటెక్టివ్ రచయిత తను యీ సంఘటనను ఆధారంగా తీసికొని వ్రాయబోయే కథకు 'చంద్రమతి చంద్రహారం' 'పండిట్లో దొరికిన బండీ', 'దొంగ ఎవరు?'......' యీ మూడింటిలో యే పేరు పెడదామా అని ఆలోచించుకొంటూ బైటకు నడిచాడు. రంగారావు అరవిందలు యిద్దరు ఒకరి మొఖాలు ఒకరు చూసుకొన్నారు. వారి వదనాలు పూర్తిగా వాడిపోయివున్నవి. ఏ మాత్రమూ జీవకళ అగుపించటంలేదు. అసలు యేమి జరిగింది అంటే?

* * *

ఆ రోజు సాయంకాలం రంగారావు ఆఫీసునుండి యింటికి వచ్చేసరికి అరవింద ఎప్పటి మాదిరిగా తనకోసం ఎదురుచూస్తూ గుమ్మంలో నిలుచొనిలేదు.

ఎప్పుడైతే తాను ఆఫీసునుండి తిరిగి వచ్చేసరికి అరవింద ఎదురుచూస్తూ వాకిట్లో నిలుచొని వుండదో, ఎప్పుడైతే వంట గిన్నెలు ఒకదానిమీద ఒకటి ద్వంద్వ యుద్ధం ప్రకటించి స్వల్పవిరామంతో ధన ధనమని చప్పుడు చేస్తూవుంటయ్యో, ఎప్పుడైతే చిన్నారి చిట్టిబాబు చెంప అర అంగుళం యెత్తున అనవసరంగా వాచి వుంటుందో, అప్పుడే తనభార్య అరవింద కోపంతో ధుమ ధుమ లాడిపోతూ వుంటుంది అని సులువుగా తెలుసుకొంటాడు రంగారావు.

ఆనాడు అరవింద అరవిచ్చిన అందమైన కన్నులతో అతనిరాకకు యెదురుచూస్తూ నిలచిలేదు. అంటే, అర్ధాంగి అరవింద ప్రస్తుతం కోపగృహంలో వున్నదన్నమాట.

"ఏమిటి అరూ? వంట్లో బాగాలేదా లేక యింట్లో బాగాలేదా?" అంటూ పరామర్శించాడు కోటుతీసి వంకెకు తగిలిస్తూ రంగారావు.

అరవింద నోరువిప్పలేదు.

"నిన్నే...ఏం మాట్లాడవేం?"

"......"

"అబ్బో, కోపంవచ్చిందా?"

"......"

"ఏలనే అలుకా ఓ బంగరు చిలుకా" అంటూ ఒక్క రాగం విదిలించాడు.

"అరవింద ఒక్కసారిగా నవ్వేసింది.

"బాగానేవుంది. నవ్వించటం ఒక్కటి నేర్చుకొన్నారు."

"ఇది మరీ బాగావుందికదూ? నోరు విప్పకుండా మూతి బిగించుకొని కూర్చోవటం. కారణంలేని రణం ప్రకటిస్తే నేను మాత్రం యేం చేయగలను?"

"అబ్బె ఏమీ లేదండి"




—చిత్రకారుడు: అ. సూర్యారావు.

"అట్నే ఏమీ లేకపోతే యీ సత్యాగ్రహం ఎందుకు చెప్పండి"

"సత్యాగ్రహమూ లేదు, సాధింపూ లేదు"

"అదిసరే అసలు విషయం సెలవివ్వండి."

"ఆ...ఏమీ లేదండి. మా చెల్లాయి..."

"ఆ ఏం? మీ చెల్లాయి కులాసాగా వుంది కదా?" అంటూ ఆదుర్దాతో అడ్డువచ్చాడు రంగారావు.

"ఆ క్షేమంగానే వుందండి. మా చెల్లాయి పెండ్లిముహూర్తం నిశ్చయించామని వ్రాశారండి నాన్నగారు."

రంగారావు పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వసాగాడు

"మీ చెల్లాయి పెండ్లి అయితే నీకు కోపం ఎందుకు? నీకు చేసిన తిరువాత నేగా నీచెల్లాయి పెండ్లి చేస్తున్నది—అందుకు నీ ఆగ్రహమా?"

"బాగా నేవుంది మీ తెలివి."

"మరి సంతోషించాంగాని యీ కోపతాపాలెందుకు?"

"సంతోషించాంలెండి దొరగారి సలహాకు."

"అదే నేనూ అనటం సంతోషించమనే"

"చెప్పానుగదూ సంతోషించామని."

"అట్నే నీవు కోపంతో అంటున్నావు సంతోషించమని. అంటే దుఃఖిస్తున్నామని అర్థం చంపక అసలు గొడవ యేమిటో చెప్పేద్దూ బాబూ!"

"అవును అయ్యగారికి అన్నీ గొడవలే-మీ పని అయితే అరనిముషంలో చేసేసుకొంటారు."

"నీకు ఒక నమస్కారం చేస్తాను. అసలు విషయం చెప్పమన్నానా?

"అవును. అవును. నమస్కారాలు చేసి తప్పించుకొంటారు."

"అది సరేగాని చెల్లాయి వివాహానికి అక్కగారి ఆగ్రహానికి యేమిటా సంబంధం అని?"

"ఏమీ లేదండి. పెండ్లికి వెళ్లాలంటే యెంగ వాళ్లకేం. మీరు యెలాగైనా వెళ్ళిపోగలరు. ఆడవాళ్ళకు అన్నీ హంగులు వుండాలి."

"అవును ఉండాలి కాదని ఎవరన్నారు? మొన్న నే కదా క్రొత్తచీరలు కొన్నది."

"హంగు అంటే చీరలు ఒక్కటేననిటండి?"

"ఇంకా యేం కావాలో చెప్పరాదూ?"

"మీకు తెలీదేమిటండి?"

"తెలుస్తే నిన్ను అడగటం ఎందుకు?"

"ఆ. ఏమి లేదండి. ఒక చిన్న గొలుసు కూడా వుంటే బావుంటుందండి"



"ఓ అదా? భేష్, సెభాష్. ఎవరు కావన్నారు? గొలుసు వుంటే బాగానే వుంటుంది"

"అవును కదండీ"

"అవును కానిండీ మరి మనకు గొలుసు లేదు కదండీ."

"బాగానే వుందండి. లేదు కాబట్టే చేయించమని చెప్పటం."

"బాగానేవుంది. నీకు తెలీని ఖజానా నా దగ్గర యేముంది? గొలుసు అంటే మాటలతో వస్తుందా?"

"సరేలెండి. నా ముఖానికి అంత అదృష్టం లేనప్పుడు మీరు మాత్రం యేంచేస్తారు? నేనే మానేస్తాను. పెండ్లీలేదు గిండీలేదు."

"ఇది మరీ బావుంది. చెల్లెలి పెండ్లికి యెవరేనా వెళ్లకుండా వుంటారా?"

"ఎవరూ వుండరుగాని బోసిమెడతో వెళేవారుకూడా యెవరూ వుండరు."

"అయితే నన్నుయేమి చేయమంటావు?"

"ఏమీ చేయవొద్దులెండి" అంటూ అకస్మాత్తుగా లేచి నిలుచొని విసురుగా రుసరుసలాడుతూ లోనికి పరిగెత్తబోయే అర్ధాంగి కొంగుపట్టకొని,

"ఆగు ఆరూ! ఒక ఐడియా" అన్నాడు రంగారావు ఏమిటో చెప్పండి అన్నట్లు అతనివైపు చూసింది అరవింద.

"ఆ. ఏమంటే. మీ ఫ్రెండు సరోజిని యిప్పుడు యిక్కడనే వుంటున్నదిగా? మీ యిదరు మంచి ఫ్రెండ్లుగదా? వాళ్ళ ఆయన అసిస్టెంటు సెక్రటరి. అదీగాక బాగా వున్నవారు. పెండ్లికి వెళ్ళివచ్చిందాకా యేదన్నా చంద్రహారం యివ్వమంటే తప్పక యిచ్చేస్తుంది. మళ్ళీ యిచ్చెయ్యవచ్చు. ఏమంటావ్?"

అరవిందముఖం ఒక్కసారిగా విప్పారింది. తనకు అంతవరకు ఆ ఐడియా రానందుకు ఆశ్చర్యపడింది. అనవసరంగా ఆయన మీద అలిగినందుకు నొచ్చుకున్నది. "మీరు చాలా మంచివారు సుమండీ. మంచిసలహాయిచ్చారు. మరి యిప్పుడేవెళ్ళి వస్తాను సరోజిని యింటికి."

"ముందు ముడుపు చెల్లించుకొని మరీ వెళ్ళండి. వరా మామూలే. ఇక్కడ సలహాలు ఫ్రీగా యివ్వబడవు" అంటూ రంగారావు తన రెండు బాహువులను ముందుకు చాచాడు.

"చాలులెండి సరసాలు. వేళాకోళాలకు వేళాపాళా లేదా?" అంటూ వెక్కిరిస్తూ తుర్రుమని లోనకు పారిపోయి, చీర మార్చుకొని అప్పుడే బయల్దేరింది సరోజినియింటికి అరవింద.

సరోజిని తనకండ్లను తాను నమ్మలేకపోయింది ఎన్నాళ్లకో అగుపించిన ప్రాణస్నేహితురాలిని చూచి ఆమె మనస్సు ఆనం



# అరువు సొమ్ము



దంతో పరవళ్లు త్రొక్కింది. ఎంతో ఆనందంతో, ఆదరంతో, ఆప్యాయతతో ఆహ్వానించింది లోనకు అరవిందను. ఆ రోజుల్లో తాము బడిలో చదువుకొనే రోజుల్లో హృదయాలు విప్పుకొని యెన్నో కబురు చెప్పుకొనేవారు. ఒక్కొక్కసారి ఒకరి యింట్లో ఒకరు భోజనాలుచేసి ఒకేమంచం మీద పడుకొనేవారు. కాని బ్రతుకులో కొందరికి గతుకుబాటలు, మరికొందరికి కోకిలపాటలు. సరోజిని భర్త ధనికుడు. అదీగాక మంచి ఉద్యోగమువుంది. అరవింద చదువుకునే రోజుల్లో అందాలబరిణె అనే పేరు పొందింది. కాని, ఆమె అందానికి తగిన ఆనందం లభించలేదు తరువాత ఆమెకు. ఆమె భర్త అధిక సంఖ్యాకుల్లో ఒకడైన అప్పర్ డివిజన్ గుమస్తా. వచ్చే జీతంలో సంసారం గడవటమె చాలా కష్టంగా వున్నది. స్నేహితురాండ్రు యిద్దరు తిరిగి తమతమ జీవితాలను గురించి హృదయాలు విప్పుకొని తనివితీరా మాటాడుకోసాగారు. ఏన్నో విషయాలు మాటాడుకొన్నారు గాని అరవింద తానువచ్చిన పనిమాత్రం చెప్పలేదు. అరవింద మనస్సులో యేదో భావ సంఘర్షణ జరుగుతూవున్నట్లు కనిపెట్టింది సరోజిని.

"ఏమే అరూ! నీ మనస్సులో యేదో బాధపడుతున్నట్లున్నావు. చెప్పవూ?"

"అబ్బే ఏమీలేదు."

"చెప్పకపోతే నామీద ఒట్టే"

అప్పుడు అరవిందకు చెప్పక తప్పలేదు. సరోజిని విరగబడి నవ్వింది.

"పిచ్చిపిల్లా! ఈ మాత్రం దానికి యింతగా బాధపడాలా? నాదగ్గర నీకు సంకోచం ఎందుకు?" అంటూ సరోజిని తన నగలపెట్టెనుతెచ్చి అరవింద ముందు వుంచేసింది సంతోషంతో. ఆనగల్లో అరవిందకు నచ్చిన నగను నిస్సంకోచంగా తీసేసుకోమన్నది సరోజిని. నగలన్నింటిని బాగా పరిశీలించి చివరకు ఒక చంద్రహారం తీసుకొని సరోజినిదగ్గర సెలవు పుచ్చుకొని ఇంటికి వచ్చేసింది. ఆనాడు సరోజినిదగ్గర అరువుతెచ్చుకొన్న ఆ చంద్రహారమే యీనాడు అకస్మాత్తుగా మెడలోనుండి అంతర్ధానమయిపోయింది. అందుకనే ఆ ఆలుమగల ముఖాల్లో అంత భయంకరమైన భావాలు ప్రత్యక్షమైనాయి.

* * *

పెళ్లి అయిపోయింది. అరవింద చంద్రహారం ఎగిరిపోయింది. రంగారావుకు మతిపోయింది.

ఇంటికి చేరుకొన్నారన్నమాటేగాని అప్పటినుండి అరవిందా రంగారావుల కంటికి కునుకు పట్టలేదు. ఆ చంద్రహారం అందమయింది. ప్రత్యేకంగా తయారు చేయబడింది. ఇప్పుడు యేమిచేయటం? సరోజినికి యేమి సమాధానం యివ్వటం?

ఎదురు చూస్తున్న పెనుతుపాను రానే వచ్చింది సరోజిని అరవిందకు కబురంపించింది. "చంద్రహారం బావుందని చూసేందుకు మావాళ్లు యెవళ్లో పుచ్చుకున్నారు. అలాటి హారమే చేయించుకొంటారట. వారం పదిరోజుల్లో యిచ్చేస్తాను" అని సమాధానం పంపించేశాడు రంగారావు.

రంగారావుకు యేమీ తోచటలేదు. ఆఫీసుకు సెలవుపెట్టేశాడు. ఇరవై రోజులకు తక్కువవుండని ఆ చంద్రహారాన్ని తయారు చేయించాలంటే కనీసం పదిపన్నెండు వందలయినా వుండితీరాలి. కష్టమైనా నష్టమైనా సరోజిని చంద్రహారాన్ని సరోజినికి యిచ్చితీరాలి. లేకపోతే పరువు దక్కదు. పరువుపోయిన బ్రతుకు బరువు. వెంటనే అతను తన స్వగ్రామానికి బయల్దేరాడు. ఎన్నాళ్లనుండో వుంటున్న ఒక చిన్నయిల్లుకు బేరం పెట్టాడు. ఎవరూ కొంటామని ముందుకు రాలేదు. చివరకు బ్రహ్మప్రయత్నం మీద రెండువందలకు కొంటామని అన్నారు. తరువాత, యింకా ఒక వెయ్యిరూపాయలు కావాలి వచ్చేమార్గం యేమీ అగుపించలేదు. అవూళ్లోనె వీరన్నగారు అనే ఒక వడ్డీవ్యాపారస్తుడు వున్నాడు. ఆయనవద్ద రెండురూపాయల వడ్డీకి ఒక వెయ్యిరూపాయలు బదులు పుచ్చుకొని పదిహేనువందలకు నోటు వ్రాసియిచ్చి ఆసొమ్ము తీసుకొని తిరిగివచ్చేశాడు.

నగరంలోవున్న నగల దుకాణాలు అన్నీ గాలించి గాలించి చివరకు ఒకదుకాణంలో సరోజిని చంద్రహారంలాటి చంద్రహారాన్ని కనుక్కున్నాడు. పన్నెండువందలు యిచ్చి దాన్ని కొన్నాడు. ఆ చంద్రహారాన్ని తీసికొని సరోజిని యింటికి బయలేరింది అరవింద. ఆ మాటా యీ మాటాచెప్పి ఆలస్యం అయినందుకు క్షమించమని, హారం మారినట్లు గుర్తిస్తుందేమోనని భయపడుతూ, ఆ చంద్రహారాన్ని సరోజినికి యిచ్చేసింది అరవింద. సరోజిని తన చంద్రహారం మారిపోయినట్లుగా యెక్కడా గుర్తించినట్లు అగుపించలేదు.

సరోజిని చంద్రహారం సరోజినికి ముట్టింది. 'అమ్మయ్యా' అనుకొన్నారు ఆలుమగలు! కాని, ఆసంతృప్తి కొన్ని క్షణాలకు మించి యెక్కువకాలం నిలువలేదు. తాము వీరన్నదగ్గర అరువుతెచ్చిన సొమ్మును తిరిగి తీర్చాలి. వచ్చేజీతంలో మిగుల్చుకొని బాకీతీర్చగలగటం అంత సులువుకాదు. వేరే ఆదాయంవచ్చేది యేమీలేదు. మొదట్లో కొంచెం అధైర్యపడినా చివరకు గుండె రాయిచేసుకుని కుదుట పడారు. అరవింద పనిమనిషిని మాన్పించేసింది. ఇల్లు తుడవటం, బట్టలు వుతకటం, అంట్లుతోమటం...వగైరాలు అన్నీ తానే పుచ్చుకొంది. అదీగాక తీరిక సమయాల్లో ఆడపిల్లలకు ఎంబ్రాయిడరీ నేర్పటం, సంచులు కుట్టటం, జాకెట్లు కత్తిరించటం, సంగీతం నేర్పటం...మొదలైనవిచేసి కొంత ఆర్జించసాగింది. రంగారావు కాఫీ, బీడీ, బీడా వగైరాలకు స్వస్తి చెప్పాడు. ఆఫీసు అయిపోవటంతో

(49-వ పేజీ చూడండి)

# పతనం

## ఎం. హనుమంతరావు

విజయనగరం స్టేషనులో హఠాత్తుగా శేషగిరిని చూసి ఆశ్చర్యపోయాను, అక్కడికెలా వచ్చాడా అని. మొదట వాణ్ణి చప్పున పోల్చుకోలేకపోయాను కూడాను. 'ఏంరోయ్ చంద్రం' అని వాడే మొదట పలకరించాక గుర్తించగలిగాను. మనిషి బాగా మారిపోయాడు. మొదట్లో బక్కపలుచగా వుండే వ్యక్తి ఇప్పుడు బాగా వొళ్ళు చేశాడు. శరీరపు ఛాయలో కూడా కొంత మెరుపు వచ్చింది.

"ఎందాకా వెళ్తున్నావురా!" అన్నాడు కంపార్టుమెంటులోకి వస్తూ.

"వాల్తేరు వెళ్తున్నానుగాని, నువ్విక్కడేం చేస్తున్నట్టు?" అన్నాను వింతగా వాడి మొహంలోకి చూస్తూ. వాడు నా ప్రశ్నకు జవాబుగా చిన్న నవ్వు నవ్వేడు.

"మనం చాలా కాలానికి అకస్మాత్తుగా కల్సుకున్నాం; ఏమంటావురా? నన్ను గుర్తు పట్టడానికి నీకు కొంత శ్రమైనా, నిన్ను నేను సులువుగా గుర్తు పట్టేశానే. నువ్వు యిప్పటికీ అలాగే వున్నావురా...నీలో యేమీ మార్పురాలేదు. ఇవన్నీ మనం తర్వాత మాట్లాడుకుందాం. నువ్వు ముందు దిగు" అన్నాడు.

"దిగడం యేవిట్రా?" వింతగా వాడి మొహంలోకి చూశాను.

"చూడరా అబ్బీ! నా సంగతి నీకేమీ తెలీంది కాదు. నీకంత తొందరపని యేమున్నా వుంటే, కనీసం యీరోజు యిక్కడుండి, రేపు వెళ్ళిపో...ఏదీ నీ పెట్టె?" అని బెంచికింద చూశాడు. నేను యిరుకున పడిపోయాను. శేషగిరి మంచి పట్టుదలగల మనిషి. వాడు యేదైనా అన్నాడంటే అది జరిగి తీరాల్సిందే! "ఇప్పుడే అన్నమాటేవిట్రా శేషగిరి! తిరుగు ప్రయాణంలో యిక్కడ తప్పకుండా దిగుతాలే... అన్నాను.

"అదంతా పనికిరాదు. తప్పక దిగాల్సిందే" అంటూనే నేను కూచున్న బెంచికింద వున్న పెట్టె బైటికి లాగబోయాడు.

ఇక వాడెలాగూ వదలడని నాకు తెలుసు వాడిమాట జరక్కపోతే యెదుటి వారిని చాలుగు తిప్పేస్తాడు కూడాను.

"నీతో యిదే చిక్కురా! దిగుతాగాని ఒకషరతు..." అన్నా.

"ఏవిటది?"

"మళ్ళి రేపు వెళ్ళిపోతాను. నువ్వు మరేమీ ఆటంకపర్చకూడదు."

"సరే...అలాగే కానియ్..."అన్నాడు చివరికి ఒప్పుకుని.

తప్పనిసరిగా అక్కడ దిగిపోవాల్సి వచ్చినందుకు ఓ ప్రక్క బాధగా వున్నా, పాతస్నేహితుణ్ణి చాలా కాలానికి కలుసుకున్నాను కదా అన్న సంతోషం కూడా లేకపోలేదు. గార్డు పచ్చజెండా చూపిస్తూ విజిల్ వూదాడు తొందర తొందరగా సామానుతో దిగిపోయాం.

"అనవసరంగా టిక్కట్టు దండగయ్యిందిరా శేషూ" అన్నానడుస్తూ.

"ఏం"

"కాదూ మరి వాల్తేరుకి కొన్న టిక్కట్టు అంతవరకూ వుపయోగించుకోవటం జరగదు కదా! రేపుమళ్లీ యిక్కణ్ణించి వేరే టికెట్టు కొనుక్కోవల్సిందే!" అన్నాడు.

శేషగిరి అదోలా నవ్వేడు.

"ఒస్ అదా రేపు నువ్వు టిక్కట్టు కొననవసరం లేదులేరా టి. టి. ఇ లందరూ మనకు తెలిసినవాళ్లు. హాయిగా సెకెండు క్లాసులో పంపించే బాధ్యతనాది...సరేనా" అన్నాడు వుత్సాహంగా.

వాళ్ళందరితో వీడికెలా పరిచయమయ్యిందా అని ఆశ్చర్యపోయాను.

"రైల్వేలో వుద్యోగమయ్యిందేవిట్రా?" అన్నాను.

"నీ తెలివి మరీ బావుందిరా చంద్రం! రైల్వే వాళ్ళతో పరిచయం చేసుకుందుకు రైల్వేలోనే వుద్యోగం చెయ్యాలా యేవిటి?" అన్నాడు నవ్వుతూ. నేను మరింకేమీ అనలేదు. రిక్షాలో కూచున్నాం.

"అవుతే, యింతకూ నువ్విప్పుడు వెలిగిస్తున్న వుద్యోగం యేవిట్రా?" అన్నా ఆతృత కొద్దీ.

"టి కంపెనీ యేజంటుగా వున్నాన్లే..." అన్నాడు చాలతాపిగా.

"స్టేషనుకి యెందుకొచ్చావు యిప్పుడు?"

"వూరికినే...ఇంట్లోవుంటే వుబుసుపోదు.. రోజుకోసారయినా స్టేషనుకి వస్తాను.. నీలాగే చాలమంది పాతస్నేహితులు కలుస్తారు.." అన్నాడు. కాస్సేపు యిద్దరం మౌనంగా కూచున్నాము. ఇంటి ముందు రిక్షా ఆగింది. దిగాం.. రిక్షా డబ్బులు నేను యివ్వబోతూవుంటే, శేషగిరి ఒప్పుకోకుండా వాడే యిచ్చేశాడు. సామాను గడపలో పడేసి రిక్షా వాడు పోయాడు. శేషగిరి గది తాళం తీశాడు. సామాను యిద్దరం చెరొకటీ పట్టుకుని లోపల ప్రవేశించాం. గది పెద్దదే అయినా శుభ్రంగా లేదు.

"మీ వాళ్ళని అమ్మగారింటికి పంపించావా యేవిటి?" అన్నా.

శేషగిరి నా వేపు అదోలా చూశాడు.

"నీకు తెలీదేవిట్రా, మా ఆవిడ పరలోకానికి ప్రయాణం చేసిందని?" అన్నాడు. నేను గతుక్కుమన్నాను.

"అదెప్పుడు? నాకు తెలీదే!" అన్నా "కనీసం ఒక వుత్తరంముక్కయినా రాసుకోవట్రా..."

"ఎవరికీ తెలియపర్చటం నాకిష్టంలేదురా చంద్రం..ఆమధ్య నాకు తటస్థపడిన సంఘటనలన్నీ ఒకేలాంటివి. అమ్మ యేనాడో చనిపోయిందని నీకు తెలిసిన విషయమే కదా! నన్ను ముద్దుగా పెంచి, పెద్దచేసిన నాన్నగారు కూడా పోయారు. నా జీవితపథం అప్పుడే మారిపోయిందనుకున్నాను. మరి కొన్నాళ్ళకి మా ఆవిడ కూడా నన్ను విడిచిపెట్టి పరలోకం చేరింది. అప్పట్నుంచీ నాకీ వింటో జీవితంమీద విరక్తి పుట్టింది. చాలా మంది నన్ను మళ్ళీ పెళ్ళి చేసుకోమన్నారు. నా కిష్టంలేకపోయింది. ఎలాగో జీవితాన్ని సుఖమయం చేసుకుంటూ గడిపేస్తున్నాను." అన్నాడు సంక్షిప్తంగా జీవితాన్ని వెల్లడి చేస్తూ.

వాడి పరిస్థితికి నేను చాలా జాలిపడ్డాను. పాపం, వాడెలా తట్టుకో గలిగాడా అనుకున్నాను. స్నానం చేశాక హోటలుకి తీసుకుపోయాడు అక్కణ్ణించి తిరిగివచ్చి యిద్దరమూ కాస్సేపు విశ్రాంతి తీసుకున్నాం. సాయంత్రం అలా షికారుకు

బయలుదేరాం.

"అవుతే శేషూ! నీవుద్యోగం యిక్కడే నన్నమాట." అన్నా నాతోనే రోజంతా గడుపుతూవుంటే, మరి వుద్యోగం యెప్పుడు చేస్తున్నాడో అర్థంగాక.

"ఆఁ.. కాని, అప్పుడప్పుడు చుట్టుప్రక్కల వూళ్ళకు వెళ్ళాల్సి వస్తుంది." అన్నాడు.



"అవుతే చిక్కే నన్నమాట: ఇలా కంపులు వెళ్ళే వుద్యోగమవుతే నాకు అంతగా యిష్టం వుండదు స్మా..."

శేషగిరి చిన్నగా నవ్వేడు.

"నా జీవితానికి మాత్రం యీ వుద్యోగం బాగా సరిపోయిందిరా.. ఏవూళ్లో వున్నా నాకొకటేగా!" అన్నాడు.

"పోనీ, మళ్ళీ పెళ్ళిచేసుకో కూడదూ! ఒక యింటివాడివైవుంటే, యెంత హాయిగా వుంటుంది?" అన్నాను.

"మళ్ళీ నువ్వు మొదటికే వస్తున్నావురా: మరి పెళ్ళి చేసుకోవటం నాకిష్టం లేదని చెప్పానుగా! నేను హాయిగా సంసారం చేసుకుంటే చూచి సంతోషించే వాళ్ళు లేరు. నేను చెడిపోతే విచారించే వాళ్ళు లేరు.. అల్లాంటప్పుడు యెందుకొ లేనిపోని బాదర బందీలు తెచ్చిపెట్టుకోవటం?" అన్నాడు అదోలా నవ్వుతూ.

ఎదురుగా అగుపించే కాఫీహోటల్లోకి దారితీశాడు. వాణ్ణి అనుసరించటం తప్పించి వదనలేకపోయాను. ఎందుకూ అంటే, వద్దంటే వినేరకంకాదు వాడు. కాఫీహోటల్లోంచి బైటపడి మరికాస్సేపు అటూ యిటూ తిరిగేశాం. గడిచిపోయిన సంగతులు చాలా చెప్పుకొన్నాం. ఇంటికి తిరిగి వచ్చే సరికి చీకటిపడింది.

"చంద్రం, నువ్వింట్లోనే వుండరా: నేను కేరియర్ తీసుకుని వస్తాను" అన్నాడు శేషగిరి.

"కేరియర్ యెందుకురా; మనమే అక్కడికిపోయి భోంచేస్తే కాదూ' అన్నా అయోమయంగా.

"రాత్రిపూట యెప్పుడూ కేరియర్ తెచ్చుకుంటానే..." అనేసి నా సమాధానానికైనా యెదురుచూడకుండా కేరియర్ పట్టుకుని వెళ్ళిపోయాడు.

వాడి అభిప్రాయమేమిటో నాకేమీ అర్థంకాలేదు. అలా కళ్లప్పగించి చూస్తూ వుండిపోయాను. కాస్సేపటికి శేషగిరి వచ్చేశాడు. టేబిలుమీద యిద్దరికీ రెండాకులు వేసి వడ్డించేశాడు వాడే! తర్వాత బీరువాలోంచి ఓసీసాతీసి టేబిలుమీద పెట్టడు. అది బ్రాండీ సీసా! నేను విస్తుపోయాను. రాత్రిపూట వాడెందుకు కేరియర్ తెచ్చుకుంటాడో యిప్పుడు నాకర్థమయ్యింది. సోడా సీసా తెచ్చి గాసులోపోసి అందులో కాస్త పోశాడు బ్రాండీ.

"నువ్వుకూడా కాస్త రుచి చూడరా చంద్రం! ఇది కంట్రీదికాగులే...తప్పులేదు. పైగా మంచి ఆరోగ్యవంతమైంది కూడాను..." అన్నాడు నవ్వుతూ.

తెల్ల మొహంవేసి చూడ్డమే తప్పించి క్షణంవరకూ మాటాడలేకపోయాను. జంకూ గొంకూ లేకుండా నాముందే ఇలా ప్రవర్తించటం అసహ్యం కలిగించింది.

"ఈ విషయం తెలియ పర్చడానికే నన్నిక్కడ దిగమన్నావు శేషూ! నాకు తెలీకుండా వుండేందుకు యీ ఒక్కరోజు మానేస్తే యెంతబాగుండేది!" అన్నాను బాధగా.

శేషగిరి బాధపడకపోగా వుత్సాహపూరితంగా నవ్వేశాడు.

"నీకు తెలిస్తేమాత్రం యిందులో తప్పేముందిరా! ఏపనైనాసరే, రహస్యంగా చేసే అలవాటు నాకులేదని నీకు తెలుసుగా! ఇక నేనీ అలవాటికి యెలా దాసుడనయ్యానంటావుకదూ! ఊరూరా తిరిగి తిరిగి వేసారిపోతుంటాను. ఒక్కొక్కప్పుడు చాలా శ్రమ అనిపించేది. అప్పుడే యీ బ్రాందీ అలవాటయ్యింది. ఇప్పుడీ సీసాయే నా స్నేహితుడనుకో! దీనివల్ల నా మనసుకి యెంతో హాయికలుగుతోంది... నాజీవితంలో యింక హాయినిచ్చేది యిది తప్పించి మరేముంది చెప్పు? అయినా ఒక్కమాటచెపాను వినరా! నా డబ్బంతా యేంచేసుకోను? ఆనందమనిపించేదంతా ఆస్వాదించాలనే నాకోరిక. జీవితంలో మాధుర్యాన్ని కలిగించేది యేది చేతికందుబాటులోవున్నా విడిచిపెట్టను...బ్రతికివున్నన్నాళ్ళేగాని, చచ్చాక యేం అనుభవిస్తాం చెప్పు? నేనిప్పుడిది రుచి చూస్తున్నాననీ, యీ రాత్రంతో ప్రేలాపనలో గడిపేస్తానని అనుకోకు. సమపాళ్ళతోనే వేసుకుంటాను. అలవాటైపోయింది గనుక నాలో యేమీ మార్పుఅగుపించదు. చూస్తావుగా!" అనేసి గడగడా గ్లాసు ఖాళీచేశాడు

శేషగిరిమీద చెప్పలేనంత కోపం వచ్చింది. కసిదీరా ఆ లెంపా యీ లెంపా వాయించాలనుకున్నా. కాని, యెందుకనో కోపాన్ని దిగమింగుకొన్నాను.

"నువ్వెన్నిచెప్పు...యీ అలవాటు మంచిదికాదురా శేషూ! నలుగురి దృష్టిలోను నువ్వు చులకనవుతావు కొన్నాళ్ళకి..." అన్నాను వూరుకోలేక.

శేషగిరి మళ్ళీ చాలా తేలిగ్గా నవ్వేడు.

"అలా అని నువ్వనుకొంటున్నావుగాని చంద్రం, బ్రాంది, విస్కీ యిల్లాంటి ఖరీదైన పానీయాలు అలవాటు చేసుకున్న వాళ్ళు యింతవరకూ యెక్కడా త్రాగుబోతులు క్రింద జమకట్టబడలేదు. అది ఫ్యాషనుగా చెలామణి అవుతోంది. ఇక పోతే డబ్బు విషయమంటావా, నాకా భయం లేదు...ఎందుకూ అంటే కేవలం మోతాదుగానే తీసుకుంటున్నానుగనుక... లేకపోయినా మా నాన్న గడించి పెట్టి

పోయావుగా :"

"సరే, నీ యిష్టం..." అనేసి భోజనానికి వుపక్రమించాను.

"అలానే అనేశావుగాని, ఒకవేళ నువ్వే నా పరిస్థితిలో వుంటే, యేం చేసేవాడివో ఆలోచించావా?" అన్నాడు మళ్ళీ.

"అవన్నీ యిప్పుడెందుకులే...ముందు భోజనం ముగించు...బాగా నిద్రవస్తోంది.. పడుకోవాలి వేగిరం..." అన్నాను...

భోజనాలయ్యాయి. శేషగిరి పక్కలు యేర్పాటు చేశాడు. వాడు అన్నటుగానే వాడిలో యేమీ మార్పురాలేదు. మామూలుగానే మాట్లాడాడు. అందుకు ఒక విధంగా సంతోషించాను. ప్రయాణపు బడలికలో వున్నానేమో, త్వరలో నిద్రపట్టేసింది.

* * *

మరుచటి రోజు వుదయం కాఫీ త్రాగాక ప్రయాణం కట్టాను...శేషగిరి అటంక పర్చలేదు.

"అటంక పర్చవని మాటిచ్చానుగాని, లేకుంటే రెండురోజులవరకూ నిన్ను కదలనిచ్చే వాణ్ని కాదురా చంద్రం...అం... అప్పుడే ప్రయాణ సన్నాహ మెందుకూ? మెయిలు వచ్చేందుకు యింక చాల వేళ వుంది" అన్నాడు శేషగిరి.

"ఇక్కడ మాత్రం వుండి యేం చేసాం" ఆ వుండటం స్టేషనులోనే వుందాం పద" అన్నాను.

సరే అంటూ బెలుదేరాడు శేషగిరి. ఇద్దరమూ స్టేషను చేరుకున్నాము. మెయిలు వచ్చేందుకింకా చాల వేళ వుంది. వెయిటింగ్ రూమ్‌లో కూచుని కాస్సేపు కబురు చెప్పుకున్నాక అలా తిరిగి రావాలనిపించింది.

"లేరా, అలా తిరిగివద్దాం" అనిలేచాను. శేషగిరి సామాన్లు బేరాకి అప్పజెప్పి వచ్చాడు. ప్లాటుఫారమ్ యేమంతగా క్రిక్కిరిసి లేదుగాని, ప్రయాణీకులు బాగానే వున్నారు. ఇద్దరమూ ఒకరి ప్రక్క ఒకరు నడుస్తున్నాం. ఇంతలోనే ఒక స్త్రీ మాకు యెదురుగ వస్తూ శేషగిరి వేపుగామోసు చూసి యింత మొహం చేసుకుని వచ్చింది. వాడు యిరుకునపడ్డాడు. పాపం. నేనది గమనించానేమోనని నావేపు ఓమారు తిరిగి చూశాడు. ఏం లాభం. అప్పటికే ఆమె దగ్గరిగా వచ్చేసింది.

"శేషగిరి గారికి మా మీద కోపం వచ్చినట్టుంది...యేమండీ :" అంటూ నిల్చుండిపోయింది ఆమె యెవరో విషయమేమిటో నాకేమీ అర్థం కాలేదు.

"అబ్బే : అదేం కాదులే సుశీ! కాస్త పనుంది వస్తా...తర్వాత మాటాడుదాం" అనేసి తప్పుకున్నాడు శేషగిరి. ఆమెకి కాస్త దూరమయ్యాం.

నాలో కలిగిన ఆత్రుత భరించలేక "ఎవర్రా?" అని అడిగేశాను మెల్లగా. శేషగిరి మెల్లగా నవ్వుతూ.

"దాపరిక మెందుకుగాని, ఆమె యెవరో మాటలబట్టి అర్థం చేసుకోలేక పోయావురా? అన్నటు నువ్వెలా అర్థం చేసుకొంటావులే.. నువ్వు చాల బుద్ధిమంతుడివికదూ! సుశీల అనే వేశ్య...ఇప్పుడర్థమయ్యిందా?" అన్నాడు.

నా కళ్ళు గిర్రున తిరిగాయి. శేషగిరి యింతగా దిగజారిపోతాడని నేనెప్పుడూ అనుకోలేదు.

"అవుతే శేషూ : యీవిడతో బాగా పరిచయ ముందన్న మాట!" అన్నాను.

"ఈవిడతో నన్నమాటేమిట్రా? ఇల్లాంటి యువతులు చాల మందితో పరిచయముంది.... నేను మొదటే చెప్పానుకదూ, జీవితంలో మాధుర్యాన్నిచ్చేది యేది అందుబాటులో వున్నా విడిచిపెట నని..." అన్నాడు.

వాడి సిగ్గుమాలిన తనానికి నేనెంతగానో దూషించాను మనసులో.

"ఒక్కమాటరా శేషూ : నువ్వుబాగా దిగజారి పోతున్నావు...ఇప్పుడు కాకపోయినా మరొకప్పుడైనా పశ్చాత్తపడావు..." అన్నాను ఒక పక్క కోపం వస్తుంటే.

"అది నీ అభిప్రాయం. కాని, నేనేమంటానో తెలుసా, యిదంతా జీవిత మాధుర్యం అంటాను. బ్రతికి వుండగా మధురానుభూతుల్ని పొందలేనివాడి జీవితం వృధా అంటాను...యిదే నా ఆశయం" అన్నాడు.

వాడి మొండి వాదనకి నేనేంజవాబు చెప్తాను? ఇంతలోనే దూరంలో రైలుకూత విన్పించింది. ఇరువురం వెనక్కి తిరిగాము.

నేను బండిలో కూచున్నాను. శేషగిరి ఒక టి. టి. ఇని తీసుకుని వచ్చాడు నన్ను అప్పజెప్పడానికి. ఆ టి. టి. ఇని చూసేసరికి అతిన్ని యెక్కడో చూసినట్లనిపించింది. మెదడుకి పని కల్పించాను. జ్ఞప్తికి వచ్చింది.

"నమస్కారమండీ, రాఘవరావుగారూ" అన్నాను.

"నమస్కారం ... ఓహో, మీరా..." అన్నాడతను.

మా యిరువురికీ యెలా పరిచయమయ్యిందా అని ఆశ్చర్య పోయాడు శేషగిరి.

"బరంపురంలో వీళ్ళ బావమర్దికీ నాకూ మంచి స్నేహం వుండేదిలే శేషూ: ఒకసారి అక్కడే మా యిద్దరికీ పరిచయమయ్యింది. మీరిద్దరూ స్నేహితులని యిప్పటివరకూ నాకు తెలీదు." అన్నాడు రాఘవరావు.

"మే మిద్దరం చిన్నప్పట్నుంచి స్నేహితులంలెండి..." అన్నాన్నేను.

ఇంజను కూత పెట్టింది.

"మీరిక్కడే కూచోండి... మరో స్టేషన్లో వస్తాను ... వస్తా శేషూ" అనేసి రఘవరావు వెళ్లిపోయాడు.

"చంద్రం, చాలా కాలానికి మనిద్దరం కల్సుకుని త్వరలో మళ్ళీ విడిపోతున్నాం. ప్రస్తుతం నేను గడుపుతున్న జీవితం నువ్వు పూర్తిగా అవగాహన చేసుకుని వుంటావనుకుంటాను. నీ దృష్టిలో నేను చెడిపోతున్న వ్యక్తిని...లేదా చెడిపోయినవాణ్ణి. ఏం చెయ్యను! నా జీవిత పథం అలా మారిపోయింది." అన్నాడు నిర్లిపంగా.

శేషగిరిలో దాక్కొనివున్న యే విరాశో అతణ్ణిలా మార్చి వుంటుందని అర్థం చేసుకుందుకు అట్టే కాలం పట్టలేదు. నేనేమీ మాట్లాడలేక పోయాను. బండి కదలింది. పదడుగుల వరకూ పెట్టె ప్రక్కనే నడిచాడు శేషు.

"ఉత్తరాలు రాస్తూవుండరా!" అన్నాను.

"అలాగే" అన్నాడు.

"వస్తా... యికవుండు" అన్నాను. వాడలా కర్రబొమ్మలా నిల్చుండిపోయాడు. కనుచూపు మేరవరకూ యిద్దరం చేతులు వూపుకున్నాం...రైలు వేగం హెచ్చించింది. చెమర్చిన నా కళ్ళు ఒత్తుకున్నాను.

* * *

రోజులు గడుస్తున్నాయి. మా యిరువురి మధ్య మళ్ళీ వుత్తర ప్రత్యుత్తరాలు ప్రారంభమై సాగిపోతున్నాయి. కొన్నాళ్ళు పోయాక శేషగిరి నుండి వుత్తరాలు రావటం ఆగాయి. నా కెందుకో ఆత్రుత కలిగింది. రాఘవరావుకి వుత్తరం రాశాను. నాలుగు రోజుల్లో రాఘవరావు దగ్గర్నించి వుత్తరం వచ్చింది. ఆ వుత్తరం చదువుకుని నీరైపోయాను. శేషగిరిని ఓరోజు పోలీసులు మద్రాసు తీసుకుపోతుండటం మాత్రం తను చూశాననీ, కారణం యెంత ప్రయత్నించినా తెలిసింది కాదని రాశాడు రాఘవరావు.

నిజంగా నేను చాలా బాధపడ్డాను. ఎంతో వున్నతికి వసాడనుకున్న వ్యక్తి యింతగా దిగజారిపోయాడు?... అనుకున్నా. ఎంత ఆలోచించినా, యే కారణాలవల్ల అరెస్టు చేయబడ్డాడో నావూహాకి అందింది కాదు. పాపం, జీవితమాధుర్యాన్వేషణలో అన్ని దురలవాటకే దాసుడయ్యాడు శేషగిరి: ఏ కారణమైనా అయ్యిండొచ్చు ...అనుకున్నా చెమ్మగిల్లిన కళ్ళు ఒత్తుకుంటూ—'నాకోసం బాధపడే వాళ్ళు యెవరున్నార్రా?' అని ఆనాడు వాడన్న మాట జ్ఞప్తికి వచ్చిందప్పుడు. 



రేపే వస్తాయిట రిజల్ట్సు. ఏం చేస్తాడో మరి యీయన — అన్నాడు పరంధామయ్య — పెళ్లాంతో. ఏం చేయడమేమిటి — దర్జాగా ప్యాసవుతాడు — తెలివి తక్కువ వాడా — చేతకాని వాడా! అత్తురాలా మీ కొడుకే అంది కామేశ్వరమ్మ. ప్యాసవడం మాటలు కేం పిచ్చిదానా — ఎంత కష్టపడాలి! టీ. తాగి తెల్లవార్లూ చదివినవాళ్ళకే దిక్కులేదు. వివాహో — విద్య నాశాయ — శోభనం సర్వనాశాయ అని పెద్దవాళ్ళు వూరికే అన్నారుటే. వీడి వివాహం ఫిబ్రవరి — కార్యం మార్చి — పరీక్షలు ఏప్రిలు. నాకేమీ నమ్మకం లేదు వీడు ప్యాసవుతాడంటే, అస్తమానూ ఆ పెళ్లాంతో ఆ గదిలో గుసగుసలాడటం ఎందుకంట. వీడికే వచ్చిందా పెళ్లాం. కోతికి కొబ్బరికాయ దొరికినట్టుంది వీడి వరస. ఇంటిపనీ...బయట పనీ ఎదిగిన కుర్రాళ్లుంటే ఎలా చూసుకుంటారు. తండ్రినెంత సుఖపెడతారు! అసలే వీడిమతం నాకు నచ్చలేదు. ఏమన్నా అడిగితే కళ్లు మూసుకుని మాట్లాడతాడు. ప్రతిమాట చెప్పడానికి ముందు ఓపాట, పాటను కత్తిరించి మాటా — మాటను కత్తిరించి పాటా — ఓహోహో ఏం కుమారరత్నం — జన్మ తరించింది అని రుసరుస ఆరంభించాడు పరంధామయ్య.

ఇప్పుడంటే మీరు ఇన్ని శ్రీరంగనీతులు చెబుతున్నారు కాని — నేను కాపరానికి వచ్చిన కొత్తలో — మీరూ యింతే. మీ అబ్బాయి కాదేమిటి — అన్నీ మీ పోలికలే పుణికి పుచ్చుకున్నాడు — అంది ప్రతి రుసరుసతో కామేశ్వరమ్మ.

అట్టే చెప్పే పెద్ద వాళ్ళుండగా — పగలూ రాత్రీ-భేదం లేకుండా వీళ్లిద్దరూ అలా గదిలో గుసగుసలు — నాకేం నచ్చలేదు. పరీక్షలు ప్యాసు కావాలనే బెంగ లేదు. ముందుదారి ఎలాగ? అనే ఆతురత అంతకన్నా లేదు. ఎప్పుడూ యీలాగ ప్రేమ పిచ్చితో గిజగిజలాడితే ఎలాగ. మంచీ చెడ్డా ఉండక్కర్లేదా? అంట — కొడుక్కి ఏం చెప్పతావో చెప్పు, అని గడపదాటాడు పరంధామయ్య.

* * *

పరంధామయ్యగారు ప్రథమ కోపి, తాటాకు మంటలాగ దడదడా వాగేస్తాడు. ఎలాంటి వాడినైనా దులిపిపారేస్తాడు. ఆ కోపంలో ఎవరూ ఏమీ అనకూడదు, అంటే యింకా రెచ్చిపోతాడు. అంచేత ఆయన కోపగించుకుంటూన్నప్పుడు కామేశ్వరమ్మ యేమీ కలగచేసుకోదు. కోపం చల్లారాక పరంధామయ్య తిక్క తిప్పుకొని తియ్యగా మాట్లాడుతాడు.

పరంధామయ్య చాలా ప్రయోజకుడు, ఏమీ చదువుకోకపోయినా కష్టపడి నీరుల్లిపాయ వ్యాపారంలో యింతగడించిన అదృష్టవంతుడు. ఆ వ్యాపార లాభంతో భూమి పుట్రాయుంకా సంపాయించాడు. పెంకుటి కొంపప్రక్కనే పెద్ద మేడకట్టుకున్నాడు. ఔనన్న సంబంధం చేశాడు. ఒక్కగానొక్క కొడుకు శ్రీనివాసరావుకి.

శ్రీనివాసరావు రాజమండ్రిగవర్నమెంటు ఆర్ట్సు కాలేజీలో బి. ఎ చదివి ఏప్రియలులో పరీక్షకు వెళ్ళాడు. శ్రీనివాసరావు పెళ్ళాం సీత చాలా మంచిపిల్ల. మామగారిదో మతి-

## అయ్యగారి విశ్వేశ్వరరావు

భర్తది మరోమతం. అయినా ఏం చేస్తుంది. చెప్పండి విధిలేక భర్తని అనుసరించింది అత్తగారి అండచూసుకుని.

సీతకి ఎంతయినా బెంగవుంది. పెళ్ళినాటే శోభనముహూర్తం పెడితే ఖర్చుకలిసివస్తుంది. యీడొచ్చినపిల్ల అని సీత తండ్రి వాదించాడు. పరంధామయ్య-పెంకిపట్టు పట్టి బి.ఎ. ప్యాసయితేనే కాని వీడికి కార్యం చేయనన్నాడు. శ్రీనివాసరావు కాలేజీ ఎగకొట్టి-యింక అత్తవారింటికి ప్రతివారం వెళ్ళడం ఆరంభించాడు. అల్లుడు తరుచు రావడం అమ్మాయితో మాట్లాడటం - యిలాంటిది ఏ పండుగనాడో అయితే ఫరవాలేదు కాని - పండుగలేని ప్రతి శని ఆదివారాలు యిలా పండుగలు లాగచేస్తే ఎలావుంటుంది? నలుగురూ ఏమనుకుంటారు? ఈ తికమకలు పడిన వియ్యంకుడు మెల్లిగా కామేశ్వరమ్మతో చెప్పాడు. తిక్క శంకరయ్య - పరంధామయ్యని మెప్పించి - ఒప్పించి - మెల్లిగా శ్రీనివాసరావు - సీతలమధ్య అడ్డు తీర్చారు- పరంధామయ్య భగభగ లాడుతూన్నప్పటికీ. కాని శ్రీనివాసరావుకి మాత్రం భార్య కాపరానికి వచ్చిందంటే హాయ్‌హాయ్ సీత పుట్టింటివద్ద వుంటే కాలేజీ ఎగగొట్టి- అత్తారింటికి పోవడం శ్రీనివాసరావుకి యింకా హాయ్ హాయ్. నువ్వు మీ పుట్టింట వుంటేనే బాగుండేది. నేను శని ఆదివారాలలో హాయిగా వచ్చేవాడిని — అన్నాడు శ్రీనివాసరావు. పరీక్షరోజులలో నన్ను మరిచిపోండి. మీకు పుణ్యంవుంటుంది - అంది సీత. నీకెలా వస్తోంది? అలా అనడానికి అన్నాడు శ్రీనివాసరావు. ఈ సంవత్సరం మీరు ప్యాసుకాకపోతే — నామూలంగా మీ పరీక్ష తప్పిందని అపవాదు వస్తుంది. నామాట వినండి — మంచివారు కదూ — అని సీత శ్రీనివాసరావు గడ్డం పట్టుకొని బ్రతిమాలింది — కాలేజికి వెళ్ళమని.

ఇలా — నేను హాయిగా వుండటం నీకిష్టంలేదన్నమాట! అంటూ కోపం తెచ్చుకున్నాడు శ్రీనివాసరావు. మీరలా కోపగించుకుంటే నేనేంచేసేది చెప్పండి. దర్జాగా పరీక్షలు వ్రాయండి. జయం పొందండి. నేను మీ యింటికి వచ్చినవేళ మంచిదనిపించండి. నామాట వినరూ — అని దీనంగా చూసింది సీత.

అట్టే చెప్పు — నిన్ను వదిలి ఒక్క క్షణమైనా వుండలేను. నాతో కూడా నువ్వు వస్తే నేను పరీక్షలలో కూర్చుని వ్రాస్తాను. లేకపోతే — యీ యేటికి యింతే — అని నిక్కచ్చిగా చెప్పాడు శ్రీనివాసరావు.

పరీక్షకి వెళ్ళే వాళ్ళంతా పెళ్ళాలతో వెడుతున్నారుటండీ? నామాట వినండి. అదేమీ బావుండదు. ఎవళ్ళైనా చూస్తే ఏమైనా అనుకుంటారు. దర్జాగా చదివి — పెట్టి వస్తాను. ఇల్లాళ్ళలో యిట్టే తిరిగివద్దురుగాని. సెలవల్లో హాయిగా వుండవచ్చు. ఊఁ అనండి అని శ్రీనివాసరావు చేతులు పట్టుకొని — సీత ఎంతో నచ్చచెప్పింది. మీ నాన్నగారు-మిమ్మల్ని కేక వేస్తారంటే — నాకెలాగో వుంటుందండీ-నామాట వినరూ? అని జాలిగా అడిగింది సీత.

యూనివర్శిటీవాళ్ళు బి. ఏ. ప్యాసవడానికి ఒక్క ఏడాదేనని యొక్కడా కాలం నిర్ణయించలేదు. ఎన్ని సార్లయినా పోవచ్చు. పోర్లు-పోర్లుగా ప్యాసుకావచ్చు. సీతా — నిన్ను వదలి వెళ్ళలేను. కాళ్లాడటంలేదు. నన్ను బలవంతంగా ఎడబాటు చేయకు. అంత బలవంతంచేసి యేంలాభం. నా బుర్ర పనిచేయటంలేదు. పరీక్షలో కూర్చున్నా ప్రయోజనంలేదు. ఒంటరిగా నేను వెళ్ళలేను. వ్రాయలేను. నువ్వు నా ప్రక్కని వుంటే దర్జాగా వ్రాస్తాను. నేను ప్యాసు



కావాలంటే నాతోపాటు నువ్వుకూడా పెట్టె సర్దుకొని ప్రయాణం సాగించు, లేదంటావా – పరీక్షమాట తలపెట్టకు అన్నాడు శ్రీనివాసరావు.

శ్రీనివాసరావు యిలా డీలాగా మాట్లాడుతూంటే తెలివిగలపిల్ల సీత పకపక నవ్వుతూ భరని అలా గదిలోకి తీసుకుపోయి-పడకకుర్చీలో కూలేసి కులికించే మాటలు చెబుతూ నేనోమార్గం చెప్పనా? అంది. చెప్పమన్నాడు శ్రీనివాసరావు. ఏమంత్రం చెవిలో వూదిందో-అంత పెంకిపట్టూ అతతిలపారేసి-సరే! వెడతాను-అన్నాడు శ్రీనివాసరావు.

హమ్మయ్య-అనుకుంది సీత చరచరా పెట్టే-బెడ్డింగూ సర్దింది. పరంధామయ్యగారి నౌకరు జట్కా తెచ్చి గుమ్మంలో పెట్టాడు. అమ్మతో చెప్పి ఇల్లాలితో వట్టిచూపులతోనే మాట్లాడి – ఇష్టంలేకపోయినా యిల్లు కదిలి రాజమండ్రివచ్చి లాడ్జిలో అడుగుపెట్టాడు శ్రీనివాసరావు. ఆ లాడ్జీచూస్తే డోకొస్తోంది అతనికి. సీతవుంటే ఎంత బావుండేది! అని అస్తమానూ అనుకుంటున్నాడు. సరిగ్గా-యీ రసకందాయంలోనే పరీక్షలు తగులడాలా-అని చిరాకుపడ్డాడు!

ఈ పరీక్షలు-విద్యార్థుల తెలివిని కొలిచే కొలబద్దలా! కామోహం. ఈ పరీక్షలో ప్యాసు కాకపోతే వచ్చిన ప్రమాదం యేముంది? అని సీతని తలుచుకుంటూ – పరీక్షలు ఎప్పుడయిపోతాయా? ఎప్పుడు యింటికి పోదామా అని క్యాలండరువైపు చూస్తున్నాడు శ్రీనివాసరావు – ఇంకెన్నాళ్లీ దాకా యీ పరీక్షల బందిఖానా అనుకుంటూ!

ఆ లాడ్జిలో వున్నవాళ్ళంతా ఎంతో బిజీగావున్నారు, ఒక్క నిమిషం కూడా వేస్టుచేయడంలేదు. తెల్లవార్లూ చదువుతున్నారు. చదివినవి ప్రశ్నించుకుంటున్నారు. ఏం వస్తాయో ప్రశ్నలు అనుకుంటూ భయపడుతున్నారు. ఎంతమందికైనా యీ బాపతు బెంగలు వున్నాయి కాని – శ్రీనివాసరావుకి మాత్రం సీత బెంగ మినహాయిస్తే మరే బెంగాలేదు. కొత్త దాంపత్యంలో వుంటే గొడవ యిదేనంటారా!

పరీక్షలు ఆరంభమయాయి. చరచరా అయిపోతున్నాయి. శ్రీనివాసరావు కూడా పరీక్షలకు హాజరయ్యాడు. నిశ్చింతగా వ్రాశాడు. తాపత్రయ పడటంలేదు. వచ్చినవి – రానివీ – అతనికి ఒకలాగే వుంటే యేం బెంగవుంటుంది చెప్పండి. తప్పన అయిపోతే బాగుండును. పెందరాళే యింటికి పోవచ్చు – అనుకుంటున్నాడు శ్రీనివాసరావు.

పరీక్షలయాక తోటివాళ్ళంతా ఒకచోట కూర్చుని ఎవరెలా వ్రాశారో అని పోల్చుకు నేవారు. శ్రీనివాసరావుకి యే బెంగాలేదు. హాయిగా కాలేజీకి పోవడం-తెలిస్తే రాయడం లేకపోతే మానేయడం. నిశ్చింతగా లాడికి రావడం. మే-ఒకటవ తేదీ దప్పనవస్తే బావుండునని క్యాలెండరువైపు చూడటం, పోస్టు యేంవచ్చిందో అని ఆతురతతో యెదురుచూడటం-చాలా బాగుంది పరీక్ష చదువు.

అది ఆఖరురోజు. పరీక్ష హాలుకి అతికరకుగావుంటే వాచరు వచ్చాడు. ముఖం ఎత్తి ఎవర్నీ మాట్లాడనీయడు. దప్పుడయితే నిప్పులు కక్కుతున్నాడు. లౌక్యంగా కాపీ చేసేవాళ్ళకి మహా గొప్పచిక్కు. ఓరచూపు కాపీలు కొట్టేవాళ్ళకి యమబాధ వచ్చిపడింది. బెంచీకింద బుక్కు పెట్టి కాపీచేసే వాళ్ళు పాపం నిరాశ చేసుకున్నారు. బొటనవ్రేలిమీద ముఖ్యాంశాల్ని వ్రాసుకు వచ్చిన విద్యార్థి-పాపం వుసూరుమంటూ వుమ్మితో చెరిపేసి-కర్చీఫ్‌తో కడిగేశాడు. ఇలాగే అందరూ ఎవళ్ళ జాగ్రత్తలో వాళ్లున్నారు.

ఆఖరు అరగంట కొట్టారు. యముడులాగ ఆవాచరు సరిగా శ్రీనివాసరావు దగ్గరకు వచ్చాడు నుంచోమన్నాడు. శ్రీనివాసరావు పిల్లిపిల్లలాగ బిక్కమొహంతో నుంచున్నాడు. ఏం-అలా బిక్కమొహంతో చూస్తావ్-చేసింది తప్పేనా? అన్నాడు

# పరీక్షా ఫలితం

వాచరు. నేనేం తప్పు చేయలేదన్నాడు శ్రీనివాసరావు. కాపీచేయడం తప్పు కాదన్న మాట నీదృష్టిలో అంతేనా? అన్నాడు చురచురచూస్తూ ఆవాచరు. కాపీచేస్తే-అది నిజంగా తప్పే అన్నాడు శ్రీనివాసరావు. అసలైనా అలా జేబులో కాయితం తీసి చూసి-మళ్ళీ వ్రాస్తున్నావే. అది కాపీ చేయడం కాదేం? అన్నాడు ఘాటుగా ఆ వాచరు. అలా కాయితం తీసి-చూసి-రాసినంతమాత్రంలోనే కాపీ అవుతుందా—మీరు పొరబడుతున్నారుసుమండీ అన్నాడు శ్రీనివాసరావు. ఆ కాయితం నాకిచ్చేయ్ అన్నాడు వాచరు. ఇవ్వడానికివీల్లేదన్నాడు నిర్మొహమాటంగా శ్రీనివాసరావు. అందరూ తెలబోతున్నారు-యేమిటీ చిన్న చిన్న చినుకు గాలివాన అవుతుం దేమిటా-అని.

ఈ గందరగోళం ప్రిన్సిపాలుదాకా పాకింది. కళ్ళెర్రచేస్తూ—ఆ ప్రిన్సిపాలు గారు యేమిటీ రభస అని విజృంభించారు. ఈ స్టూడెంటు డెలిబరేటుగా కాపీ చేశాడు సార్ అన్నాడు వాచరు, నేనేమీ చేయలేదన్నాడు శ్రీనివాసరావు. అతని జేబులోనే కాపీ చేసిన కాగితం వుందిసార్ అన్నాడు వాచరు. ఏం—వుందా! కాగితం! అని అరిచాడు ప్రిన్సిపాలు. వున్న మాట నిజమేనని ఒప్పుకున్నాడు శ్రీనివాసరావు. మర్యాదగా ఆ కాగితం నాకు చూపవయ్యా—అంటే నసైనా ఒప్పుకోడండీ—మొరాయిస్తాడు అంటూ సందు చూసుకొని వాచరు, యిష్టం వచ్చినట్లు చెప్పాడు ప్రిన్సిపాలుతో. ఏం—శ్రీనివాసరావ్! నీ ప్రవర్తన యేమీ బాగాలేదు. కాపీ చేయడం తప్పు. వాచర్ని యెదిరించడం రెండోతప్పు. ఏమంటావు యీ తప్పులకి? అని గర్జించాడు ప్రిన్సిపాలు. ఆ కాగితం యిక్కడ చూపడానికి నాకు సిగ్గేస్తూందండీ అన్నాడు శ్రీనివాసరావు. కాపీ చెయ్యడానికి సిగ్గెయ్యదేం. నలుగురిలోనూ కాపీ చేశావనిపించుకోవడానికి సిగ్గెయ్యదేం. కాపీ చేసిన కాగితం చూపడానికి సిగ్గేస్తూందా? ఏం ఆర్గ్యుమెంటయ్యా! ఓహోహో! అని ప్రిన్సిపాలు హేళన చేస్తూంటే—బి. ఏ. వాళ్ళే యిలా కాపీలుచేస్తే డిసిప్లిను దివాలా తీసినట్లే యీ కాలేజీలో అని వాచరుగారు వక్కాణించారు. ఎందుకండి—నా మీద మీ కింత అనుమానం—యిదుగో కాగితం ఏం చూస్తారో చూడండి—అని వుడుకుమోతుతనంతో శ్రీనివాసరావు జేబులోంచి కాగితంతీసి ప్రిన్సిపాలుగారికి ఇచ్చాడు—అతని ముఖంలో చాలా బాధ ప్రతిబింబించింది తీసి చూస్తే—అది తెలని కాగితం. అక్షరాలులేవు. దానిలో యింకో పోస్టుకార్డు సైజులాంటిది. ప్రిన్సిపాలు చూశాడు. వాచరుకు చూపించాడు. ఇద్దరూ తెల్లబోయారు. ఇంకేమీ నీ జేబులో లేవా-అన్నారు. వెతికారు. ఏమైనా వుంటేగా. ఇందులో కాపీ చేయడానికేంవుంది? ఇంత గొడవ జరిగింది యీ పోస్టుకార్డునుగురించా, అంతా గుమిగూడారు. చూసి తెలబోయారు. పాపం—కాపీ చేయలేగుర్రటా—శ్రీనివాసరావు, వాచరు పసికట్టింది వాడిపెళ్ళాం వ్రాసిన ఉత్తరమట! ఆవిడ ఆకార్డుకి తన ఫొటో అంటించి-హుషారుగా మూడే మాటలు వ్రాసిందిట. మీ విజయవార్తలు వినడానికి ఎదురుచూసే-మీ సీత అని, ప్రియురాలి వుత్తరాన్ని ప్రేమతో పరీక్షహాలుకి తెచ్చుకొని--చూసుకొని-హుషారు తెచ్చుకొని-పరీక్ష పేపరు ఘుమాయింపుకి పట్టుకుంటూన్న శ్రీనివాసరావు తప్పేమీ లేదురా—అని తోటివిద్యార్థులు అనుకుంటున్నారు. పాపం-కొత్తగావచ్చిన పెళ్ళాన్ని వదిలివుండలేక-యిలా అవస్థపడ్డాడురా పాపం—అన్నారు కొందరు బ్రహ్మచారి విద్యార్థులు. లేడీస్టూడెంట్సు-శ్రీనివాసరావుని పలకరించి ఫీలవకండి అని హెచ్చరించారు.

ఇలాగ పరీక్షహాలులో యింత ఊక్కపోతను శేకత్తించి-ఉత్సాహంగా శ్రీనివాసరావు యింటికి చేరుకున్నాడు. కామేశ్వరమ్మ మురిసిపోయింది. ఆరోగ్యంతో అబ్బాయి యింటికి వచ్చినందుకు, తనమాట విని యింత ఘనకార్యం చేసినందుకు-లోలోపల మురిసిపోయింది సీత. ఈ పరీక్ష కూడా ప్యాసయితే చాలాబావుండును అని ఎరిగిన దేవతలకి దణ్ణంపెట్టింది

ఇంక పరంధామయ్య సంగతి యేం చెప్పను. స్వతహా ఆయన లావాదేవీల మనిషి. వట్టి కోర్టుపక్షి. సాక్షిగానో--వాదిగానో-ప్రతివాదిగానో నిత్యం కోర్టుకిపోయి హాజరు చెప్పుకుంటాడు. ఈ ప్లీడర్ల బాధపడటం మహాకష్టంగా వుందంటాడు. మన చెప్పుచేతల్లోవుండే ఒక చలాకీప్లీడరు కావాలంటాడు. వాళ్ళఅబ్బాయి చప్పున బి. ఎ. ప్యాసయితే ప్లీడరుపరీక్షకి పంపాలనీ-బల్లకట్టించి-ప్లీడరుబోర్డు పెట్టించాలనీ పరంధామయ్యగారి గట్టిపట్టు. ఇలాచేసే పెంకితనం చేస్తూన్న ప్లీడర్లకి తగినశాస్తి అవుతుందని ఆయన పిచ్చినమ్మకం. అంచేత నే బి.ఎ. రిజల్ట్సు రేపేవస్తాయి-రేపే వస్తాయి అనుకుంటూ-ఆ రేపు చప్పునవస్తే బావుండునని గడపదాటాడు ఆ వేళ ఆ పరంధామయ్య.

* * *

ఆరాత్రి పరంధామయ్యకి నిద్ర లేదు. తెల్లారింది. కొడుక్కి లేని బి. ఎ. రిజల్ట్సు బెంగ ఆయనకు ఎక్కువయింది. ఆ ఆతురతతో హడావిడిగా వున్నాడు. మెయిలు వచ్చేటయినయింది. పేపర్లు వస్తాయి. పేపర్లలో పరీక్షాఫలితాలు. శకునం చూసుకుని పోవాలి. అనుకుంటూ-అబ్బాయి నెంబరుతో కోడల్ని అడగవే అన్నాడు పరంధామయ్య-పెళ్ళాంతో. తడుముకోకుండా 725 ట అంది కామేశ్వరమ్మ. డైయిరీలో నోటుచేసుకుని తీవిగా బయలుదేరాడు—పుల్లిపాయల లాభంయిప్పించిన మినిమించిలిపాడు చల్లాలమ్మని చల్లనివేళ తలుచుకుని-గడపదాటగానే ఎదురింటి ఈశ్వరమ్మ తుమ్మింది. చఛా అని చతికిలపడ్డాడు. ఈయనకి వున్న శకునాల పిచ్చి యిండియాలో ఎవరికీ వుండదేమో! కొస్తతమాయించుకొని బయలుదేరి రెండడుగులు వేసేసరికి - ఎక్కడికో వెడుతున్నారు - అన్నగారు అంటూ ఎగురువచ్చింది యీ మధ్యనే వితంతురూపం ధరించిన వెంకమ్మగారు అధికస్య అధికం బలం-యీ రెండు ఫిరంగిప్రేలుడు శకునాల ఫలితం ఎలా వుంటుందో? అని పరంధామయ్య కొంచంజంకినా-కేవలంహిరణ్యకశిపునిలాంటివాడేమో! టూ నెగిటివ్సు మేక్ ఎఫర్మేటివ్ అనే సూత్రం తలుచుకుని మడమ తిప్పకుండా మలబార్ కాఫీహోటలు ప్రాంతానికి వెళ్ళాడు. మనరోజులు బావుంటే శకునాల తీవ్రత తప్పకుండా తగ్గుతుందని ఆయన అనుభవం.

ఎవళ్ళకీ యేమీ తోచకపోతే అవుర్లో మలబార్ కాఫీహోటలు దగ్గర కూర్చుంటారు. ఆపక్కనే బస్సు స్టాండుంది. రైళ్ళకి పోయే జట్కాలు అక్కడే ఆగుతాయి. పత్రికా-ప్రభా-హిందూ-ఎక్స్‌ప్రెస్సులు అక్కడే అమ్ముతారు. ఒకరికి కాఫీఖర్చు రద్దే భూలోక పికాడాలు

అక్కడే తిరుగుతూంటాయి. లిటిగేషను వాహకులు – ప్లీడర బ్రోకర్లు – రకరకాల వారి రంగస్థలం అది.

ఆ వేళ పరంధామయ్యగారి రాకనిచూసి స్నేహితులు ముసిముసి నవ్వులతో ప్రశ్నించారు – యిలా వచ్చారేమిటి అంటూ, అయిదారుగురు స్నేహితులతోటే– మావాడి పరీక్ష రిజల్ట్సు వస్తాయిట యివాళ. ముందుగా చూసిపోదామని వచ్చానన్నాడు – శీవిగా పరంధామయ్య. మీవాడేమిటి ప్యాసుకాకపోవడ మేమిటి – దర్జాగా ప్యాసవుతాడు పరంధామయ్యగారూ! అని ఒకరి తరవాత యింకొకరు శుభ్యాసనములో అడ్వాన్సుగా అభినందించారు – ఆ స్నేహితులందరూ, ఈ శుభశకునం – పాత పాడుశకునాల్ని తరిమి తన్నదా ! అనుకున్నాడు పరంధామయ్య.

ఇంతలో పేపరు బంగీలువచ్చాయి. చకచకా ఒక స్నేహితుడుపోయి ఆంధ్రపత్రిక తెచ్చాడు. ఎంతండి మీవాడి నెంబరు – యివిగో – ఆంధ్ర విశ్వవిద్యాలయం. బి. ఎ. రిజల్ట్సు. వాల్తేరు – తేదీ – అంటూ ఓ స్నేహితుడు రిజల్ట్సు శీర్షికల్ని చదవడం ఆరంభించాడు. 725 నెంబరు చూడండి! అన్నాడు పరంధామయ్య. అందరు స్నేహితులూ యిదుగో 725! యిదుగో 725! అంటూ 725 భజన చేశారు. ఎంతో గర్వించాడు పరంధామయ్య.

ఇంతటి మహదానంద సమయంలో—వట్టిమాటల్ని ధటిస్తూ – అలా చూస్తారేం పరంధామయ్యగారూ! టీపార్టీ చెయ్యాలి—అన్నారు స్నేహితులు ఆరుగురూను. అహం ఎంతమాట! మీ చేత చెప్పించుకుంటానా, ఇంటిదగ్గర యివాళే గ్రాండు టీపార్టి యిస్తా. మీ రంతా వద్దురుగాని అన్నాడు పరంధామయ్య—వీ లున్నంతవరకూ వీల్లని తప్పించుకోవాలని పరంధామయ్య తాపత్రయం.

– సరి! సరి! యింత అవస్థపడి పేపరంతా వెతికి మీ వాడినెంబరు వినిపించినందుకు యిదేనా బహుమానం ఆ టీపార్టీమాట అటుంచండి—యిప్పుడు యీ మలబార్ హోటలులో యథోచితంగా మీరు టీపార్టీ చేస్తేకాని మిమ్మల్ని వదలం అని పరంధామయ్యని చుట్టేశారు ఆ ఆరుగురు స్నేహితులూ చనువుగా. వాళ్ల పద్మవ్యూహం నుంచి బయట పడేదారి కనిపించలేదు పరంధామయ్యకి.

ఎందుకంత తొందర పడతారు. తప్పకుండా చేస్తానుగా పధ్యాహ్నం. యిప్పుడు పర్సు తీసుకురాలేదు. యేమీ అనుకోకండి అంటాడు పరంధామయ్య. మనీపర్సు తీసుకు రాలేదంటే–వాళ్లు వెనుకంజ వెయ్యకుండా వుంటారా అని పరంధామయ్య నమ్మకం.

మలబారు అయ్యరు మహా మంచివాడు. ఎంతమందికైనా అరువు యిస్తాడు, యిస్తున్నాడు. మీ కెందుకు అరువు యివ్వడు. రండి పరంధామయ్యగారూ! అంటూ ఆ ఆరుగురు స్నేహితులూ ఆయన్ని మలబారు కాఫీహోటలులో కూలవేసి–చుట్టూ కూర్చున్నారు. ఒకు తెలియకుండా—మొహం వాచినట్లు—ఆ ఆరుగురు స్నేహితులూ ఆర్డర్లిస్తున్నారు. సెర్వరు మతిపోతూంది వాళ్లకి సప్లయి చేసేసరికి. పోనీ యిదీ ఓ బాపతు అన్న శాంతిలాంటి కాఫీహోటలు శాంతి–ఇంటికీ—ఒంటికీ మంచి దనుకున్నాడు పరంధామయ్య. కుర్రాడు పరీక్ష ప్యాసయ్యాడుకదా—యీ సంతోషానికి యీ స్వల్పఛార్జి ఫరవాలే దనుకున్నాడు.

ఇంక కాఫీపానం దశలో వున్నారు అంతా. రామశర్మగారు కొడుకు తిలక్‌తో వచ్చాడు. పరంధామయ్యగారూ–ఆ స్నేహితులు అంత ఆనందంగా వుండటం చూశాడు. చూసినవాడు తిన్నగా వుండచ్చునా వుండడే. అన్నట్టు మీకు తెలియదుగా. రామశర్మ కొడుకు తిలక్ కూడా బి. ఏ. పరీక్షకు కూర్చున్నాడు. మన శ్రీనివాసరావు క్లాసుమేటు పేదరికంలో వున్న కొడుకు గ్రాడ్యుయేటు కావాలని ఎంతో దీక్షతో–ఎన్నో బాధలుపడి చదువు చెప్పించాడు.

పాపం–మీవాడి పరీక్ష...అన్నాడంతే రామశర్మ, ఏం–వాళ్లబ్బాయి పరీక్షకేం పాపం వచ్చింది. అంతా యింతా అన డానికి వీల్లేనంత పుణ్యం వచ్చింది. మాకీ యిడ్లీ వుప్మా–కాఫీ సంతర్పణ చేసింది–ఏం అలా తెల్లబోతారు. ఈబిల్లు మేం యిస్తాం అనుకుంటున్నారా ఒక్క నయాపైసా కూడా మేం యివ్వం. బిల్లు యావత్తూ పరంధామయ్యగారు యిస్తారు. ఈ మహాయిడ్లీ–ఉప్మా – కాఫీ సంతర్పణ మాకు ఆంధ్రా యూనివర్సిటీ–బి. ఏ. డిగ్రీ తాలూకు 725 నెంబరు యిప్పించింది. పరంధామయ్యగారికీ–వారి అబ్బాయికీ తీపితీపి శేజేలు అని ఆ ఆరుగురూ తప్పట్లు లంకించుకున్నారు. పరంధామయ్యగారు యింతటి గౌరవం – ఆ అపశకునాలను ఎదిరించి–తనకు లభ్యం అయినందుకు జరకండువా ఒకసారి అటూ యిటూ సరుకున్నారు.

తెల్లబోతూ రామశర్మ అందుకున్నాడు. ఇదుగోవీడే నాకొడుకు తిలక్. వాడూ B. A. పరీక్షకు వెళ్లాడు వాడినెంబరూ 725 మీ పరంధామయ్యగారి కొడుకిది 725 అంటారా–అన్నాడు.

ఏమో! అదిమాకేం తెలుసు, యూనివర్సిటీ గుమాస్తా నిద్రబోతూ నెంబర్లేస్తే ఒకే నెంబరు యిద్దరికి రావచ్చు–ఒకరినెంబరు యింకొకరికి రావచ్చు. దానికి పరంధామయ్యగారు బాధ్యులా ? అన్నాడు ఒక స్నేహితుడు. ట్రూ! ట్రూ! అదేపాయింటు అన్నారు మిగతా స్నేహితులు. ఈ యింకా యింపులధాటికి తట్టుకోలేక రామశర్మ మాట్లాడకుండా వూరుకొని—ఒక వేళ తన కొడుకే తప్పు చెప్పినాడేమోనని — పోలు టిక్కెట్టు తెమ్మన్నాడు.

ఈలోగా పరంధామయ్య—ముఖం యింత చేసుకొని, ఆ ఆరుగురు స్నేహితులతో విన్నారుగా—మన రామశర్మగారి డబాయింపు, నెంబరు వాళ్ళబ్బాయిదేట. మావాడు ప్యాసవడం కిట్టక—కళ్లల్లో కారం జల్లుకుంటున్నాడండి—మన వాళ్లంతే. ఆఖరికి యిలా మారిపోతున్నారు. పొరుగు పచ్చగా వుంటే—చిచ్చు పుట్టించడానికి విశ్వప్రయత్నం చేస్తారు. అని యింకా పరంధామయ్య ఏవో చెబుతూంటే—ఆ ఆరుగురూ అందుకున్నారు — నాది నాది అంటేనే నాదవుతుందిటండీ—ఆ రామశర్మ పిచ్చ కాకపోతే. ఆ నెంబరు మీ వాడిది లేకపోతే పేపర్లో పడుతుందా. ఈ కాఫీ శాంతి చేయిస్తుందా—అని పరంధామయ్యగారికి తందానతానా అన్నారు.

(43 వ పేజీ చూడండి)






## [ఉద్యోగపర్వమునుండి]

క. సమరథులు గవలు భుజగర్వము పటువిక్రమము దుర్నివారంబులు వా
రిమనంబులు నిర్భయములు, దమ మొనలకు మించి బెట్టు దాఁకుదు రధిపా.

సీ. వా రందఱును ధర్మవైభవంబునఁ దప స్సంపద నెక్కుడు జనుల కెల్ల
ధనువునాఱంగంబులను బరిణతులు దాఁ కోర్తురు పరులకు నోర్వరాని
కోల్తల గలరు పెక్కులు పరాక్రమములు వేర్వేఱ చేసిన వీరు లొక్క
మొగ మయి తాఁకిన వెగ డంద కుందుసే మన సేన ము న్నవమానపాటు

ఆ. దుఃఖపాటు గలిగి తొడరంగ వచ్చిన, వారు గాన యలఁతిఁ బోరు ప్రాణ
మానపడక యోపినంతయుఁ బెనఁగుదు, రది సహించి నిలుచు టరిది మనకు.

మ. నరుఁ డీమానము వాఁ డనంగ వశమే నా కంతవా రెందు నె
వ్వరు లే రింకను బుట్ట రా పులికి దుర్వారోద్యముం డైన యా
హరియుం దోడ ఱి యేమి చెప్పదు నతం డా సేనలం గాచు నొ
క్కరుఁడుం గీటడఁగించు నీబలములన్ గాండీవదుర్దాంతుఁ డై.

వ. అనిన విని యక్కొలువున నున్న రాజులమనంబు లెల్లను జేవ పెడియె భీష్ముండు వెండియు ని ట్లనియె.

సీ. ద్రౌపదేయులు మహారథు లేవురును వారి తరమ యుత్తరుఁడును ధరణినాథ
యతిరథవర్యుఁ డయ్యభిమన్యుఁ డర్జునవాసుదేవుల కెన వచ్చువాఁడు
లఘుచిత్రములు నేర్చులావును దాల్మియుఁ గలఁడు తండ్రులపాటు దలఁచుచుండుఁ
గావున బెడిదంబుగాఁ బోరు సాత్యకి యతిరథోత్తముఁడు శౌర్యాన్వితుండు

తే. పాండవస్నేహసక్తుఁ డై యుండుఁగాన, యలుకమనమీఁదఁ బెద్దయుఁ గలిగి పెనఁగు
వీర లిరువురుఁ బరునని వారు సమర, పరుల, నొప్పింతు రీయోధవరుల నెల్ల.

మ. అలఁతిం బోరు మహారథుల్ ద్రుపదమత్స్యాధీశు లుద్యద్భుజా
బలశౌర్యాఢ్యులు పాండురాజసుతసంబంధప్రియస్నేహముల్
గలిమిం జేసి తదీయ దైన్యమునకుం గా నొచ్చియుం జచ్చియున్
గలిపింపం దమకించి చొత్తు రని కేకీభూత చేతస్కు లై.

ఆ. వీరగుణము బలము వీఁకయుఁ గలడు మహారథుఁడు శిఖండి యతనితమ్ముఁ
డతిరథుండు దర్పయుతుఁడు ధృష్టద్యుమ్నుఁ, డుగ్రతేజుఁ డనికి నుగ్రుసట్ల.

క. అతనిసుతుఁ డర్ధరథుఁ డా, ధృతవర్మఁడు పిన్ననాఁడు త్రిమ్మట కాఁ డై
మతిహీనత శస్త్రాస్త్ర, ప్రతతిపరిశ్రమము లేక పాలసుఁ డగుటన్.

ఆ. చేదిభూవిభుండు శిశుపాలతనయుండు, ధృష్టకేతుఁ డధికధీరమతి మ
హారథుండు భోజుఁ డజుఁ డనురాజులు, నట్టివార తెంపు నలవుఁ గలరు.

వ. ఉత్తమౌజుండును యుధామన్యుండును క్షత్త్రదేవుండును జయంతుండును నమితౌజుండును విరాటుండును సత్యజిత్తుం
డును ననం బరఁగు పాంచాలకులప్రదీపకులు మహారథులు మత్తమాతంగ బృందంబుచందంబునం బ్రతిబలంబు
పయిం గవిసి కోలాహలబహుళంబుగాఁ గలంపం జాలుదురు కేకయపతు లేవురు సహోదరులు మహారథులు గడింది

మగలు గెంపురథంబుల మొత్తంబులతోఁ గార్చిచ్చు పగిదిం బొడుపుదురు కాశికుండు నీలుండు సూర్యదత్తుండు మది రాశుండు శంఖుండు విరాటజ్ఞాతులు మహారథులు వివిధాయుధవిద్యావిశారదులు వారిపోరు భరంబై యుండు.

సీ. చిత్రాయుధుండును జేకితానుండు మహారథు లిద్దఱు నర్జునునకుఁ
గూర్తురు కయ్యాన కోర్తురు నేర్తు రాయుధముల కెల్ల నత్యుగ్రు లవ్వి
ధము వార చంద్రదత్తవ్యాఘ్రదత్తులు వినుము సేనాబిందుఁ డను నృపాలుఁ
డతిరథోత్తముఁడు మారుతపుత్రు నెన యతం డొక్కరుండును వారియుజ్జీదిలావు

ఆ. పాండ్యుఁ డతిరథుండు బలఁగంబుగలవాఁడు, సమరథుండు గార్గ్యుఁ డమితబలుఁడు
కుంతిభోజుఁ డాజికోవిదుఁ డతిరథుం, డతనియొద్దిపోదు లధికబలులు.

వ. రోచమానుండు మహారథుండు దేవసమానుండు.

తే. అతిరథుల కెల్ల దల దండ్రియట్టివాఁడు, యసురవిభుఁడు ఘటోత్కచుం డాహిడింబ
కొడుకు మాయాబలంబున నోడుచుఁ బగఱ, నతనికడ దానవానీక ముగ్గలంబు.

వ. తోఁచినవారిం బేరుకొంటి నింతియ కాని రెండు వీళ్లను మంచిమగలు పెక్కండ్రు గల రని చెప్పి గాంగేయుండు.

క. పాండవుల దిక్కువీరు ల, ఖండితబలు లైన నామొగంబునఁ బడి యు
ద్దండత చూపఁగ లేరు శి,ఖండిని నొక్కరునిఁ జంపఁ గాని కుమారా.

క. అనవుడు దుర్యోధనుఁ డా,తని మీరు వధింపమికిఁ గతం బేమి యొకో
వినఁ దగు నేనిం జెపుడా, యనుటయు నిట్లనియె భీష్ముఁ డతనికి నెమ్మిన్.

వ. ఏ నాశిఖండిని జంపమికి మూలంబు సాలం గలదు తత్ప్రపంచం బంతయు వివరించెద నాకర్ణింపుము.

## భీష్ముండు దుర్యోధనున కంబోపాఖ్యానంబు సెప్పుట

సీ. శంతనుపిమ్మట సత్యవతీదేవి యనుమతితోడఁ జిత్రాంగదునకు
సామ్రాజ్యపట్టంబు సమ్మతిఁ గట్టితి నల్ప కాలంబున నతఁడు దివికిఁ
దత్పరోక్షావస్థఁ దదనుసంభవుని విచిత్రవీర్యుని రాజుఁ జేసి పెండ్లి
సేయంగఁ దివిరి కాశీపతికూఁతులు కన్యలు ముప్పురు గలుగుటయును

తే. నాతఁ డర్థిఁ దదీయస్వయంవరమున, కఖిలనృపతులఁ బిలిపించె ననియు నెఱిఁగి
తల్లి కెఱిఁగించి యొంటిమైఁ దత్పురమున, కాయితంబయి పోయితి నరద మెక్కి.

వ. ఇవ్విధంబునం జని యమ్మహోత్సవంబున నలంకృతలై యున్న యంబయు నంబికయు నంబాలికయు ననుముద్దియల ముప్పురం బట్టి రథంబుపయిఁ బెట్టికొని రా నచ్చటిరాజు లెల్లను జతురంగబలంబులతో వచ్చి నన్నుం జొదివినఁ బలు విశిఖానలశిఖాకలాపంబున వేఁడిమి చూపి వారి నిలువరించి యరుగుదెంచి సత్యవతికి నప్పొలంతుల నొప్పించిన నద్దేవి విచిత్రవీర్యునకు వారల వివాహంబు సేయ నుద్యోగించె నట్టియెడ నమ్ముప్పురయందుం బెద్దయది యైన యంబ యను కన్యక నాతో నిట్లనియె.

తే. సౌంభపురవల్లభుండైన సాళ్వమీఁదఁ, దలఁపుగలదు నాకతఁడును దగులు గలిగి
యుండు నాదెస నీవు ధర్మోత్తరుండ, వతనిపాలికిఁ దగ నన్ను ననుపవయ్య.

క. అన విని సత్యవతికిఁ జె,ప్పిన నాయమ యనుప నంబఁ బెంపుగ వృద్ధాం
గనలం దోడుగ నప్పుడ, పనిచి యనిచితిని జనంబు ప్రస్తుతి సేయన్.

వ. ఇట్లు పనిచి తక్కినకన్నెల నిరువురం బాణిగ్రహణంబు సేయించితి.

క. అంబయు నట సాళ్వునికడ,కుం బోయిన నతఁడు భీష్ముకొనిపోయినదా
నిం బరచుం గైకొన ధ,ర్మంబే కన్యాత్వ మెడలె మగుడు నీకున్.

వ. ఇంక నిన్ను భార్యఁగా వరియింపందగునే యనినఁ గామశరపీడిత యగుచు నక్కామిని యతని కిట్లనియె.

తే. తమ్మునికిఁగాఁగ భీష్ముఁ డుదగ్రవృత్తిఁ, గన్నియలఁ గొనిపోయెడుఁ గాన బలిమి
నన్నుఁ గొనిపోయె నాచేత నిన్ను వినిన, యపుడె పుత్తెంచె దూషింప నవఘుతగునె.

వ. మాతండ్రి యెఱుంగక స్వయంవరాలంకారంబు నాకుం జేయించినకతంబున నింత పుట్టె భీష్ముండు నాచెలియండ్రం దనతమ్మున కిచ్చి నన్ను నీకడకుం దగననిచె దీన నేమి తప్పని మఱియు ననేకప్రకారంబులం బలికిన వినక తన్నుం జేకొనక సాళ్వుండు.

క. కరుణంబుగ నేడ్చు తలో, దరిఁ బో పొమ్మిచట నింకఁ దడయకు మని మం
దిరము వెడలంగ నడిచిన, నరిగె నదియు నార్తచిత్తయై వికలగతిన్.

వ. చని చని యవ్వెలంది యిట్లని వితర్కించు.

తే. సాళ్వునకుఁ గానియపుడ సంసారమునకుఁ, బాసితిన యింక భీష్మునిపాలి కేల
యరుగ నాతండు మూల మిహానికెల్ల, గాన యాతని సాధింతుఁ గాక యేను.

క. గాంగేయు గెల్వ నెవ్వరి, కిం గొలఁదియె తపము పేర్మి గెలిచెదఁ గా కం
చుం గాంత సనియె సంయమి, పుంగవు లొకకొంద ఱున్న పుణ్యస్థలికిన్.

వ. చని వారలకుం దనవృత్తాంతం బెఱింగించిన వా రిది రాజులు సేసినపని సాధులచేతఁ జక్కం బడునే యనిన నవ్వనిత దపశ్చరణంబునకు వచ్చితి ననుటయు నీవు సుకుమారవు నీ కిది యొప్పదు నీతండ్రిపాలికిం బొమ్మిదియ పరమ ధర్మం బని పలికిన వారి కన్నారీరత్నం బి ట్లనియె.

క. ఎవ్వరు నెఱుఁగక యుండఁగ, నివ్వనమునఁ దపము సేత యిది నిర్ణయ మే
నెవ్వారికడకు నే మని, యెవ్విధిఁ బో నేర్తు దాన నేటికి బంధుల్.

వ. అని చెప్పు నవసరంబున న య్యాశ్రమంబునకు హోత్రవాహనుం డను రాజర్షి వచ్చిన నమ్మును లభ్యాగతపూజలు సేసిన యనంతరంబ యంబం గనుంగొని యిక్కన్నియ యెక్కడిది దీని విషాదంబునకుం గారణం బే మని యడిగి వారివలన దాని జన్మప్రకారంబును దద్వృత్తాంతంబును విని తన కూఁతుకూఁతురగుట యెఱింగి యయ్యంగన వినం దపస్విజనంబులకుం జెప్పి యప్పొలంతిం దన యంకతలంబున నునిచికొని వెండియు నడుగ సవిస్తరంబుగా నచ్చేడియ చెప్పిన విని శోకించి యవ్విషమప్రకారంబునకు విస్తారంబుఁ జింతించి.

ఉ. నీ కిది యేటికిం దప మనింద్యచరిత్రవు నీవు నిన్ను నేఁ
జేకొని కాతు నొక్కగతిఁ జెప్పెద భార్గవరాము నాశ్రిత
శ్రీకరుఁ గాన్పు మాపదలు సెందఁగ నీఁ డతఁ డాశ్రయించినన్
శోకము దక్కు మన్న విని సుందరి యల్లన యత్తపస్వితోన్.

ఆ. పరశురాముఁ గానఁ బడయుట యెక్కడఁ గలుగు నాతఁ డెట్లు కరుణ సేయు
ననఁ దపస్వి యిట్టు లను మహేంద్రంబగు, పర్వతమునఁ జేయుఁ బరమతపము.

వ. నన్ను మన్నించుం గావున మదీయదౌహిత్రి వగుట యెఱింగిన నిన్ను రక్షించు నందుఁ బొమ్మను సమయంబునం బరశురామశిష్యుం డగు నకృతవ్రణుం డను ముని వచ్చి యతిథిసత్కారంబులం బూజితుండై యున్నఁ బ్రియపూర్వకంబుగా నాహోత్రవాహనుండు భార్గవుం డెయ్యెడ నున్నవాఁ డని యడిగిన నతం డి ట్లనియె.

క. తన ప్రియసఖుఁడవు నీ వని, మునిజనులకుఁ జెప్పుచుండు ముదమున నిన్నుం
గనుఁగొనఁగ నెల్లి యిచటికిఁ, జనుదెంచు ననేక శిష్యసంఘముతోడన్.

తే. అనిన విని యెల్లవారును నధికహర్ష, మొనఁగ నున్నంత మఱునాఁడ యేఁగుదెంచె
భార్గవుం డమ్మునీంద్రులు పరమభక్తి, నర్చ లిచ్చిరి హోత్రవాహనుఁడుఁ గనియె.

వ. కని పరశురాముని సంభావనంబును సంభాషణంబును బడసి కాశిరాజకన్యకం జూపి యిది నాదౌహిత్రి దీని వృత్తాంతం బంతయు విను మని యమ్మానినిం గానిపించిన నదియును.

చ. కనుఁగవ నశ్రుధార లొలుకం జరణానత యైన రాముఁ డి
ట్లను విను హోత్రవాహనునియట్టుల యేనును నీకు నీమనం
బునఁ గలచింత యంతయును బుచ్చెద నాకడఁ జేరి తింక నీ
వనటఁ దొలంగఁ బెట్టి గరువంబుగఁ జెప్పుము దీనిమూలమున్.

వ. అనిన విని యమ్మహాత్మునకు నంబ దనవృత్తాంతం బంతయు సవిస్తరంబుగాఁ జెప్పి నీ వార్తశరణ్యుండవు నాపరిభవంబు దీర్చి నన్ను రక్షింపు మనవుడు నతం డి ట్లనియె.

క. పరిభవము రెండు దెఱఁగులఁ, దరుణీ తోఁచినది సాళ్వుఁ దగఁ దేర్తునో యు
ద్ధురుఁ డగు భీష్మునిఁ దేర్తునో, కరము ప్రియం బెద్ది హృదయగతముం జెపుమా.

చ. అనవుడు నింతి యి ట్లను మహాపురుషా నను సాళ్వుఁ డింకఁ గై
కొనఁ డది సాలు భీష్ముదెసఁ గోపము నామదిఁ గల్గి యుండు నా
తని వధియింపఁ బూని యిటు తాపసవృత్తికి వచ్చి యిచ్చటన్
నినుఁ గని యీపరాభవము నీఁగఁగ నీశరణంబుఁ జొచ్చితిన్

తే. అనిన నాచెప్పినట్ల గంగాత్మజుండు, సేయుఁ జేయక తక్కిననిశితశరముల
నతనిఁ బడవైతు నూఱడు మబల నీకుఁ, దపము సేయంగ నేటికిఁ దనువు డయ్యె

## పరశురాముఁ డంబం దోడుకొని భీష్మునియొద్దకు వచ్చుట

క. అని పలికి పరశురాముఁడు, సనుదెంచెను మునిజనంబు సమ్మదమునఁ దోఁ
జనుదేరఁ గురుక్షేత్రంబున కుద్ధతిఁ గాశిరాజపుత్రిం గొనుచున్.

వ. వచ్చి సరస్వతీ తీరంబున విడిసి తనరాక నా కెఱింగించిన నేను ఋత్విక్పురోహితప్రభృతివిశిష్టబ్రాహ్మణ సమేతం బుగాఁ బూజాద్రవ్యంబులు గొని తత్ప్రదేశంబున కరిగిన నమ్మహాత్ముండును మదీయభక్తివినయసంభ్రమంబుల సంప్రీతి నభినందించి యర్చనలు గైకొని కాశిరాజకన్యకం జూపి నాతో ని ట్లనియె.

తే. బలిమి ము న్నీల తెచ్చి తిప్పడఁతి మగుడఁ, ద్రోచి పుచ్చంగఁ దగునయ్య నీచవృత్తి
వచ్చె దీనిఁ దమ్మునికి వివాహ మింక, నైనఁ జేయుము చెఱుచుట యనుచితంబు.

క. అనుటయు ననఘా తెలియుము, విను మిది నాతోడ సాళ్వవిభునకు నేఁ గూ
ర్చినచాన నతనిపాలికి, ననుపుము న న్ననినఁ గాదె యనిచితి మగుడన్.

తే. ఇంక నాతమ్మునికి దీని నెట్లు పెండ్లి, సేయ నేరుతు ననుడు నా చెప్పినట్లు
సేయ వైతేని నిన్ను నీచెలులఁ జుట్టములను జంపుదు ననియె నమ్మునివరుండు.

వ. ఏను వినయంబు వదలక వినతుండ నగుచు వివిధవాక్యంబులం దెలుప నంత కంతకు నతనికిఁ గోపం బగ్గలం బైన వెండియు.

ఆ. గురుఁడ వై సమగ్రకోదండవిద్యామ, హత్త్వ మిచ్చినాఁడ వలుగఁ దగునె
కారణంబు లేక యీరసమెత్తి యి,ట్లనినఁ బరశురాముఁ డాగ్రహమున.

చ. గురుఁ డని న న్నెఱుంగు దనఘుండవు నావచనంబునం దనా
దరణము సేసి తెన్నియొ విధంబులఁ బల్కెదు భక్తితోడ నీ
వెరవులు దక్కు మీయబల వేగమ పెండిలి సేయు మంతతో
మరల మదీయకోపశిఖమానదు వేఱొక వేయుఁ జేసినన్.

వ. అనిన విని ధర్మాచరణంబున కింత పట్టి పెనంగనగునె పరానురక్తచిత్తయగు మగువ నిల్లాలిం జేయువారుం గలరె యిట్టి యకృత్యం బాచరించుకంటె నీచేత నె ట్లయినను లెస్స తొల్లి పెద్దలు సెప్పినచొ ప్పవధరింపు మని యిట్లంటి.

తే. గర్వి యై కార్య మిట్టి,ద కార్య మిట్టి దని యెఱుంగక లోకంబు చనుపథమునఁ
దిరుగ కున్మదవృత్తి వర్తించునట్టి, వాని గురునైన దండింపవలయు నండ్రు.

క. అనుమాటకుఁ గాలానల, మునుబోలెను మండి కయ్యమున కాయిత మై
మొనలేర్చి వేగ యిచటికిఁ జనుదెమ్మని భార్గవుండు సంరంభమునన్.

వ. పలికిన నేనును,

క. అలుకఁదనంబున విప్రున, కలుగంగాఁ దగదు గురుఁడు నై యున్నాఁ డం
చలయక తలఁచితిఁ గా కిటు, నిలుమీ నీరణము సేఁత నిజ మగు నేనిన్.

క. క్షత్రియులఁ దొల్లి యలుకకుఁ, బాత్రము సేసితట నాఁడు బలియుఁడు గంగా
పుత్రుఁడు పుట్టమిఁ గా కిది, యీయాత్రయు నింకేల చెల్లు నెఱుఁగవె నన్నున్.

# పెరల్ బక్

భానుమతి రామకృష్ణ



సాహిత్య రంగంలో ప్రఖ్యాత అమెరికన్ నవలా రచయిత్రి పెరల్. ఎస్. బక్ పేరు తెలియని వారుండరు.

ఆమె రచియించిన "ది గుడ్ ఎర్త్" నవల ప్రపంచ ఖ్యాతి పొందింది. ఆమె యితర నవలలు "డ్రేగన్ సీడ్", "పెవిలియన్ ఆఫ్ విమెన్", "హిడెన్ ఫ్లవర్", "గాడ్స్ మెన్", "కిన్ ఫోక్" మొదలయినవి కూడా మణిపూసల్లాంటివే.

ఆమె నవలలన్నీ ఎక్కువగా చైనాను గురించీ, చైనీయుల జీవన విధానాల గురించి, జీవిత దృక్పథాల గురించీ వ్రాసినవే. దానికి కారణం పెరల్ బక్ పుట్టిందీ, పెరిగిందీ, పెళ్ళాడిందీ, తన జీవితంలో సగానికి పైన గడిపిందీ, చైనాలో కావడం. నర నరంలో జీర్ణించిపోయిన చైనా వాతావరణాన్ని ఆమె తన రచనల్లో చక్కగా ప్రతిబింబింప చేసింది. పెరల్ బక్ తల్లిదండ్రులు క్రైస్తవ మత ప్రచారకులు. మత ప్రచారకులుగా అమెరికా నుండి వచ్చి, చైనాలోనే స్థిరపడి పోయారు.

చిన్నప్పట్నుండీ పెరల్ బక్‌కు చైనా అంటే ప్రాణం. కాని చైనీయులకు తెల్ల వాళ్ళంటే లోలోపల కిట్టేది కాదు. ఒకప్పుడు బ్రిటిషువారి పాలనలో భారతదేశం బానిసత్వాన్ని భరించినట్లే, ఆ కాలంలో అమాయకులయిన చైనీయులు కూడ బ్రిటిష్ వారి అక్రమాలనూ, అన్యాయాలనూ గుర్తై అష్టకష్టాలూ అనుభవించారు.

## సీమ దెయ్యం

బ్రిటిషువారి తుపాకులకు భయపడి పిరికితనంతో పైకి నోరు విప్పకపోయినా, తెల్ల వాళ్ళంటే చైనీయుల మనస్సుల్లో మంట వుండేది. తెల్లపిల్ల పెరల్ బక్ వీధిలో పోతూంటే. "ది ఫారిన్ డెవిల్" (సీమ దెయ్యం) అని తిట్టేవారట చైనీయులు.

కల్లా కపటం లేని చైనీయులు, తెల్లవారిని ద్వేషించడానికి కనికరం లేని యింగ్లీషువారే కారణం అంటుంది పెరల్ బక్. చైనీయుల స్థానంలో తానుండినా, బ్రిటిష్‌వారి దౌర్జన్యాన్ని భరించేదాన్ని కాదంటుంది.

బిడ్డల హృదయాలను అర్థం చేసుకున్న తల్లిలాగా చైనీయులనూ, వారి సున్నితమైన హృదయాలనూ అర్థం చేసుకున్న పెరల్ బక్ యీ నాటికీ చైనా అంటే ప్రాణాలు పెడుతుంది.

చిన్నప్పట్నుండీ పెరల్ బక్‌కు సాహిత్య పిపాస మెండు. తల్లిదండ్రులు అమెరికా నుండి తెచ్చుకున్న ఆంగ్ల సాహిత్యాన్నంతా తన ఏడవయేట ఆరంభించి పదవయేడు వచ్చేసరికి చదివి పూర్తిచేసింది.

ముఖ్యంగా 'డికెన్స్' సాహిత్యం ఒకటికి పదిసార్లు చదివింది. అందులో "ఆలివర్ ట్విస్ట్" తన కభిమాన పాత్రమైన నవల.

పదవయేడు వచ్చేలోగానే పెద్ద పెద్ద నవలలు చదివి పూర్తిచేసిన పెరల్ బక్ వయసుకంటే చదివి సంపాదించిన విజ్ఞానం వయసు ఎక్కువ అయింది.

పెరల్ బక్ ఇలా నవలలు చదవడం తల్లికి యిష్టం వుండేది కాదు. కూతురుకు కనిపించకుండా నవల లెక్కడైనా దాచేది. ఎలాగో దాచినచోటు పసికట్టి వెతికి తెచ్చి మళ్ళీ చదవడం మొదలెట్టేదట పెరల్ బక్. విసుగెత్తిన తల్లి, నవ్వుతూ వూరుకునేది.

పెరల్ బక్ తండ్రికి అసలు నవలలన్నా, నవలారచయితలన్నా నచ్చేది కాదట. నవలా రచన ఒక రచన కాదనీ, అసలు 'సమకాలిక నవలలు' సాహిత్యానికి అపకారం చేస్తున్నాయనీ ఆయన అభిప్రాయపడేవాడట... ఒకరోజు తన కూతురు గొప్ప నవలారచయిత్రి కాబోతుందని ఎరగని పెరల్ బక్ తండ్రి నవలలు చదవడం అంటే ఏవగించుకునే వాడట.

## పంజరంలో చిలక

పెరల్ బక్ చిన్నతనంలోనే గొప్పగొప్ప నవలలు చదివి, సంపాదించిన విజ్ఞానంతో పాటు తండ్రి తనకోసం నియమించిన ట్యూషన్ మాస్టరు కంగ్ దగ్గిర ఎన్నో విషయాలు తెలుసుకుంది. చైనాలో పెరల్ బక్ చదువు పూర్తి కాగానే, తల్లిదండ్రులు ఆమెను కాలేజీ చదువులకోసం, తన మాతృదేశం అమెరికాకు పంపించడానికి నిశ్చయించారు.

చైనాను విడిచి వెళ్ళడానికి పెరల్ బక్ ఎంతో బాధపడ్డది. అమెరికా వెళ్ళి కాలేజీలో చదివిన నాలుగు సంవత్సరాలూ నాలుగు యుగాలుగా గడిపింది. ప్రకృతి సౌందర్యంతోనూ అమాయక ప్రజలతోనూ నిండిన చైనాలో పుట్టిపెరిగిన పెరల్ బక్, కృత్రిమ సౌందర్యంతో కూడిన అమెరికాలోని అగ్గిపెట్లలాంటి యినపకట్టడాల్లో వుండడానికి పంజరంలోని చిలకలాగా బాధపడిపోయింది.

అమెరికాలోనే వుద్యోగం చేస్తున్న అన్నగారిని అప్పుడప్పుడు వెళ్ళి చూచి వస్తుండేది శెలవుల్లో. అన్నగారి భార్యకూ, అన్నగారికీ సరిపడక వాళ్ళ యిల్లు ఒక నరకంలా వుండేది. కాసేపు ఆయింట్లో వుండలేక పోయేదట పెరల్ బక్. కాని అన్నగారి పిల్లల్తో ఆడుకోడంలో అంతా మర్చిపోయేది.

కాలేజీలో చదివిన నాలుగు సంవత్సరాల్లోనూ, ప్రతి సంవత్సరం కాలేజీలో జరిగిన రచనల పోటీలలో ప్రథమ బహుమతులు తెచ్చుకుంది పెరల్ బక్.

* * *

పట్టభద్రురాలయిన పెరల్ బక్‌కు ఒకరోజు తండ్రిదగ్గిర్నుండి తంతి వచ్చింది. తల్లికి చాలా జబ్బుగా వుంది కాబట్టి వెంటనే

బయలుదేరి రమ్మని. నెత్తిమీద పిడుగుపడ్డట్లయింది...

ఆరోజే సామానంతా సర్దేసి ప్రయాణానికి సిద్ధమైన పెరల్ బక్ మరోకపిడుగులాంటి వార్త విన్నది. యూరప్‌లో యుద్ధం ఆరంభమైంది కాబట్టి దేశాంతర ప్రయాణాలను ప్రస్తుతానికి ఆపేశారని. జబ్బుతో వున్న తన తల్లికి సేవచేయడానికి లేకుండా విధి, యుద్ధరూపంలో అడ్డుపడ్డందుకు విచారించింది.

పూరికేవుండి ఏం చేయాలో తోచని పెరల్ బక్ యుద్ధం ముగిసి, తను తల్లిని చూడానికి చైనా వెళ్ళేదాకా ఏదో ఒక వుద్యోగం చేయడానికి నిశ్చయించుకుంది. తాత్కాలికంగా తను చదివిన కాలేజీలోనే చిన్న వుద్యోగం సంపాదించింది. కాని మనసంతా చైనాలోవున్న తల్లిమీదనే వుంది.

ఎంతో ప్రయత్నించినమీదట, తన తల్లిదండ్రులకు తెలిసినవారి సహాయంతో కొన్ని

* * *

నెలలతర్వాత పెరల్ బక్ చైనా చేరగలిగింది. జబ్బులో బక్కచిక్కిపోయి మంచానికి అంటుకుపోయిన తల్లిని చూసి పెరల్ బక్ బావురుమన్నది. ఎదిగిన తన కూతురును చూసి అంత జబ్బులోనూ మురిసిపోయిందా తల్లి హృదయం—

అహోరాత్రాలూ తల్లికి సేవ చేసింది పెరల్ బక్. డాకర్ సలహా మీద కొద్ది రోజులు దగ్గర్లో వున్న కొండల మీద నివసించడానికి తల్లితోబాటు తనూ వెళ్ళింది.

## 'మేనాలో దొరసాని'

తల్లి ఆరోగ్యం కాస్త కోలుకున్న తర్వాత పెరల్ బక్‌కు పెండ్లి చేయాలని నిశ్చయించారు ఆమె తలిదండ్రులు. తల్లితో కొండల్లో నివసించేటప్పుడే, వ్యవసాయ పరీక్షుప్యాసయిన ఒక అమెరికన్ యువకుణ్ణి ప్రేమించింది పెరల్ బక్. ఆ విషయం తల్లిదండ్రులకుకూడా చెప్పింది. తల్లిదండ్రులకు పూర్ణసమ్మతం లేకపోయినా కూతురు మనసు బాధపెట్టడం యిష్టంలేక ఆ అమెరికన్ యువకునికి పెరల్ బక్ నిచ్చి పెండ్లి చేశారు.

భర్త వ్యవసాయ పరీక్షు ప్యాసయినందువల్ల తనూ భర్తతోబాటు అన్ని వూళ్ళూ తిరగాల్సి వచ్చింది. మొట్టమొదట ఉత్తర చైనా వెళ్ళింది భర్తవెంట పెరల్ బక్.

ఉత్తర చైనా, మధ్య చైనా అంత అందంగా లేకపోయినా, మొత్తానికి చైనా అయినందుకు తృప్తి పడింది. చైనాలో ఏ భాగంలో వుంటానికైనా పెరల్ బక్‌కు యిష్టమే.

ఆ కాలంలో ఒక్కొక్క వూరుకు భర్త వెంట మేనాలో వెళ్ళేదట పెరల్ బక్. మేనాలో వెళ్ళే తెల్ల దొరసానిని చూట్టానికి పల్లె ప్రజలు విరగబడేవారట. మేనాకు కట్టిన పర్దాను తొలగించి, లోపలవున్న పెరల్ బక్‌ను తొంగిచూసి పకపక నవ్వేవారట—

ఈనాడు సినిమా తారలు పడే అవస్థ ఆనాడు పెరల్ బక్ పడ్డది. నలుగురు వున్నచోట సరిసమానంగా భర్తతో మాట్లాడే పెరల్ బక్‌ను, చైనా స్త్రీలంతా విడ్డూరంగా చూసేవారు.

ఉత్తరాది చైనాలో ఒక పల్లెటూళ్ళో వుంటున్నప్పుడు ఆ వూళ్ళోవుండే ఒక పెద్దింటి చిన్నకోడలు స్నేహితురాలయింది పెరల్ బక్‌కు.

ఒక రోజు ఆ స్నేహితురాలు పెరల్ బక్‌ను అడిగింది. "నలుగురూ వుండేచోట కూడా భర్తను పలకరించి మాట్లాడతావే, నీకు సిగ్గుగా వుండదా" అని.

పెరల్ బక్ నవ్వి "మాకు అలామాట్లాటం అలవాటే, తప్పులేదు. అది మా దేశాచారం" అన్నదట.

"అయితే మా దేశంలో మాత్రమే ఎందుకిల్లాంటి కట్టుబాట్లు? అన్నదట పంజరంలోని చిలకలాంటి ఆ అమాయకురాలు.

"మీ పూర్వీకుల అలవాట్లు యింకా మూర్ఖంగా ఆచరణలోపెట్టే మీ అత్తమామల్లాంటి వాళ్ళు, మీ దేశంనిండా వున్నారు గాబట్టే! లేకపోతే ఎవరిభర్తను వారు పలకరించి మాట్లాడితే తప్పేముంది!" అన్నది పెరల్ బక్.

## 'ప్రాచీన చీనా'లో

"అమ్మయొయ్య! యింకేమైనా వుందా!, నా పెండ్లయ్యి మూడేండ్లయింది. యింతవరకూ మామగారు నాతో పల్లెత్తి మాట్లాడలేదు. ఇంట్లో ఎదురు పడ్డప్పుడు నమస్కరించడంతప్ప నేను యింతవరకూ నోరువిప్పి 'మామగారూ' అని ఆయన్ను పిలవలేదు. నేనే కాదు నాతోడి కోడలుకూడా అంతే. అదే మా యింటి కోడళ్ళ మర్యాద. ఇంక నా భర్తను పలకరించి మాట్లాడాలంటే రాత్రి పదిగంటల తర్వాత యీ పడకగదిలోనే మాట్లాడాలి. ఈ లోపుగా యింట్లో తిరుగుతున్నప్పుడు నా భర్త నాకెదురుపడినా మాట్లాడకూడదు. పరాయిదానికి మల్లే తల వంచుకుపోవాలి" అని స్నేహితురాలు చెబుతూంటే పెరల్ బక్ ఆశ్చర్యంగా విన్నది. కత్తులబోనులాంటి ఆ ఇంటి కట్టుబాట్లలో నలిగిపోయే తన స్నేహితురాలిని చూసి జాలి పడ్డది.

తనుండే వీధిలోనే పెరల్ బక్‌కు మరోక స్నేహితురాలు వుండేది. ఆ అమ్మాయికూడా చదువుకుని విజ్ఞానం సంపాదించుకోవాలని ఉవ్విళ్ళూరేదట—కాని అత్తగారు చాలా గయ్యాళిమనిషి అయినందువల్ల భయపడి వంటింట్లోనే పడివుండేదట. అప్పుడప్పుడు పెరల్ బక్ దగ్గర రహస్యంగా పుస్తకాలు తీసుకుని రాత్రుళ్ళు ఇంట్లో అత్తగారూ, భర్తా, అందరూ నిద్రపోయిన తర్వాత వంటింట్లో కూర్చుని గుడ్డిదీపం వెలుతురులో చదువుకునేదట—ఒకరోజు అత్తగారు చూసింది ఆ అమ్మాయి దొంగతనంగా చదువుకోడం—వెంటనే కోడలి చేతిలోని పుస్తకాలు లాక్కుని తగలబెట్టడమే కాకుండా కొడుక్కు లేనిపోని చాడీలుచెప్పి కోడల్ని కొట్టించింది—ఇంటి చాకిరీతో విసుగెత్తిన ఆ నిర్భాగ్యురాలు తీరిక సమయంలో చదువుకోడానికూడా నోచుకోలేదు. బ్రతుకుమీద రోతపుట్టింది...

* * *

...తెల్లవారేసరికి తన స్నేహితురాలు వురి వేసుకున్నదని పెరల్ బక్‌కు తెలిసి చూట్టానికి పరుగెత్తింది. ఇంకా తన స్నేహితురాలు ప్రాణాలతోనే వున్నది. "వెంటనే డాక్టర్ను పిలిపించండి యింకా ప్రాణం వున్నది" అంటూ ఆదుర్దా పడసాగింది పెరల్ బక్-కఠినురాలైన అత్తగారు మాట్లాడకుండా వూరుకుంది. ఈ లోపుగానే మత గురువులు దేశాచారాల ప్రకారం శవాన్ని తీసికెళ్ళేముందు చదివే మంత్రాలు చదవడం మొదలెట్టారు. చైనీయుల సిద్ధాంతం ఏమిటంటే చావబోయేవాళ్ళను బ్రతికించటం కర్మను అడ్డగించడం అన్నమాట. అది వారి దృష్టిలో మహాపాపం అట-చనిపోవడానికేగా వురి వేసుకున్నది ఆ అమ్మాయి! అందువల్ల ఆమె నిరాటంకంగా చనిపోవడమే న్యాయం. మళ్లీ బ్రతికించడానికి ప్రయత్నించడం కర్మకు అడ్డుతగలడమేగా!

## పాపం!

ఎవరైనా పొరపాటున నీళ్ళల్లోపడి మునిగిపోయి చావబోతున్నా, చుట్టూ గుమిగూడిన చైనీయులు చావబోయే వ్యక్తిని చూసి "అయ్యో పాపం. అతనికి కాలం తీరిపోయింది. అందుకే నీళ్ళల్లో పడ్డాడు" ...అని జాలిపడుతూ చూస్తూ నించుంటారే గాని ఏ ఒక్కరూ నీళ్ళల్లోదూకి చావబోయే వ్యక్తినిమాత్రం రక్షించడానికి ముందుకు పోరట. ఎవరో నూటికీ, కోటికీతప్ప—ఒకవేళ చావబోయే వ్యక్తిని రక్షించినట్లయితే, అవ్యక్తి పునర్జన్మ ఎత్తినట్లు వారి అభిప్రాయం. అలాంటి పునర్జీవితుడి యొక్క బరువు బాధ్యతలు రక్షించిన వారిమీద పడతాయి అనికూడా వారిభయం. అసలు అన్నిటికంటే ముఖ్యమైంది ఏమిటంటే చావబోయేవాడిని బ్రతికించడంమహాపాపం అని చైనీయుల సిద్ధాంతమట.

## శాపం

పైగా పశువుల్ని, గెదెల్ని మిగతా జంతువుల్ని చాలా నీచాతినీచంగా చూచేవారట. ఎందుకంటే జంతువులంతా, ముందుజన్మలో పాపాలుచేసిన మనుష్యులు కాబట్టి అవిధంగా జంతువులై పుట్టారు. అలాంటి జంతు రూపంలోవున్న పాపాత్ములమీద "అయ్యో పాపం" అని జాలిపడితే తమకూ ఆ పాపం చుట్టుకుంటుందని వాళ్ళనమ్మకం. అందుకే కొన్ని ప్రాంతాల్లో గొడ్లకు మేత కూడా సరిగ్గా వేయకుండా చాలా హింస

(49-వ పేజీ చూడండి)




## 37

పుల్లయ్యకు ఇంట్లో 'ఓడదించాల' అనీ వీధిలో దొంగతనంకువెళ్ళటం అలవాటై పోయింది. ఒకరాత్రి యింటిలో పడుకోడానికి మనస్కరించలేదు. రోజులు గడచిన కొద్దీ తమ్మూ యీ పనిలో ఆరితేరిపోతున్నాడు. ఇంట్లో మల్లు బాధలేదు. అవసరం అయినప్పుడు బిళ్లియివ్వగానే వాడికి నిద్దర పట్టోంది. రానురాను వాడికి రాత్రులు పడుకోవటం అలవాటౌతోంది. తెలివివున్నంత వరకూ తండ్రిని విడిచిపెట్టడంలేదు.

ఇప్పుడు తనపరిస్థితి చాలానయం. కడుపు నిండా తినకేకాదు. కుటుంబానికి తింటే. కొడుకునకు బట్టలు కుట్టించాడు. బడిలో వేశాడు—ఇలాగైనా కొస్తా దూరమౌతాడని. ఆ కొడుకు చదువుమీద యెంతో ఆశ పెట్టుకున్నాడు.

అంతేకాదు తను వారానికి మూడు సార్లైనా మిగతావారిలా సినీమాచూస్తాడు. చంద్రయ్య యిప్పుడు ప్రాణస్నేహితుడయ్యాడు. అన్నతో పొత్తు కొంత దూరమై పోయింది. బ్రాకెట్ల ఆట నేర్చాడు. ఒకో రోజు ఐదు, ఆరు రూపాయలవరకూ కట్తాడు. డబ్బు పోతున్న కొద్దీ పంతం హెచ్చవుతోంది — దురాశ పీక్కు తింటోంది — వేలోస్తాయ్ — వస్తే మళ్లా తన వూరికెళ్ళి ... గొప్పబతుకు బతుకుతానని ఆశ తనను పీడిస్తోంది. రానురాను పోయినడబ్బు వచ్చినా ఒక యకరం పొలం దొరకదా? అన్న పట్టుదల హెచ్చవుతోంది. ఇప్పుడు దొంగతనం తప్పు, పాపం అన్నమాటే తల్చుకోడు. ఈమధ్య ఒకసారి దొరికిపోవలసింది కాని అదృష్టంకొద్దీ తప్పుకున్నారు. ఒకవారంరోజులు జాగ్రత్తగా వున్నారు.

ఇంతకీ యీ ఆరునెలలోనూ చేసినవన్నీ చిన్నదొంగతనాలే. ఏవీ తన దాహాన్ని తీర్చునిగా లేవు. ఇంటికి యేరోజు మూడు, యేరోజు రెండు రూపాయలు యిస్తున్నాడు — బాగా బ్రాకెట్లు ఆడిన్నాడు యేమీ లేదు. నీలితో అబద్దాలుఆడటం అలవాటైపోయింది. అలా ఆడటంలో తప్పు గురించి అసలే ఆలోచించలేదు. ఇంత డబ్బులోనూ నీలికి బట్టలే కొనలేదు. ఆమె అసహ్యంగా వుందని ఒకనాడు ఒక చీర తెచ్చాడు.

"ఎక్కడిదీ — రాతిరి కూలి యియ్యలేదన్నావు" అని ప్రశ్నించింది.

"ఓడకెళ్తాను, దొర — మా మంచోడు. గరిడీ సెయ్యమంటే సేసినాను — మెచ్చి ఐదురూపాయలిచ్చి నీపెళ్ళానికో క కొనిచ్చి అని యిచ్చినాడు" అన్నాడు.

నీలి చీర కట్టుకుందేగానీ – అదోలా అనిపిస్తోంది. ఒళ్ళంతా ఒణుకుతున్నట్లనిపించింది. అసలు ఆమె శరీరంలో యెంబాగు తగలటం లేదు. మొగుడు డబ్బు తెచ్చి యిస్తున్నా ఆమెలో యెంతప్రయత్నించినా సంతోషంగా లేదు. పుల్లయ్య ముఖంలో ఆమెకు యిదివరకున్న కళకాంతులు కనపడలేదు. ఇదివరకున్న అమాయక చూపులు అతన్లో లేవు. మనిషి పుష్టిగావున్నా మోటుగా కనిపిస్తున్నాడు. నడకలో మార్పు స్పష్టంగా ఆమెకు గోచరిస్తోంది.

ఆ కట్టుకున్న చీర విప్పేవరకు ఆమెకు మనస్సు శాంతించలేదు. రేపు పట్టే బాగుంటాదేమోనని అనుకుంది.

ఒకనాడు, మొదట తను వూర్లో దిగినప్పుడువుండిన సత్రంలోనికి దొంగతనానికి వెళ్ళారు. ఆ వేళ జరిగినదంతా జ్ఞప్తికివచ్చినది. ఆ వేళ పుల్లయ్యకీ యీ వేళ పుల్లయ్యకూ యెంత తేడా అనుకున్నాడు. "ఆపుల్లయ్య సచ్చిపోనాడు. సచ్చిపోనేడి గురించి యెందుకు తలుస్తావని" యీ పుల్లయ్య తమాయించుకున్నాడు.

ఒకరోజు అన్న పుల్లయ్యని బలవంతాన యింటికి తీసుకవెళ్ళాడు. అన్న యేమైనా అంటాడని పుల్లయ్యకు ఒక ప్రక్క బెదురుగావుంది. ఈ రోజుల్లో చంద్రయ్య పుల్లయ్యకలిసి, అన్నమాట సరిగ్గా వినటంలేదు. అన్న మంచీ చెడ్డా మాటాడి వెంటవచ్చాడు. ఆ పాతకాలవ గట్టున కూర్చున్నారు. సాయంత్రమైనా భూమి చల్లబడలేదు, ఆకాశం వేపుచూస్తూ అన్న అన్నాడు "పని మాట యేమంటావని"

"మనకెక్కడ దొరుకుతాది" అన్నాడు పుల్లయ్య "ఎందుకు దొరకదు? ఇకముందు యేం దొరికినా మిగిలింది నాసేతికిచ్చి! ఒక మూలపెట్టి యెపుడికైనా మాతికిస్తే దొరకదా?"

"ఎక్కడమిగులుతాది? పని దొరికితే మనకు మంచిపని ఇస్తార?"

"ఎందు కివ్వరు?"

"ఎంటో లే-ఈపని బాగులేదా? ఎప్పుడో గవ్వలు పేలినట్లు పేలీదా? దాంతో ఈ వూర్లో వుంటానా? మళ్ళీ మా వూరెలి ఆరాజిగాడితో పోటీపడనా? మళ్లా వూరికి మొనగాడై యేలనా?"

అన్న వుద్రేకంతో అంటున్న పుల్లయ్య వేపు చూసి శాంతంగా "ఓరన్నా! గోడకు రాసిన సున్నం రాదు. జూదం ఆడిన డబ్బు రాదు—ఏ రోజున పేలిపోతాదని చూస్తున్నావ్? అది పేలదూ—నివ్వు బతకలేవు-బతికవు!"

"రోజులు యెప్పుడూ ఒకలాగ వుంటాయా?"

"చెంద్రయ్య వృత్తే దొంగపని. నివ్వు నానూ కడుపుకోసం దొంగలయ్యాం. పని దొరికినవాడూ దొంగతనానికి యెల్తే మనం పచ్చిదొంగలం అన్నమాట! అలాంటప్పుడు ఏ గవర్నమెంటోడినీ అనలేం-పచ్చిదొంగలకి. రోజులు నడుస్తున్నకొద్దీ చెడ్డవేగానీ మంచివి కావు. నామాట విని ఆ ఆటమానేసి ఆ నాలుగు రాళ్లూ ఒకమూల యేసేవంటే ఏదోపని—కష్టపడి కడుపుకో యేసుకున్న దానికీ—కష్టపడకుండా నింపుకున్నదానికీ తేడా లేదా?"

"ఇప్పుడు నాకేవేమీ సెప్పక. నాడబ్బు పాలాపోనాది. అది రావాల. నానీ వూరు కదలాల-నివ్వు ఎంతసెప్ప నాతలకెక్కద"ని పుల్లయ్య కటువుగా అన్నాడు.

అన్న లేచిపోతూ "నానుఅనాదుఅన్నట్టే అయినాది. ఆ బురదలో దిగిపోనావు. పంది అయిపోనావు."

పుల్లయ్య మాటాడకండా వెళిపోయాడు.

## 38

వేసవికాలం ఒకనాటిపుదయం పుల్లయ్య, చంద్రయ్య కలిసి వెళ్ళిపోతుండగా, బూచోడు తన మామ్మాలుస్థలంలో కుక్కను ప్రక్కని పెట్టుకొని ఏదో గొణుక్కుంటున్నాడు. పుల్లయ్య చటుక్కున, "వాడిని చూసావా? ఆడికథ నీకు తెలుసునా?" అన్నాడు.

"ఆడు దేముడితో సమానం-" అన్నాడు చంద్రయ్య. "నీవు యేదిచ్చినా పుచ్చుకోడు. పుచ్చుకున్నాడంటే మనకు పెద్దలాభం వచ్చిందన్నమాటే!"

పుల్లయ్య అలా నడుస్తూనే, "బంగారం కొబ్బరిచెట్టుకింద పాతిపెట్టానన్నాడు. గుట్టంతా లాగాను! అయినా, ఆడిఇల్లు ఎక్కడో యేంటో!"

"ఆడిఇల్లు అదిగో ఆ మూడంతస్తుల మేడ. బూచోడు మాగొప్పోడు. పెద్దసదువు సదివి వాడట- సెప్పినాడా కొబ్బరిసెటు కిందని!"

"అవును. ఏది ఆ ఇంటెనక కొబ్బరిసెట్టు నేదే!"

"రెండేళ్లకితం నూసినాను. అదిగో పెరట గదులు లేసిపోనాయి. ఏమాత్రం బంగారం?"

"అది దొరికితే మరి మనం యీ యాపారం యిడిచిపెట్టేవచ్చు!"

చంద్రయ్య సంతోషంగా నవ్వాడు. "అంతా నాకు వదిలీ! నాను ఆ గుట్టంతా లాగుతాను. ఎలాగైనా ఆ బంగారం అంకించుకోవాల. దానితో మనదరిద్రం పోతాది."

మూడురోజులు పోయాక అన్న, చంద్రయ్య పుల్లయ్య కలుసుకున్నారు. ముగురూ కాలవగట్టుమీద కూర్చొని వూసులాడుకున్నారు. చంద్రయ్య అన్నాడు. "ఆ యింటి గుట్టంతా నాగినాను. ఆ యజమానున్నాడే బలేగటోడు. ఆ మూడో అంతస్తుమీద ఒక గదివుందా? అందులో నే వుందట యినపపెట్టె. తాళాలు తలకిందే వుంటాయట. ఇంట్లో యెవురికీ నమ్మడట! రాత్రుళ్ళు యెవురినీ దగిరికి సేరనివ్వడట!"

"ఇంతకీ బంగారం మాట."

"ఇను మరి......... యిల్లు కట్టడానికి కొబ్బరిచెట్టు కొట్టించేసి పునాదులు తవ్వుతుంటే బంగారం, పెట్టితోని దొరికిందట. ఆ యేళనుంచి మరీ నమ్మడు-మనుసుల్ని! బంగారం యెక్కడ దాస్తాడు మరి యినపపెట్టెలోనే-"

"మరి మనకి యింతకంటే అదును దొరకదు. అడి డబ్బు కాదు కదా? బూచోడుది-మనం ఆ బంగారం అంకించుకున్నా పాపం నేదు" అన్నాడు పుల్లయ్య.

"వినుమరి. మనం తొందరపడితే నాభం నేదు. సమయం నూడాల. ఇంత పెద్దపని మనం సెయ్యనేదు-సెయ్యబోము—అంచేత అన్నీ జాగర్తగానూశీ పని సెరవేర్సుకోవాల. ఏ మాత్రం పొరపాటుజరిగినా అంతా సరి! అంచేతనే ఆ యింటి నౌకరీవోడిని మంచిచేసుకున్నాను!"

"సచ్చిపోనాం" అన్నాడు అన్న.

"ఏం?" పుల్లయ్యందుకున్నాడు.

"రేపుపొద్దున్న దొంగతనం అయ్యాక ఆడే అటువేపు తిరిగిపోయి పోలీసోలకి నిన్ను అప్పచెప్పీడా?"

చంద్రయ్య పకాలుమని నవ్వాడు "నీకు కడుపుకి జరక్క దొంగవయ్యావు. నానో గొప్పోడవ్వాలని దొంగనయ్యాను. నాను యెందరి పోలీసోళ్ళకళ్లలోనో కారంజల్లాను. చంద్రయ్యలాగ వెళ్లానా? వేసాను-సాధూవేషం వేసాను. ఆడు సంగతులు సెప్పేసరికి కాలుమీదపడి మొక్కినాడు. ఆడు తోతలు తిరిగి రావాల పోల్చుకోడానికి! మీకా బెంగేమి వద్దురా! అంతా పసందుగా జరిగిపోడం నా పూచీ! ఆ యజమాని అసలు ఆకలిసి వచ్చినదానినే నమ్మడట! నానా

(47-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

[2-7-58 మొదలు 8-7-58 వరకు]

బి. నరసింగరావు

గ్రహ స్థితి

| | | | |
|---|---|---|---|
| శు | శ | కు | ర |
| | 6 తేదీని పునర్వసు కార్తి మొదలు. ధనుర్మకర, కుంభ, మీనములలో చంద్రుడు. | | బు |
| | | | |
| | కే | రా | గు |

## * అశ్విని [చూ, చే, చో, లా] *

ఈ వారము యత్న కార్యములకు ఆటంకాలు కలుగుతవి. దగ్గిర బంధువులకు అనారోగ్యము కలుగుటచే ఆందోళన పొందుతారు. ఉద్యోగులకు బదిలీఅయే సూచనలున్నవి. మీకు దైవభక్తి ఎక్కువగుటచేతను చేయవలసిన ప్రయత్నము చేసి దైవముపై భారమునుంచుటచేతను ఫలసిద్ధిని తుదకు పొందుతారు. వర్తకులకు నష్ట ద్రవ్యలాభము. 2, 3, 4 కార్యాలోచన 5 న జ్ఞానుల సాంగత్యము, దైవచింత. 6, 7 ఆటంకములు, ఆరోగ్యచింత. 8 న కార్యసిద్ధి. నష్టద్రవ్య లాభము.

## * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము బంధువుల రాకపోకలవల్ల ఖర్చులు ఎక్కువ. రావలసిన డబ్బు చేతికందకపోవుటచేతను అశాంతి. కోర్టు వ్యవహారములు కొంతవరకూ అనుకూలిస్తవి. పరులకు సహాయము చేసిందికి పాటుపడ్డా, మాట దక్కక నిందలను పొందుతారు. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలవల్ల కార్యభారము ఎక్కువ. వర్తకులకు వ్యవహారముపట్ల పేచీలు ఇంట్లో వున్న స్త్రీలకు అనారోగ్యము. ఈ వారమంతా కార్యభారము త్రిప్పట, ధనాభావము మొదలగు అవయోగములున్నా, స్వల్పముగా కార్యలాభము, ధనయోగము కూడా వుంటవి. విద్యార్థులకు ఆశాభంగము.

## * కృత్తిక [అ, ఈ, ఊ, ఏ] *

ఈ వారము అనుకున్నట్టుగా పనులు జరగవు. ధనాభావముచే ఇబ్బంది కలుగుతుంది. బంధువులకు సహాయము చేయబోయి జరగక మాటపడి మనోవ్యథ పొందుతారు. వాహనములవల్లగాని, ఎత్తయిన స్థలములనుండి పడుట వల్లగాని, వాడి పనిముట్లవల్లగాని అవయవములకు గాయములు కలుగవచ్చును. యంత్రములు నడుపు నిపుణులకు, రసాయన శాస్త్రజ్ఞులకు, గనుల యజమానులకు కష్టముతో కూడిన లాభము. ఆటంకములు, నిందలు, మొదలగు అవయోగము లున్ననూ, 8 న కార్యలాభము, ప్రయాణము కలుగును. 6, 7 తేదీలలో ప్రమాద సూచన.

## * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

గత రెండు వారములనుండి కలుగుతూ వున్న ఆటంకములను గడిచి, అధికారుల సహాయము చేతను, మీ యుక్తిచేతను కార్యసిదిని పొందుతారు. ఆర్థిక స్థితి బాగుపడుతుంది. 2, 3, 4 తేదీలలో తొందరలు తగ్గి కార్యక్రమము ఒకదారిని నడుస్తుంది. 5 ప్రయాణము, 6. 7 తొట్రుపాటు. 8 అధికారుల ఆదరణ, ధనలాభము, బంధు దర్శనము, కార్యసిద్ధి, కవులకు, చిత్రకారులకు, నటీనటులకు యోగకాలము. విద్యార్థులు ఉత్సాహముతో నూతన తరగతులలో చేరుతారు.

## * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈ వారము మీకు యోగకాలము. ఉన్న యిబ్బందులు తీరుతవి. అనుకున్న సొమ్ము చేతికి వస్తుంది. కోర్టు వ్యవహారములు అనుకూలముగా తీర్పు అవుతాయి. పిల్లల అభివృద్ధికి కొన్ని ఏర్పాట్లు చేస్తారు. నూతన కార్యములు ప్రారంభిస్తారు. ప్రభుత్వ సన్మానము కలుగుతుంది. పండితులతో జ్యోతిష గోష్ఠి జరిపి నూతనాంశాలు తెలుసుకుంటారు. 2, 3, 4 తేదీలలో ధనయోగము, యత్న కార్యసిద్ధి. 5 నూతన కార్యారంభము. 8 పండితగోష్ఠి.

## * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారము మీకు యోగదాయకమైననూ, మానసికాందోళన వుంటుంది. ధనయోగము కలుగుతుంది. కవితాగోష్ఠి, గానసభలవంటి వినోదాలలో బంధుమిత్రులతో కలసి పాల్గొంటారు. ఇదివరకు అనారోగ్యముతో వున్న దూరస్థులైన ఆప్తుల క్షేమము తెలిసి సంతోషము పొందుతారు. కవులకు, గాయకులకు, నటీనటులకు వారమంతా యోగకాలము. విద్యార్థులు కొత్త క్లాసులలో చేరుతారు. ప్రత్తి, నూలు, బట్టలు, వెండినగలు, బియ్యము వ్యాపారస్తులకు లాభయోగము. 2, 3, 4, 5 తేదీలలో నీటిపై ప్రయాణము, ధనయోగము, కార్యసిద్ధి, శుభకార్యాలోచనలు, విందు, వినోదము. 8 న శుభవార్త.

## * పునర్వసు [కే, కో, హా, హీ] *

గతవారము అసంపూర్తిగా వుండిపోయిన కార్యములు ఈ వారము లాభకరముగా ముగుస్తవి. ధనయోగము వృద్ధి అవుతుంది. శుభకార్యాలోచన చేసారు. సంఘ సంక్షేమ కార్యాలలో పాలొని కీర్తిగొంటారు. నూతన కార్యనిర్మాణమునకు మొదలు పెడతారు. విద్యార్థులు నూతన తరగతులలో ఉత్సాహముగా చేరుతారు. ఉద్యోగస్తులకు అధికార హోదాలు పెరుగుతవి. విలువగల వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు అనుకున్న దానికన్న ఎక్కువలాభము వస్తుంది. 2 3 4 5 తేదీల్లో సంఘసేవ, కీర్తి, ధనలాభము, కార్యానుకూలము, విందు వినోదము. 6 7 అధిక ఖర్చులు, 8 అలంకార ప్రాప్తి.

## * పుష్యమి [హూ, హే, హో, డా] *

ఈ వారము చేదామనుకున్న పనులకు ఆటంకములు కలుగుతాయి. కార్య భారము వల్ల తీరుబడి వుండదు. ఆర్థికస్థితి బాగుండనందున గృహావసరములకు ఇబ్బంది కలుగుతుంది. అకాల భోజనమువల్ల తలపోటు, కళ్ళమంటవంటి అనారోగ్య చిహ్నాలు కనబడగానే ఔషధసేవ చేయుట మేలు. ఉద్యోగస్తులకు ఒత్తిడి వున్నా అధికారుల ఆదరణ పొందుతారు. వర్తకులకు శ్రమ యెక్కువ. రాజకీయ వాదులకు మేలుగా వుంటుంది. వారమంతా ఇబ్బంది, కలతలు, అనారోగ్యము ఉన్ననూ, ధనయోగము, కార్యలాభము కూడా వుంటాయి.

## * ఆశ్రేష [డి, డూ, డే, డో] *

ఈ వారము మీకు మిశ్రమ యోగము. మొదట్లో నిరాశగా వుంటుంది. కాని క్రమేణా మిత్రుల సహాయమువల్ల కార్యలాభము పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన. ఉద్యోగస్తులకు మంచిరోజులుకావు. వర్తకులకు మాంద్యం. విద్యార్థులకు ఆశించిన స్థానములు లభించవు. రహస్యభేదనలో నిపుణులగుటవల్ల ప్రభుత్వ

ముచే ఆపనిలో నియమితులౌతారు. ధనలోపము కలతలు, మనోవ్యధ, నిరాశవంటి అవయోగము లున్నా ప్రయాణము మిత్రసహాయము, కార్యసిద్ధి, విదేశీయుల పరిచయము, అపురూప వస్తుసంపాదనవంటి మంచియోగములుకూడా వుంటాయి. 6, 7 తేదీలలో ఆప్తుల ఆరోగ్యచింత.

### * మఖ [మా, మీ, మూ, మే] *

ఈవారము తలపెట్టిన పనులకు ఆటంకములు కలుగుతవి. ధనాభావమునకు తోడు బంధువుల రాకపోకలవల్ల అధిక ఖర్చులచే మనోవ్యధ మత సంబంధమైన ఉపన్యాసములు వినుట వ్యాసములు చదువుటవలను, సాధు సజ్జన సాంగత్యమువల్లన ఆధ్యాత్మిక చింతచే మనోవికాసము కలుగుతుంది. ఉద్యోగస్థులు కొంత శ్రమపడిన మీదట మేలు పొందుతారు. వర్తకులకూ రావని ఆశ వదులుకున్న బాకీలు వసూలౌతాయి. వారమంతా గృహ కలతలు అధిక ఖర్చులు, ఆటంకములు వున్నా ధనలాభము సాధు సాంగత్యము, ఆత్మవికాసము వంటి శుభయోగములు కూడా కలుగుతవి. 6,7 తేదీలలో ఆప్తుల ఆరోగ్యచింత.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### మో, టా, టీ, టూ

ఈవారము పరోపకారమునకు పూనుకొని చేయలేక మాటపడి, విచారము పొందుతారు. కార్యభారము ఎక్కువ. ధనలోపముచేత తాపత్రయ పడతారు. దావాలలో గెలుపు కలుగుతుంది. ఇచ్చి పుచ్చుకొనే వ్యవహారాలలో వివాదపడతారు. విద్యార్థులకు ఆశాభంగము, భార్య ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. అపరదినుసులు, నువ్వులు నూనె వర్తకులకు లాభము. ఆటంకములు, కలహములు, కార్యభారమువంటి అవయోగములున్నా, ధనలాభము, కార్యానుకూలమువంటి యోగములుకూడా కలుగుతవి, 6. 7 ఆరోగ్యచింత.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### [టే, టో, పా, పీ]

ఈ వారము రాబడికి మించిన ఖర్చులు కలుగుటచే అప్పుచేయవలసి వస్తుంది. మొదలు పెట్టిన కార్యములకు ఆటంకములు కలిగినను పట్టువిడవక ధైర్యముతో ప్రయత్నించి ఫలమును తుదకు పొందుతారు. శరీరముపై కురుపులు లేస్తాయి. అగ్నివల్లగాని, యంత్రములవల్లగాని ప్రమాదము కలగవచ్చును. ఉద్యోగస్థులకు బదిలీచే మనోవ్యధ. తోబుట్టువు సహాయమువల్ల ఋణవిమోచనము కలుగుతుంది. యంత్రముల పనుల నిపుణులకు, గనుల యజమానులకు, ఖనిజముల వ్యాపారస్థులకు కష్టముతో కూడిన లాభము. ఇంజనీరింగుశాఖ వారికి మేలు కాలము. 6, 7 ప్రమాదసూచన 8 ధన యోగము, అప్పుతీరుట.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము మీకూ ధనలాభము, వ్యవహారములలో జయము, బంధుదర్శనము, విద్యాప్రాప్తి, నూతన కార్యప్రయత్నలాభము, మంచివార్తలు వచ్చుట, జ్ఞానమార్గ ప్రసంగములు, యుక్తిగా ప్రసంగించుట, గణిత జ్యోతిషశాస్త్ర చర్చలు, సుఖభోజనము వంటి శుభయోగములు కలుగును. విద్యార్థులకు వారు కోరుకున్న స్థానములు లభించి నూతన తరగతులలో చేరతారు. ప్రత్తి, దూది, నూలు, వస్త్రములు, ఇత్తడి, కంచు మొదలగు పరికరముల వర్తకులకు లాభయోగము. కవులకు, శిల్పులకు, చిత్రకారులకు, నటీనటులకు మేలుకాలము.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారము గృహమందు శుభకార్యములు జరుగుట, పుత్రప్రాప్తి సూచనలు, ధనలాభము, బిరుదులు పొందుట, ఆకస్మిక ప్రభుత్వ సన్మానము, ఘనకార్యాచరణ ప్రయత్నములు. దేవబ్రాహ్మణభక్తి, పుణ్యకార్యములు చేయుట, పుణ్యక్షేత్ర సంచారము, వైద్య, జ్యోతిషశాస్త్ర ప్రసంగములు వంటి యోగములు కలుగుతవి. విద్యార్థులకు ఫలసిద్ధి. న్యాయస్థానోద్యోగులకు మేలు కాలము. న్యాయవాదులకు, పండితులకు, ఉపాధ్యాయులకు వారమంతా యోగము.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారము మీకు తలచిన కార్యములలో జయము, నీటిమీద ప్రయాణము, తెల్లని వస్తువులు కొనుట, వినోదములలో పాల్గొనుట, దధి క్షీర మధుర పదార్థ యుక్త సుఖభోజనము వెండి పాత్రలలో చేయుటవంటియోగములు కలుగును. విద్యార్థులకు వారు కోరుకున్న స్థానములు లభించి కొత్త క్లాసులలో చేరతారు. ప్రత్తి, దూది, నూలు, తెల్లని వస్త్రములు, వెండి, బియ్యము, ద్రవపదార్థ వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, నటీనటులకు మేలు కాలము. శుభయోగము లున్నా వారమంతా భయాందోళనతో కూడి వుంటుంది.

### * విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈవారము ఇష్ట వస్తులాభము, వివాహాది శుభ కార్యాలోచన, కృషి మూలకముగా లాభము, ధన ధాన్యవృద్ధి, పశుసంపద, పరోపకారమువల్ల కీర్తి, ప్రభుత్వ కార్యనిర్వహణవల్ల గౌరవమువంటి రాజయోగములు కలుగుతవి. విద్యార్థులకు మనోరథము సిద్ధించి కొత్త తరగతులలో చేరతారు. ఖరీదైన వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము. 6, 7 తేదీలలో కుటుంబకలహము. 8 ధన యోగము.

### *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈ వారము మీకు రాబడి తక్కువ, కార్యభారము ఎక్కువ. గృహావసరములు తీరనందున స్పర్థలు. ఆరోగ్యము చెడుచున్నట్లు సూచనలు కనబడగానే గ్రహారాధనైన రవికి శాంతిచేయుట మేలు. ఉద్యోగస్థులకూ కొత్త సమస్యలు. వర్తకులకూ ఆందోళన. విద్యార్థులకూ మనోరథము సిద్ధించక చింత. 2, 3, 4, 5, తేదీలలో ఆటంకములు, కార్యభంగము, శ్రమ కలిగినను పితృవర్గమునుండి సహాయము, కార్యలాభము కూడా వుంటాయి. 6, 7 ఆరోగ్యభంగము, రాజకీయవాదులకూ ఎదురీత. 8 లాభయోగము.

---

### —ధరలు:—

నూలు, వస్త్రములు : మందముగా వుండును.

నూనె దినుసులు: నిలబాటుగా వుండును.

బెల్లము, పంచదార, చింతపండు: మార్పులేదు.

ఆహార ధాన్యములు : మందముగా వుండును.

పప్పుదినుసులు : నిలబాటుగా వుండును.

వెండి, బంగారము: స్వల్పతేడాలో వుండును.

అంతటా సాధారణ వర్షములు కలుగును.

* * *

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారి వారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును, వ్యాసుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

---

#  నక్షత్రఫలితాలు 

### *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈ వారము సకాలములో అనుకున్న సొమ్ము చేతికందదు. అనిశ్చిత స్థితివల్ల కార్యాచరణకూ పాలుపోదు. తలపెట్టిన పనులకూ మొదట్లో అవరోధాలు కలిగినా, వారాంతమునకు మిత్ర సహాయము వల్ల కార్యానుకూలత పొందుతారు. వర్తకులకు నిరాశగా వున్నా వారాంతమునకు లాభము. 2, 3, 4, 5, ప్రయాణము, విదేశీయులతో పరిచయము, విచిత్ర వసుసంపాదన కలుగుతవి. 6, 7 తేదీలలో ఆరోగ్య చింత. ఉద్యోగస్థులకూ బదిలీ అవుతుందేమోనని ఆందోళన. కార్యలాభం.

### * మూల [యే, యో, బా, బి] *

ఈ వారము మీకూ మిశ్రమయోగము. ధనలోపము వుంటుంది. కోరిన సహాయము లభించదు. అవసరములు తీరిక ఆందోళన కలుగుతుంది. దైవము పై భారము వేసి కార్యసాధనకు ప్రయత్నించి ఫలమును పొందుతారు. ఉద్యోగస్థులకు అధికారుల అనాదరణ. వర్తకులకు చాంచల్యము కొంతకాలమునుండి నిలిచిపోయిన బాకీలు వసూలవుతవి. పుణ్యక్షేత్ర దర్శనములో విచిత్ర వస్తువులను చూస్తారు. 2, 3, 4, 5, తేదీలలో అవయోగములున్నా పుణ్యపురుషుల సాంగత్యము, ఆత్మ విశ్వాసమువల్ల శాంతి, నష్ట ద్రవ్య లాభము కలుగుతవి. 6, 7 ఆరోగ్య చింత. 8 కార్యలాభము, ధనయోగము.

### *పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢ]*

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. ఇచ్చి పుచ్చుకొనేపట పేచీలు వచ్చి మనోవ్యధ కలుగుతుంది. కోరు వ్యవహారము అనుకూలించినను ఖర్చులు హెచ్చుగుటచే ఆసంతోషము వుండదు. భార్య ఆరోగ్యము చెడే సూచనలున్నవి. కొర్రలు, రాగులువంటి అపరదినుసులు మినుములు, నువ్వులు, నూనె, ఉప్పు మొదలగు వస్తువుల వర్తకులకు లాభము. అన్యజాతివారి వల్ల గౌరవము కలుగుతుంది 2, 3, 4, 5 క్రమముతో కూడిన కార్యానుకూలత. 6, 7, వివాదములు, అనారోగ్యము. 8 పైవారిచే గౌరవము.

### *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారము ఎంత ప్రయత్నించినా యత్నకార్యములలో అనేక ఆటంకాలు కలుగుతవి. సాహసము గలవారగుటచే నిరుత్సాహపడక పట్టుదలతో కలిగిన చిక్కులన్నీ తొలగించుకొని మేలుపొందుతారు. సోదరుని సహాయమువల్ల ఒడిదుడుకులు సద్దుకుంటాయి. జాగ్రత్తగా యుండుటవల్ల అవయవములకు దెబ్బలు తగిలే ప్రమాదము తప్పవచ్చును. 2, 3, 4, 5 కార్యభంగము, మనోవ్యాధివంటి బాధలు వున్నా సోదర సహాయము, కార్యానుకూలత కలుగుతవి. 6, 7 ప్రమాదసూచన. 8 ధనలాభము. పోలీసుశాఖ ఉద్యోగులకు వారమంతా యోగకాలము విద్యార్థులకు ఆశాభంగము.

### *శ్రవణము [జూ, జే, జో, ఘా]*

ఈ వారము మీకు యోగదాయకము. మీ యుక్తిచేత కార్యసాధనలో విజయము పొందుతారు. అధికారుల సహాయము కలుగుతుంది. కొత్తవారితో పరిచయము. ధనయోగము. ఈశాన్యదిక్కునుండి బంధువుల కుశలవార్త తెలుసుంది. విద్యార్థులకు కోరిన స్థానములు లభించి కొత్తకోర్సులలో చేరుతారు. జ్యోతిష శాస్త్రజ్ఞులకు, గణిత శాస్త్రజ్ఞులకు, కవులకు, చిత్రకారులకు, నటీనటులకు మేలుకాలము. 2, 3, 4, 5 ధనలాభము, కార్యసిద్ధి, మిత్రలాభము. 6, 7 ఆందోళన, 8 కుశలవార్త.

### * ధనిష్ఠ [గా, గీ, గూ గే] *

ఈ వారము మీకు యోగప్రదము. గత వారము కాకుండా నిలిచిన కార్యములు ఈ వారము సుముఖమవుతాయి. ఉద్యోగులకు అధికారముతో పాటు ధనాదాయము కూడా పెరుగుతుంది. బిరుదులు పొందుట, ప్రభుత్వ సన్మానమువంటి రాజయోగములు కలుగుతవి. సంతానమునకు కలిగిన అభివృద్ధిచే ఆనందము పొందుతారు. పండిత గోష్ఠి నూతన గ్రంథములు చదువుటచే విజ్ఞానాభివృద్ధి కలుగును. 2, 3 4, 5 ధ. లాభము, కార్యానుకూలత, పిలల క్షేమాభివృద్ధి 6, 7 నిలకడలేనిస్థితి అధికఖర్చులు, 8 వర్తకులకు లాభము. పండితులకు, ఉపాధ్యాయులకు, న్యాయవాదులకు మేలుకాలము.

### *శతభిషం [గో, సా, సీ, సూ]*

ఈ వారము అన్ని రంగములలోనూ మీరు చేసేయత్నాలు అనుకూలముగా సాగుతవి. రాబడి ఎక్కువవుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుపడుతుంది. సంగీతసభలు, కవితాగోష్ఠివంటి వినోదములలో బంధుమిత్రులతో కలసి పాల్గొంటారు. నీటిపై ప్రయాణము చేయవలసి వుంటుంది. విద్యార్థులకోరిక ప్రకారము నూతన తరగతులలో స్థానములు లభిస్తాయి. దధిక్షీర, మధురపదార్థయుక్త సుఖభోజనము చేస్తారు. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము వ్యాపారస్తులకు మేలుకాలము. 2, 3, 4, 5 తేదీలలో ధనలాభము, కార్యసిద్ధి, ప్రయాణము. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలము. 6, 7 ఎక్కువఖర్చులు, ఆందోళన. 8 దక్షిణదిక్కునుండి శుభవార్త.

### *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

ఈవారము దూరప్రయాణము చేయవలసి యుంటుంది. అనుకున్నదానికన్నా ఆదాయము ఎక్కువగా పెరుగుతుంది. యత్నకార్యములు ఫలిస్తవి. సంఘములో కీర్తి గౌరవములు ఎక్కువవుతవి. మిత్రులతోనూ, స్త్రీలతోనూ విందు వినోదము, విద్యార్థులకు యత్నస్థానములు లభిస్తాయి. వర్తకులకు విలువగల సరుకుల క్రయవిక్రయములలో లాభము. 2, 3, 4 5 ప్రయాణము, ధనలాభము, కార్యసిద్ధి, విందు, వినోదము. 6, 7 అధికఖర్చులు. 8 అలంకారప్రాప్తి. కవులకు, గాయకులకు. కళాకారులకు, నటీనటులకు యోగకాలము.

### * ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] *

ఈ వారము కార్యభారము ఎక్కువ. రాజవార్తా ప్రసంగములు, వింత మాటలు వినుట, పరాక్రమమువల్ల ఘనత, ధనలాభము ప్రయాణమువంటి యోగములు వుంటాయి. అకాలభోజనమువల్ల వేడిచేసి బలహీనత, కడుపునొప్పి, నేత్రపీడవంటి సూచనలు కనబడగానే ఔషధ సేవచేయుట మేలు. ఉద్యోగస్థులకు వనప్రదేశములకు బదిలీ అగుట గాని, ఒత్తిడి ఆగలేక శెలవు పెట్టటగాని జరుగును. విద్యార్థులు కోరిన స్థానములు దొరకవు. 2, 3, 4 5 ప్రయాణము, ఘనత ధనలాభము కార్యానుకూలము. 6, 7 అనారోగ్యము. 8 అనుకూలము.

### * రేవతి [దే, దో, చా, చీ] *

ఈవారము ప్రతికార్యమునకూ అనవసర ఆలస్యము కలుగుతుంది. అనిశ్చిత స్థితివల్ల చికాకు ఎక్కువ ఆశాభంగముకలుగుతుంది. వర్తకులకు లాభము తక్కువ. రహస్యములను కనుగొనుటలో చాతుర్యమును ప్రదర్శించి కృతకృత్యులవుతారు. ఉద్యోగస్థులకు వనపర్వతప్రాంతములకు బదిలీ అవుతుంది. విద్యార్థులకు మొదట్లో ఆశాభంగమైనను తుదకు వాంఛితస్థానాలుదొరుకుతాయి. 6,7 చంచల మనస్సు, ఆత్మీయుల అనారోగ్యముచే వ్యథ. 8 కార్యలాభము. ★





"వేళ గాని భోజనం. ఆకలిగా లేదుకూడా" అన్నాడు బలరాం పీటమీద కూర్చుంటూ.

"ఫర్వాలేదు లేద్దురూ. ఈ ఒక్కపూటకే గదూ. ఆ టైమంతవరకే తినండి. వచ్చేసరికి పన్నెండుదాటుతుంది. అప్పుడెలా తింటాం" అంది అమల పళ్ళెంలో అన్నం పెడుతూ.

"ఏమిటే అన్నం యిలా ఎర్రగావుంది?" అన్నాడు బలరాం అన్నం చేతిలోకి తీసుకొంటూ.

"మొన్న పరళ కేయ బియ్యం బదులు తీసుకెళ్ళి యివ్వాళ దంపుడుబియ్యం తెచ్చింది. వాళ్ళింట్లో దంపుడుబియ్యమే వాడతారట మొన్న సమయానికి లేవని మన బియ్యమే తీసికెళ్ళింది" అంది అమల కూర వడ్డిస్తూ.

"ఈ దంపుడు బియ్యం ఆరోగ్యమేగానీ అన్నం మేకుల్లావుంటుంది."

"సరేగాని మనకు టైం సరిపోతుందా? టిక్కెటుదొరకడం కష్టం. డైలీ సినిమాలకే రష్‌గా వుంటుంది. ఇలా ఏ టికో సారి సెపరేట్ ప్రోగ్రాం వుంటే థియేటరులో కాలు పెటటం బ్రహ్మప్రళయం వినా అంత చిన్న థియేటరులో నాట్యప్రదర్శనేమిటే?" అంది అమల తను అన్నం పెట్టుకుంటూ బలరాం వాచీ చూశాడు "ఏడుంబావు. భోంచేసి టాయ్‌లెటయి అరగంటలో వెళ్ళిపోవొచ్చు. టికట్సు తీసివుంచమని కృష్ణకి చెప్పాను. వినా నువు తొందరగా తెమలాలి"

"నా ఆలశ్యం ఏమీ వుండదు. ఐదు నిమిషాల్లో రెడీ, నాట్యాలంటే నాకెంతో యిష్టం. ఈ వూళ్లో ఎప్పుడో ఓసారి ఏవరద బాధితులకో, క్షామనివారణకో, ప్రోగ్రాం వుంటుందిగానీ, మా వూళ్ళో అయితే కనీసం వారానికి రెండుసార్లయినా నాట్యప్రదర్శనా లుంటాయి. సినిమాలకంటే ఎక్కువిష్టం నాకు."

"మరి నువ్వెందుకు నేర్చుకోలేదు?"

"అంతదృష్టం నాజాతకంలో లేదు. పోనీ చూసి ఆనందించటానికి అవకాశాలుంటే చాలు. ఇంతకీ మనం మాటల్లోబడి ఆలస్యం చేస్తున్నాం."

"మరేం ఫర్వాలేదు. కావలసినంత టైముందిగానీ, ఏ చీర కట్టుకుంటావ్? వైటేనా?"

"అవును. నైట్ డ్రెస్ వైటేగదా. సరిగా తెలుపు చీర, నలుపు చోళీ తీసిమంచంమీద పెట్టి వచ్చా. రోసా నేపాయెబు రోట్టెన్నర తిన్నాడని, వేళగాని వేళంటూ నేగిన్నెలు ఖాళీచేశాం" నవ్వింది అమల చెయ్యికడుక్కుని లేస్తూ.

"మరి మూడుగంటలసేపు కుర్చీలోకూర్చోటానికి ఓపికుండొద్దూ? అదిగాక నువ్వొండిన వంకాయ కూర."

"బలరామం" "ఏవోయ్ బలరామం" వీధిలోంచి కేకలు వినపడాయ్.

"ఎవరో మీ ఫ్రెండుగారు. కబుర్లకు కూర్చోక తొందరగా తెములండి. ఇంతలో నేను రెడీగావుంటాను" అంది అమల వెళ్తున్న బలరాం నుద్దేశించి.

* * *

అమల బట్టలు కట్టుకొని అద్దంముందు నుంచుని పౌడ్ రాసుకొంటూంటే బలరాం హడావిడిగా లోపలికొచ్చాడు. "ఆయన ఎవరో తెలుసా? నా ఫ్రెండు కాదు. నీచుట్టం మీ రెండో వదిన పెదతండ్రి రామనాథంగారు. ఏదో పనిమీదవచ్చారట. పొద్దుపోయిందని, ఈ రాత్రికుండి వెళ్ళిపోవచ్చుని యిక్కడికి వచ్చారట. ఎలా మనం వెళ్ళేది? ఆయనకి భోజనం పెట్టొద్దూ?" అమల గతుక్కుమంది మొహం ముడుచుకుపోయింది.

"వేళాపాళా లేదు చుట్టాలు రావటానికి." విసుక్కుంది.

"అందుకే అతిథి అన్నారు."

'బావుంది మీ వరస. గృహస్థులు మీ రుండిపోయి ఆ అతిథిని రిసీవ్ చేసుకోండి." గుసగుసలాడింది అమల.

"నాకేం? ఆయన నీచుట్టమే. దానికేం గానీ, యింకో అరగంట టైముంది. ఒక్క అరసోలెడు బియ్యం పావుగంటలో వండలేవూ? కూరలున్నాయిగా. మహా అయితే టెన్ మినిట్స్ లేటవుతుంది. మానుకోనక్కరేదు. ఏమంటావ్?"

అమల మొహం కొంచెం విప్పారింది. "లేటైతే ఏం బావుంటుందండీ? మొదట్లో చక్కటి ప్రార్థనాగీతం ఎంత బావుంటుంది! వినే అదృష్టం లేదు" విచారించింది అమల.

"ముందు ఆయన్నోసారి పలకరించుదువుగాని రా. ఇలా విచారిస్తూ కూర్చుంటే—"

అమల గబగబా వీధిగదిలోకి నడిచింది. ఆ ముసలాయన కుర్చీలో కూర్చుని ఏదో పుస్తకం తిరగేస్తున్నాడు. కుర్చీపక్కన గొడుగూ సంచీవున్నాయి.

"అంతా బావున్నారా మావయ్యగారూ? మీరిదేనా రావటం?" అంటూ నవ్వు తెచ్చుకొని పలకరించింది. ఆయన అమలకేసి చూస్తూ "బాగానేవున్నారమ్మాయ్. వచ్చిన పని అవక ఈ పూటకి వుండిపోవలసి వచ్చింది." నొచ్చుకుంటున్నట్టుగా అన్నాడాయన.

"దానికేమండీ? ఇదేం యిల్లుగాదా? మీ అమ్మాయియిల్లే అనుకోండి." భర్తకేసి చూస్తూ "మీరు మావయ్యగారితో మాట్లాడుతూండండి. నే లోపలికెళ్తాను" అని వంటగదికేసి నడిచింది. "చీర మార్చుకొని వంట



ఒయ్యారము

చిత్రకారుడు: డి. పి. ప్రసాద్-గుంటూరు.

## "చుట్టమై చూడొచ్చి"

చేస్తే? ఆ అరగంట భాగ్యానికి విప్పా, కట్టా సైంవేసు. అన్నమేకదూ ఎంతలో వుడుకుతుంది?" అనుకొంటూ పొయ్యి రాజేసి ఎసరు పెట్టింది. "దక్కగా యీపాటికి హాల్లో వుందును. జనం కిటకిటలాడుతూ వుంటారు. రతీమన్మథ నృత్యం ఎంతబావుంటుందీ! అది మొదలేకూడా. చూస్తానో లేదో, అదృష్టంకూడా వుండాలి. పాపం పొయ్యి గమ్మునే అంటుకొందిలే." అమల చెవుల్లో గజ్జెలు ఘుణఘుణ మ్రోగుతోంటే బుర్ర ఆలోచనల్తో నిండిపోతూంది.

* * *

"లేవండి మామయ్యా. కాళ్ళు కడుక్కొని భోంచేద్దురుగానీ." అంది అమల వీధి గదిలోకొచ్చి.

"అబ్బే. ఎందుకమ్మాయ్ నీకాశ్రమ? రేపు దయం భోంచెయ్యొచ్చు. ఈ పూటకి ఫర్వాలేదులే అమ్మాయ్" అన్నాడాయన.

"అలా అనకండి. ఇంటికొచ్చిన చుట్టానికి భోజనం పెట్టటానికి శ్రమేంటి బాబాయ్? అటువంటి శంక లేమీ పెట్టుకోకుండా భోంచెయ్యండి." అన్నాడు బలరాం.

"అదిగాదు నాయనా! మామూలుమనిషినైతే శ్రమేముందిలే. విధవగొడవ. క్రిందటేడాది చచ్చే జబ్బుచేసింది చూశావ్, అప్పట్నుంచీ పత్యంగా తింటున్నాను దంపుడుబియ్యం అన్నంగాని పనికిరాదు వంకాయ, ఆవకాయ, లాంటివి వాడటం లేదు. వాలాజీ తాలింపు కుదర్నే కుదరదు అందుకేగదూ, ఎప్పుడూ యిల్లు కదల్నేనిబ్బందిపడి యితర్ల నిబ్బంది పెట్టాలి. హోటేలు మెతుకులు వాసనచూస్తేనే జబ్బు తిరగబెడుతుంది. ఈ రాత్రిపూట మీరేం శ్రమపడతారు నాయనా నాగురించి?" అన్నాడాయన దిగులుగా. ఆయన మాటలు వింటూ బలరాం స్తంభించిపోయాడు. అమల గుండె ఆగిపోయింది. ముసలాణ్ణి నమిలి మింగేద్దామన్నంత కోపం వచ్చింది. పత్యాలూ, పానాలూ వున్నవాళ్ళు పొరుగిళ్లకెందుకురావాలో? పావకంలో పుడకలాగ, చిరాకుగా లోపలికెళ్ళిపోయింది అమల. బలరాంకూడా నెమ్మదిగా లోపలికొచ్చాడు.

అమల మంచంమీద కూర్చునివుంది మూతి ముడుచుకొని.

"అన్నం వండావుకదూ? నిమ్మకాయ పచ్చడుంది. చారుంది. పెరుగుందికదూ...?" అన్నాడు నెమ్మదిగా బలరాం.

"అన్నంమాత్రం ఏదీ? దంపుడన్నం

(40-వ పేజీ చూడండి)

# చోళీ మెడ డిజైను

మంగళా కందూర్
(విశాఖపట్నం)

ఇది జాకెట్ మెడ చుట్టూ కుట్టుకొనే డిజైను. దీన్ని చేతులకుకూడ కుట్టుకోవచ్చు. దీన్ని పెద్దల చోళీలకు, పిల్లల జాకెట్లకు, చిన్నపిల్లల ఫ్రాకులకు ఉపయోగించవచ్చు. నేను డిజైనులో యిచ్చినట్లుగా ముందుగా చోళీ గొంతు వంకీలుగా కత్తిరించి వుండాలి. ఇంట్లో మిషను వుండేవారు ఇంట్లోనే కట్ చేసి కుట్టుకోవచ్చు. లేనివారు ముందుగా దర్జీవానితో చెప్పి వంపులుగా కుట్టించాలి. ఈ వంపంతటినీ జాగ్రత్తగా అనుసరించి కాజాకుట్టు దగ్గరి దగ్గరిగా, అంటె గుడ్డ కనిపించకుండా కుట్టాలి. కాజాకుట్టు ముడులన్నీ అంటే పైభాగం బయటివైపుకే అంటే గొంతువైపుకే వుండాలి. ఇక డిజైనులోని పువ్వులు, మొగలు, చుక్కలు అన్నీ నేను యింకు సిరాతో నింపినట్లు సిల్కుదారంతో మీరు నింపాలి. పువ్వును, మొగ్గనూ కలిపే గీతను కాడ (స్టెమ్ స్టిచ్) కుట్టులో గాని, గొలుసుకుట్టు (చెయిన్ స్టిచ్) తో గాని కుట్టాలి. రంగులు ఎవరి యిష్టాన్నిబట్టి వారు కుట్టుకోండి. డిజైను చాలా పెద్దదనుకున్న వారు కుడి, ఎడమ ప్రక్కల ఒక్కొక్క పువ్వును తగ్గిస్తే సరి.

ఇక చేతులకు :–దీన్నే ఓ ప్రక్క మూడు పువ్వుల్ని వేరే కాగితంపై ట్రేస్ తీసుకొని చేతులచుట్టూ వేసుకొని కుట్టుకుంటే బాగుంటుంది. చేతులుకూడ క్రిందిభాగం వంకీలు వంకీలుగానే కట్ చేయాలి. అయితే డిజైను చేతులకు తీసుకున్నప్పుడు పూవులు తలకిందులుగా రాకుండ తిప్పి కుట్టుకోవాలి. ఎందుకంటే మెడకు అయితే వంపులు పై భాగంలో వుంటాయి. కాని చేతులకు క్రిందిభాగంలో వుంటాయి.

ఇంకా ఓపిక వున్నవారు ఈ డిజైన్‌ను చేతులకులాగ ట్రేస్ తీసుకొని చోళీలకైతే వెనుకభాగానికి, జాకెట్లు, గౌనులకు క్రింది భాగం చుటూ కుట్టుకొంటే చాలా బాగుంటుంది. ఏ భాగం అయినా వంపులుగా కట్ చేయడం మరచిపోకండి.

గౌను చేతులకు, మెడకు, క్రింది భాగంకు యిలాగా ఒంపులుగా కట్ చేసి డిజైను కుట్టే షాపులో అమ్మే రెడీ మేడ్ గౌనులాగ ఎంతో అందంగా వుంటుంది.

ముఖ్యంగా ఇది క్రేపుసిల్కు గుడ్డపైన చాలా బాగుంటుంది. తెల్లగుడ్డకన్నా లేత నీలం, లేక ఆకుపచ్చ అయితే చాలా బాగుంటుంది. కుట్టేందుకు ఆలస్యమైనా, కాస్త ఓపికతో పూర్తిచేస్తే చాలా బాగుంటుంది. తప్పకుండా ప్రయత్నిస్తారు కదూ!

ఈ డిజైన్‌ను చేతులకు లాగే ట్రేస్ తీసుకొని, చిన్నపిల్లల పావడాల చుట్టూ వేసుకొని కుట్టినా కూడా బాగుంటుంది. అదీ వంపులుంటేనే బాగుంటుంది. 

# "నేనూ చదివాను బి.ఏ. అయితే ఏం లాభం?"

నా తల్లిదండ్రుల సంతానం అంతా ఎనమండుగురం. భగవంతుడు సమానంగా పంచి ప్రసాదించాడా వారికి అన్నట్టు నలుగురు ఆడపిల్లలు, నలుగురు మొగపిల్లలు. అందులో నేనే పెద్దదాన్ని. మొగపిలల విషయంలో మానాన్న, ఆడపిల్లల విషయంలో మా అమ్మ బాధ్యత వహించి పెంచి పెద్దవారిని చేశారు. చదువు సంధ్యల విషయంలో, డ్రెస్సులు కుట్టించడంలో నగలు చేయించడంలో యింకా తదితర ఖర్చులన్నిటిలో మదుపుదారు మా అందరికీ మానాన్నే. కాని ప్రత్యేకశ్రద్ధ మొగపిలల గూర్చి మానాన్న, ఆడపిల్లలగూర్చి మాఅమ్మ వహిస్తూ మొత్తంమీద అందరము మా తల్లిదండ్రుల ప్రేమాభిమానాలకు గురిఅవుతూనే వుండేవాళ్లం. మా ఎనమండుగురి గూర్చి మీకు ఏవో చెప్పి విసిగించకుండా, సందర్భం వచ్చింది గనుక నా ఒక్క విషయం యిందులో ముచ్చటిస్తా.

నేను ఇంటరు ప్యాసై బి. ఎ. కు వచ్చిన ఆ సంవత్సరములోనే బి. ఎస్. సి. చదువుతున్న ఒక యువకుడికి యిచ్చి నాకు వివాహం చేశారు. కాపరానికి వెళ్ళిన మూడు సంవత్సరాలలో నాకు యిద్దరు సంతానం కలిగారు.

ఒకనాడు నేను మా ఆయన యీ యిద్దరి పిల్లలతో ప్రయాణం చేయడం సంభవించింది. పెద్దపిల్ల నిద్రకు ఏడుస్తోంది. చిన్నపిల్ల పాలకు ఏడుస్తోంది. మొత్తంమీద ఏడుస్తూనే వున్నారు. పెద్దపిల్లను కొంచెం జాగాచేసి పడుకో పెటమని ఆయనకు అప్పగించాను. పాలకే ఏడుస్తూన్న చిన్నపిల్లకు తల్లిమాత్రపని నేను చేస్తున్నాను. ఇటువంటి పరిస్థితిలో మా యిద్దరిని ఎంతసేపై కనిపెడుతున్నాడో షుమారుగా షష్టిపూర్తి సమీపిస్తూన్న ఒక పెద్దమనిషి మా ఆయన్ను చూచి: "బాబూ! ఏంపని చేస్తున్నారు? మీ నాన్నగారు ఎవరు? ఎంతవరకు చదువుకున్నారు? మీ యింటిపేరేమిటి?" ఇత్యాది ప్రశ్నలన్నీ వేశాడు. ఆయన వాటికన్నిటికీ తగిన సమాధానాలు యిచ్చారు. ఒక చేత్తో పిల్లను జోకొడుతూనే. అట్లాంటి ప్రశ్నలు పరంపరగా నాకుకూడా వస్తుంటాయేమోనని ఎంతో ఆశపడ్డాను. అతనేమీ ఆయన నన్ను అడగలేదు. కాని ఆ పెద్దమనిషి భార్యమాత్రం వూరుకోకుండా "మీకు యీ యిద్దరు పిల్లలేనా ఏమిటి! అచ్చు సిపాలికే. బాగున్నారులే" అనేసి వూరుకుంది

మరి నేనుకూడా బి. ఏ. వరకూ చదివానుగదా, నా చదువుగూర్చి ఆ యిద్దరిలో ఏ ఒక్కరైనా అడుగుతారేమో, ఆ సంగతి చెప్పి చదువు సార్థకమైనట్లు సంతోషిద్దామనుకున్నాను గాని ఎవరూ అడక్కపోవడంవల్ల ఆడచదువు ఎంత చదివినా యింతేగాబోలు ననిపించింది.

మా నాన్న నాకు చదువు చెపిస్తున్నంతకాలం, "నీక్రింద అయ్యే ఖర్చంతా గంగలో దండుగేనే" అని తరుచు అంటూవుంటే మా అమ్మ చాలా బాధపడేది. నేనుకూడా ఎందుకు యిట్లా అంటున్నారా అని అనుకుంటూ వుండేదాన్ని. రైల్లో నాకు కలిగిన పరాభవంవంటి విషయాలు నా జీవితంలో చాలా వచ్చాయి.

నేను ఏ ఉద్యోగం చేయకపోవడం, మా నాన్నగారికిగాని, నా భర్తకుగాని యింత చదివినందుకు ఆర్థికంగా కొంచెమైనా సహాయపడలేకపోవడం యివన్నీ ఆలోచిస్తూ వుంటే ఆనాడు మా నాన్న అనే మాటలు నాకు యిప్పుడు పూర్తిగా అర్థమవుతున్నాయి. అవును. నిజమే.

ఆడది ఎంత చదువుకున్నా నీకు పిల్లలు ఎంతమంది? మీ ఆయన ఏంపని చేస్తున్నారు? మీ అత్తవారిదేవూరు అనిఇట్లాంటి ప్రశ్నలే గాని ఒక్కరూ నీవు ఎంతవరకు చదువుకున్నావని అడిగిన పాపాన్నిపోలేదు! బాగా చదువుకున్న దాన్ని నేను పెళ్ళి చేసుకున్నాననే సంతోషం గాని, ఒక్కొక్కప్పుడు దుఃఖం గాని పొందేది ఏమైనా వుంటే అది నా ఒక్క భర్తే.

నాతమ్ముళ్లు నలుగురి క్రింద ఖర్చుచేసిన సొమ్మంతా దమ్మిడి పైసలతో సార్థకం అయిందంటే అతిశయోక్తి ఏమీ లేదు.

దీనిని బట్టి ఆడదాని చదువు 75% సార్థకత లేదని నాకు బాగా అనుభవం అయిపోయింది. ఈ విషయంలో నాతో ఎంతమంది ఏకీభవిస్తారో!

శ్రీమతి టి. ప్రభావతి

# రకరకాల బాధలు

సంసారానికి ఎన్నో వస్తువులు కావాలని, ఉండాలని కోరుకొంటాము గానీ, దానివల్ల లాభం ఎంతో అంత కష్టమూ ఉందనేసంగతి మటుకు నాకు ఇటీవలనే బాగా తెలిసి వచ్చింది. వస్తువుల విషయంలో కలిగే సాధకబాధకాలన్నీ చాలా మంది సోదరీమణులు తెలియచేసారు. ఇకపోతే స్యూయింగ్ మెషిన్, గ్రామఫోను, ఇస్త్రీపెటి ఫ్లాస్కు మొదలయిన ఖరీదయిన వస్తువులున్నా కూడా మనకి లేనిపోని బాధలు కలుగుతాయి.

మా పుట్టింటిలో గ్రామ్‌ఫోను ఉండేది. వచ్చిన కొత్త సినిమాలోని మంచి రికార్డ్సు అన్నీ మా నాన్నగారితో పోరుపెట్టి కొనిపించే వాళ్ళం. కాని ఏంలాభం? రికార్డ్సు తెచ్చిన మరుక్షణం నుండి వేటగాళ్ళలా తయారయ్యే వాళ్లు మిత్ర బృందం, తీసుకుపోడానికి. వాళ్ళని చూస్తూంటే డేగలూ రాంబందులూ గుర్తుకు వచ్చేవి నాకు. ఒకళ్ళకి రికార్డ్సు కావాలంటే మరో కళ్ళకి గ్రామ్‌ఫోనూ, రికార్డ్సూ రెండూ కావాలి మరి. కొందరకైతే రికార్డ్సూ, ఫోనుతో పాటు పిన్నులు కూడా సప్లై చెయ్యవలసి వచ్చేది. నాన్నగారి ఫ్రెండ్సుకి ఇచ్చిన తరువాత అన్నయ్య ఫ్రెండ్సుకీ, ఆ తరువాత నా ఫ్రెండ్సుకీ ఇలా వంతులవారిగా ఇంటిల్లపాదియొక్క ఫ్రెండ్సు తీసుకుపోయే వాళ్ళు. అవి మళ్లీ మా ఇంటికి చేరడానికి మాజవాను కాళ్ళు అరిగే వరకు తిరిగితేగాని వచ్చేవికావు వచ్చిన తరువాత చూస్తే ఏముంది? రికార్డ్సుమీద కవర్ సంగతి అటుంచి రికార్డ్సు నున్నగా తోమి వేసినట్లు అరగదీసి మరీ పంపేవాళ్ళు.

మరికొందరు మహానుభావులు గంట్లు పెట్టి మరీ ఇచ్చేవాళ్లు రికార్డు పెడ్తే ముందికి వెళ్లదు వెనక్కి వెళ్లదు. నిజంగా ఏడుపొచ్చేది. కానీ ఏం చెయ్యం? మాయింట్లో అందరకి చెప్ప లేనంత మొహమాటం. ఈ బాధలు పడలేక స్ప్రింగు విరిచేసి ఓమూలపడేసాం దాన్ని.

**శ్రీమతి సి. ఉత్తర**

ఇలానే మొన్న మా ఎదురింటావిడ హోటల్ నుంచి కాఫీ తెప్పించుకొని ఇచ్చేస్తాం ఓసారి ఫ్లాస్కు ఇమ్మంటే ఇచ్చా వారం రోజులయినా యివ్వలేదు. అవసర మొచ్చి, తప్పనిసరిగా నేనే వెళ్ళి అడిగా. ముఖం అదోలా చేసుకొని ఇచ్చింది. ఇంటి కొచ్చిం తరువాత మూతతీసి చూస్తే కార్కు లేదు. కాయితం చుట్టలా చుటి ఉంది అదిమూసి లోపల ఎలా ఉందోని చూస్తే భరించలేనంత పాడువాసన కొట్టింది. ఆవాసన పోగొట్టేటప్పటికి తల ప్రాణం తోక్కి వచ్చినట్లయింది!

ఈ బాధలు చాలవన్నటు మొన్న పండక్కి మాఊరు వెళ్ళినప్పుడు నాన్నతో పోరు పెటి ఓ స్యూయింగ్ మెషిన్ కొనిపించి తీసుకువచ్చా. దాన్ని చూసి చాలా మురిసి పోయే దాన్ని. కాని నామురిపం మూడు రోజుల్లో ముక్కలయింది. మాకుజాకెట్టు కత్తిరింపులు నేర్పండని ఒక రడిగితే, మా పాపకి గౌను కుటివ్వండని మరోకరు. చెప్తే నమ్ముతారా? ఊపిరి పీల్చుకోడానికిటయిం లేనట్టు చేసున్నారు. మధ్యాన్నం వంటి గంటకల్లా తయారయి అయిదుగంటలవరకూ కదలరు. ఏమైనా రాసుకొందామన్నా, కుట్టుకొందామన్నా వీలులేకుండా అయిపోతోంది.

కాసేపు పడుకోడానికి కూడా వీలు లేకుండా ఉంది.

మధ్యాహ్నమే గా తీరుబాటుగా ఉంటుంది. సూదిలో దారం ఎక్కించటం చేత కాని వాళ్ళుకూడా మాకు కట్టింగులు నేర్పండని, కుట్లు నేర్పండని చంపుతూంటారు. అదీకాక ఎన్నిసార్లు చెప్పినా అర్థం చేసుకోలేరు. పోనీ ఒకటి రెండయితే ఎలానో ఓలా చేదును. కాని వాళింట్లో కుటించుకొనే ప్రతీబటా (వాళ ధర్మమాని మగవాళ్లవి మాత్రం తేరులెండి) మాయింటికి తెస్తున్నారు టైలరింగు ఖర్చు మిగులుతుందిక దాని. ఇప్పుడు అనిపిస్తోంది. "కొరివితో తల గోక్కున్నట్టు" ఎందుకు కొన్నానా ఈ మెషిను అని. అందరకీ ఇలాంటి బాధలు కలుగకపోవచ్చు కానీ నాలాంటి మొహమాటస్తులకి తప్పకుండా ఇలాంటి అవస్థలు వెంబడిస్తూ ఉంటాయి. కాబటి మొదట్లోనే జాగ్రత్తగా ఉండాలి ఏమాత్రం చనువు ఇవ్వకూడదు ఒక్క జాకెటేకదా పాపం కుటిద్దామని అనుకొన్నామా! మన నెత్తి కెక్కేస్తారు సందేహించకుండా! ★

# వంటలు

ఎంత జాస్తిగా కూరలువాడే వారికైనా వూరగాయలు లేకుండా గడపటముకష్టమే. మామిడికాయ దొరక్కపోయినా కంద పెండలము, పచ్చిమిర్చి, అల్లముతో కూడా పెటుకొని జాగ్రత్తగ తడి తగలకుండ వాడు కుంటే సంవత్సరం కూడ నిలవవుంటై. కంద పెండలము ఒకేమాదిరిగా పెడతారు. కనుక కందతో పెటే విధానము చెపుతాను. దీనిని బట్టి, పెండలముతో కూడ పెట్టుకోవచ్చు.

## కందతో

కావలసిన సామగ్రి:— మూడు సవాసేర్లు కందకొని చెక్కుతీసి, కడిగి బట్టతో తడి లేకుండా తుడిచి, ముక్కలుకోస్తేఅరవీసెడు అవుతై కందలో తియ్యకంద, చిళ్ళకంద అని రెండు రకాలు వుంటై. (అందులో నేను చిళ్ళకందవేసి చూశాను. కాని తియ్య కందకూడ పెడతారని విన్నాను.) తరువాత ఒకసవాసేరుకి కొంచెము తగ్గించి చింతపండు ఒక పావుశేరు ఉప్పు, ఒక పావుశేరు కారము ఒక టేబిల్ స్పూన్ పసుపు, మూడు స్పూనుల మెంతులు, కొంచెము ఆవాలు, గుప్పెడు మినపప్పు, గుప్పెడు సెనగపప్పు, కుంకుడు కాయంత ఇంగువ, ఒక సవాశేరు నూనె (నువ్వుల) కావాలి.

చేయవలసిన విధానము:— ముక్కలు చేసి తయారు చేసుకు నేపద్ధతి ఇందాక చెప్పానుగా. చింతపండు పుటేగింజతీసి, ముక్కలు, చింత పండు తొక్కి సగము నలగగానే ఉప్పు, పసుపువేసి వీలైనంత మెత్తగ తొక్కి ఒక జాడీలో పెట్టి, మూడవరోజు రెండు చెంచాల మెంతులు వేయించి పిండిచేసి, ఈ పిండి, కారముపోసి, మెత్తగ చింతపండు,ముక్కలు మరల గుబ్బినతరువాత కలపవలెను. తరువాత, నూనె కాచి కొంచెము (అనగా గుప్పెడు) మిరపకాయలు, అవి వేగినతరువాత వరుసగా సెనగపప్పు, మినప్పప్పు ఆవాలు, ఇంగువ (పొడిచేసి) వేసిదింపి చల్లారినతరువాత పోసి కలిపితే నిలవవున్నకొద్ది రుచిగా వుంటుంది.

## అల్లముతో

కావలసినవి: ఒక సవాశేరు అల్లము, అరవీశె చింతపండు, ఒకస్పూను పసుపు, ఒక పావుశేరు వుప్పు, ఎండుమిరపకాయలు ఒక సవాశేరు, ఒక సవాశేరు నూనె (నువ్వుల) తిరగమాతకి గుప్పెడు మినప్పప్పు సెనగపప్పు, షుమారుగా, రెండుస్పూనుల ఆవాలు నాలుగుస్పూనుల మెంతులు ఒక సవాశేరు బెల్లము

చేయవలసిన విధానము; అల్లము శుభ్రము గా కడిగి పెచ్చుతీసి, మెత్తగా తొక్కించు కోవాలి, చింతపండు గింజ,; ఈనుఏరేసి, పండు తడియునట్లుగా తెల్లని గిన్నెలోగా,

## వంటలు

నీలు గిన్నెలోగాని వేసి వుడకబెట్టి (ముద్దలాగ) చల్లారిన తరువాత రుబ్బాలి(మెత్తగా) మిరపకాయలు గుప్పెడు అట్టేవుంచి (తిరగమోతకు) మిగత కాయలన్నీ కొంచెము నూనె వేసి వేయించాలి, రెండు స్పూనుల మెంతులుకూడ వేయించాలి.

అప్పుడు మిరపకాయలు, మెంతులు మెత్తగా దంచగొట్టాలి. బెల్లము వుడుకు వచ్చినప్పుడు వేయాలి, పసుపు వుప్పు కూడా వుడికేటప్పుడు వేసి అడుగంటకుండా కలియ తిప్పుతుండాలి. తరువాత మిగత నూనెతో, మిర్చి, సెనగపప్పు, మినప్పప్పు, ఆవాలు మెంతులు వేసి (నూరిన అల్లముకూడ రుబ్బేటప్పుడే వేసి) తిరగమోత చేసి, అల్లము కారము, మెంతిపిండి, పసుపు బెల్లము, వుప్పు కలిపివుంచిన దానిని తిరగమోతలో పోసి కాసేపు వుడకనిచ్చి దింపి చల్లారిన తరువాత జాడీలో పెట్టిన జాగ్రత్తగా వాడుకుంటే, సంవత్సరం వుంటుదంటారు కాని నాలుగునెలలు వుంటుందని నేను అనుకున్నాను.

## పచ్చిమిర్చితో

ముదిరి దోరగావున్న పచ్చిమిరపకాయలు అరవీశెడు తొక్కి దానిలో సవాశేరుకి కొంచెము తక్కువగా చింతపండు గింజ వుట్టి ఏరినది వేసి, షుమారు మూడుగిద్దలు వుప్పుకూడ వేసి (అంటే పచ్చిమిర్చిలో కారము బాగావున్నవి లేనివి వుంటై కనుక షుమారు అన్నాను) పసుపు వేసి తొక్కి జాడీలో వుంచి మూడవనాడు, మెత్తగా పచ్చడికి వీలుగా వుండునట్లు రుబ్బి మెంతులు ఒకచెంచాడు వేయించి పిండిచేసికలిపి, ఒకసవాశేరు నువ్వుల నూనెను కాచి, దానిలో గుప్పెడు మిర్చి గుప్పెడు, సెనగపప్పు, గుప్పెడు మినప్పప్పు, ఆవాలు, కొంచెము ఇంగువపొడి, కొంచెము మెంతులు వేసి తిరగమోత వేస్తే ఇదికూడా చాలా రుచిగా వుంటుంది. తిరగమోత గింజలు ఎక్కువగానో తక్కువగానో తినే వారి ఇష్టాన్ని బట్టి వేసుకోవచ్చు. వీటిని బటి పెట్టి చూచుకుని తరువాత ఎక్కువ తక్కువ లెక్కప్రకారము మార్చవచ్చును.

ఫిబ్రవరి, మార్చి నెలలలో తీసినకంద, అరదు కవక చింతకాయవలె త్రొక్కిన కొలది పొరకు వచ్చును. ★

ఎస్. కె. దుర్గ (కాటూరు.)

---

## ★ “చుట్టమై చూడొచ్చి...” ★

(36-వ పేజీ తరువాయి)

మేకులా గట్టిగావుంటే ముసలాయన తిన లేడేమోనని మరబియ్యమే వండాను.” అంది అమల.

బలరాంకి నవ్వొచ్చింది. అదిచూసి అమల కేడుపొచ్చింది.

“నాఖర్మ. లేకపోతే ఈపాటికి ధియేటర్లో కూర్చుని వుండవలసినదాన్ని...... చుట్టమై చూడొచ్చి దయ్యమై పట్టుకొందని ... నాకదృష్టం లేదు” అంది భారంగా అమల. బలరాం అమల పక్కన కూర్చున్నాడు “చూడమలా! ఆయనేం గతిలేక మనింటికి రాలేదు. అనవసరంగా మనకి శ్రమిస్తున్నానని ఎంతో నొచ్చుకొంటున్నాడు. ఇదే వాళ్ళమ్మాయి యితే యిలా విసుక్కునేదా? మనం పెడితే తింటాడు. లేకపోతే పస్తుంటాడు. మర్యాద గల పెద్దమనిషింటికొస్తే ఎలా పస్తుపడుకోబెడతాం? డొస్సులు యివ్వాళ కాపోతే రేపుంటాయి. ఆ భాగ్యానికి మంచీ మర్యాదా లేకుండా ఎలా?”

“ఇప్పుడు నన్నేంచెయ్యమంటారు?”

“లేచి అన్నంవండు. నేనలా బజారు కెళ్ళి బీరకాయలైనా, ఏవైనా తీసుకొస్తాను. కాస్త నెయ్యి తాలింపేసి కూర వండొచ్చు. లేవమరి. ఎనిమిది దాటిపోయింది.”

అమల మాట్లాడకుండా వంటగదిలోకెళ్ళింది. బలరాం కూరగాయలసంచి తీసుకొని వీధిలోకి నడిచాడు.

* * *

తెల్లవారింది. అమలకి రాత్రంతా సరిగా నిద్రపట్టలేదు. పట్టినా ఏ రతీమన్మథులో, ఉమాశంకరులో, రాధాకృష్ణులో నాట్యం చేస్తూ లేపేసేవారు. లాభం లేదనుకొని కనుచీకటుండగానే లేచిపోయింది. ముసలాయన మూడుగంటలకే లేచి కూర్చున్నాడు. అమల ఆయన కోసం నీళ్ళుకాచి స్నానానికి తోడింది. కాఫీ తాగడని తెలుసుకొని, అప్పుడే పాలమనిషి తెచ్చిన పాలు కాచి యిచ్చింది. “బలరాం లేవలేదమ్మా?” అన్నాడాయన పాలగ్లాసందుకొంటూ.

“లేదు మామయ్యా! లేపమంటారా?”

“అతనె లేస్తాడులే. పనేంలేదు. వెళ్ళిపోయే ముందు చెప్దామని.”

“ఇంత పొద్దుటే ఎక్కడికెళ్తారు? భోంచేసి వెళ్దురుగాని.”

ఆయన చిన్నగా నవ్వుతూ గ్లాసు క్రింద పెట్టి జేబులోంచి కొన్ని నోట్లుతీసి అమల కందిస్తూ ‘ఇది వుంచుకోమ్మా” అన్నాడు. అమల ఆశ్చర్యపోయింది “నాకు డబ్బెందుకు మామయ్యా?” అంది—“ఇది డబ్బనుకోకమ్మా. సంతోషంగా యిస్తున్నాను. ఒక్క రాత్రి వచ్చినా కన్నతండ్రికి చేసినట్టు చేశావు. నీ ఋణం ఎలా తీర్చుకోను? నా కూతురైతే యిచ్చుకోకుండా వెళ్తానా. తీసుకోమ్మా. నీకు నచ్చిన చీర కొనుక్కో. నేనే చీరకొని తెస్తే తీరా నీకు నచ్చకపోతే...అందుకని నువ్వే కొనుక్కో” అంటూ ఆయన నోటు అమల చేతిలో పెట్టాడు. అమల తలవంచుకొని తదేకంగా ఆలోచిస్తోంది. బలరాం ఆవలిస్తూ బయటకొచ్చాడు. “వెళ్తున్నానోయ్ బలరాం. ఒకతనితో మాట్లాడి మెయిల్ కెళ్ళిపోతా. వీలుచూసుకొని మాయింటికోసారి రండి. వస్తానమ్మా అమలా” అంటూ ఆయన సంచీ గొడుగూ పట్టుకొని వీధిలోంచి నడిచాడు. బలరాం మత్తు వదిలించుకొని “అదేంటి బాబాయ్. అప్పుడే వెళ్తున్నారు? నేనవ్ కొస్తా నాగండి” అంటూ వెంబడించాడు.

“వద్దు నాయనా. ఇప్పు డెళ్ళకపోతే అతను దొరకడు. ఫర్వాలేదులే. వెళ్తా” అంటూ ఆయన చరచరా వెళ్ళిపోయాడు. బలరాం లోపలికొచ్చాడు. అమల అలాగే నుంచుని వుంది, చేతిలో ఐదుపదులు రెపరెపలాడుతున్నాయ్. అంతటి సహృదయుణ్ణి ఈసడించుకొన్నందుకు నొచ్చుకొంటూ “చుట్టమై చూడొచ్చి...” అనుకొంటూంటే కళ్ళలో నీళ్ళుతిరిగాయి. ★

# వనితా వాణి



## విచిత్ర రామాయణంలో

మే 21 వ తేదీ 'ఆంధ్ర పత్రిక' యందు శ్రీమతి విద్యగారు వ్రాసిన వ్యాసంలో, రావణుని మరణానంతరమున వాతని జాయయైన మండోదరిని విభీషణుడు వివాహమాడినట్లు వ్రాసిరి. అట్టివాంశమును తాము ఏ రామాయణమునందును జూచియుండ లేదని జూన్ 18 సంచికలో శ్రీమతి జె. వర్ధనమ్మగారు 'ఇదియేమి న్యాయమా?' అను లేఖలో పేర్కొనిరి. వారు సమగ్రముగ నన్ని రామాయణ గ్రంథములజూడకయే పైవిధముగ విమర్శ చేయుట సమంజసము గాదు. "విచిత్ర రామాయణము"లోని యుద్ధకాండములో (886 వ పుట) ఈ క్రింది పద్యములను జూచిన సైసందేహము దీరగలదు:

గీ॥ మరియు నిందుకు వలయు సమస్త వస్తు
 చయము దెండు, మండోదరి రయముగాను
 లంకృతంజేసి తోడ్తెండు పొంకమార
 వనిన వారన్నియు నొనర్ప ననని విభుడు.
 ... ... ... ... ... ... ... ...

ఉ॥ ఈతఁడె లంకకీశుఁడ సురేంద్రు
 డటంచును బట్టుపుట్టమున్
 ఖ్యాతి గగనవిభీషణుని యా
 దలఁ జుట్టియు రామనాము ని
 ఖ్యాతలి నున్నయంతకు విభూతి
 సమృద్ధుఁడవై నిశాచరుల్
 ప్రీతి భజింప నిచ్చట నరిందమ
 యుండుము గాక రాజవై.

క॥ ఆదిత్య విభుఁడు శచితో
 మోదంబుననున్న కరణి బొలుపుగ నిమ్మం
 దోదరితో నుండుమనుచు
 యా దశరధరాజపుత్రుఁ డాశీస్సిడియెన్.

—డ. కళానిధిశర్మ,
టెక్కలి (శ్రీకాకుళం జిల్లా)

* * *

## మందు పనిచేసింది

అప్పుడే భోజనంచేసి కూర్చున్నాను. అంతలో మా తమ్ముడు 'ఆంధ్ర పత్రిక' వీక్లీ పట్టుకొచ్చాడు. నేను గబగబా వాడి చేతిలో పత్రిక లాక్కొని 'పేను కొరుకుడు'కు ఎవరైనా వైద్యం చెప్పారేమోనని 'వనితా వాణి' తిరగేశాను. 'వనితా వాణి'లో వ్రాసిన కొన్ని వైద్యాలు నా ఫ్రెండు ముందుగానే వాడింది కాని గుణం కనబడలేదు. నాగార్జున సాగర్ డాం నుండి కమలగారు వ్రాసిన 'పల్లి వైద్యం' నన్ను అట్టే ఆకర్షించింది. ఈ వలులవల నన్నా నా ఫ్రెండు 'పేను కొరుకుడు' తగ్గుతుందేమో నన్న ఆశకలిగింది నాలో.

మా ఇంట్లో నల్లులు లేవు. వెంటనే మా ప్రక్కింటి మామ్మగారి మంచానికి నల్లులున్న విషయం గుర్తుకు వచ్చింది. మామ్మగారి మంచానికున్న నల్లులు కొన్ని తీసి, ఒక పేపరులో పొట్లాం కట్టుకుని, పత్రిక వీక్లీ తీసుకుని, అంత ఎండలోను మా అక్క వద్దంటున్నా వినకుండా, రిక్షామీద నా ఫ్రెండు ఇంటికి వెళ్లేను. నాలో కలిగిన ఆత్రంచూస్తే నాకే నవ్వవచ్చినది. నేను వెళ్లేసరికి నా ఫ్రెండు నిద్రపోతున్నది. ఇదే మంచి సమయమని నా ఫ్రెండు తల్లో పేనుకొరుకుడు ఉన్నచోట నల్లుల్ని వేసి రుద్దాను. ఏమిటో అనుకుని చటుక్కున మేలుకున్న నా ఫ్రెండు నన్ను చూచి "ఏమిటి, ఇంత ఎండలో వచ్చి, కొంపమునిగినట్లు నన్ను నిద్రలేపేవు?" అంది. నేను ఏమి మాట్లాడకుండా 'వనితా వాణి'లో నల్లి వైద్యం చూపెట్టాను. అది చదివి "ఛీ! ఛీ! నా తల్లో నల్లులు వేసి రుద్దావా? ఎవరు ఏవైద్యం చెప్తే, ఆ వైద్యం వెనుకా ముందూ లేకుండా చెయ్యటమేనా? నల్లులపేరు చెప్తేనే నా వళ్లు కంపిస్తుంది" అంటూ గబగబ బాత్ రూములోకి పోయి గంటసేపు తలస్నానం చేసింది.

మరునాడు నేను వాళ్లింటికి వెళ్ళేసరికి నా ఫ్రెండు ఎప్పటిదో ఒక పాతదుప్పటి కప్పుకుని చాల సీరియస్‌గా నల్లుల్ని పడుతున్నది. "నిన్న నల్లులంటే ఎంతో అసహ్యం అని చీదరించుకున్నదానివి, ఇప్పుడు నల్లులకోసం ప్రాకులాడుతున్నావేమిటే" అన్నాను నవ్వుతూ. "నాకు నల్లులంటే అసహ్యమే కాని ఈ నల్లుల వైద్యం చెయ్యక తప్పలేదు. రోజూ పేనుకొరుకుడు, ఉన్నచోట ఎంతో దురదగా ఉంది. బాధపడలేదానిని. నిన్న నువ్వు నల్లుల్ని రుద్దినప్పటి నుండి దురదపోయి ఎంతో హాయిగా ఉన్నది" అంది నల్లుల్ని పేను కొరికినచోట రుద్దుకుంటూ.

కమలగారు ఈ వైద్యం నిజంగా చెప్పారో లేక హాస్యానికి చెప్పారో కాని, దీనివల్ల నా ఫ్రెండుకు పేను కొరికినచోట దురద తగ్గటమే కాకుండా, జుట్టుకూడ ఊడిపోవటం లేదు. ఈ వైద్యం వ్రాసిన కమల గారికి సాధన్యవాదాలు. ★

—కుమారి కౌజ వెంకటకమల, విజయవాడ

# మన సమాజంలో భర్తృవిహీనల దుస్థితి

## మంగళసూత్రం మోటైపోయిన ఈరోజుల్లో..

ఎంతమంది ఎన్నివిధాలుగా సంఘ సంస్కరణచేస్తున్నా మన ఆచార వ్యవహారాల్లో ఒక్కుమ్మడిగా పూర్తి మార్పు ఇప్పటివరకూ రాలేదు. వైధవ్యంలోనూ అంతే సహగమనం అంతమొందిన పిదపకూడా కేశఖండనాది వైధవ్యాచారాలు 'తు' 'చ' తప్పకుండా పాటింపబడినాయ్. అధునాతనయుగంలో వివాహాల పట్ల శాస్త్రాల్ని, సనాతనాచారాల్ని ఉల్లంఘించినట్లే కేశఖండనాది ఆచారాలనుకూడా ఉల్లంఘిస్తున్నారు. గాజూ పూసా తీసి వేసినా, విధవలు చీరా రవిక ధరించడం జుట్టు అలాగే వుంచుకోడం ఈరోజుల్లో సాధారణవిషయంగామారింది ప్రతివ్యక్తిచేత తిట్లూ శాపనార్థాలు తింటున్న సంఘం వీళ్ళందరినీ ఏమీ అనలేకపోయింది మొదట్లో నిశితంగా విమర్శించినా, క్రమేపి మౌనంగా వూరుకుంటుంది సంఘం; మంగళసూత్రాల విషయంలోనూ అంతే. సమాజాలద్వారా, పత్రికలద్వారా, సినిమాలద్వారా, నినాదాల ద్వారా మహిళలు ముందడుగువేసే ఈ రోజుల్లో స్త్రీకి మంగళసూత్రమే మోటుగా మారింది! అలాంటప్పుడు భర్త బ్రతికివుండగా అది మెడలో ఉంటేఎంత? భర్తచనిపోయాక పోతే ఎంత? (వివాహానికి చిహ్నం మంగళ సూత్రం ఆడవాళ్ళకు. కాని మగవాడికి పెండ్లి అయినట్టూ కానట్టూ తెలిపే ఏచిహ్నమూ లేదు స్వాతంత్ర్యాభ్యుదయ పరంపరలో మహిళలు రానురాను మగ వాళ్ళకు కూడా మంగళసూత్రంలాంటి చిహ్నం ఏదో ఒకటి కట్టారనుకుంటాను!)

శ్రీమతి కొత్తపలి రాజ్యలక్ష్మిగారు "తన భర్తకోసం, ఆభర్తవల్ల పొందిన సంతానం కోసం స్త్రీ అనేక త్యాగాలు చేస్తుంది," అన్నారు. అన్ని త్యాగాలు చేయడానికి సంసిద్ధురాలైన స్త్రీ ఒక్క తాళికోసం అంతగా తహతహలాడాల్సిన అగత్యంలేదు.

"భర్తృవిహీన అయిన స్త్రీని ఆ దుఃఖం చాలదేమోనన్నట్టుగా పరమ అందవిహీను రాలుగాకూడా తయారుచేస్తున్నారు. దీనిలో ప్రధానోద్దేశం ఆ స్త్రీలు పురుషుల్ని ఆకర్షించకుండా చేయడమే అయివుంటుంది" అని రాజ్యలక్ష్మిగారు వ్రాశారు. పూర్వం ఈ ఉద్దేశానికి చాలా విలువ వుండేది. ఆరోజుల్లో స్త్రీ ఇప్పటిలాగ విచ్చలవిడిగా సంచరిస్తుండేది కాదు భర్తపోయాక స్త్రీకి సంఘంలో గౌరవంతగ్గిపోయేది శుభకార్యాల్లకూడా పూర్తిగావిలువలేకుండావుండేది. ఇల్లే ఒక బందిఖానాగా నైరాశ్యంలో కాలం గడిపేది. ఉపవాసాలు దైవప్రార్థనలు తప్ప మరో ప్రసక్తిలేకుండా వుండేది. ఇన్నింటినీ నిష్ఠగా చూచుకునే స్త్రీ తన భర్త పోయాక తాను లావణ్య రహితంగా వున్నందుకు అంతగాచింతిల్లదు. అదీగాక అందంగా వున్న వస్తువుల్ని కన్నార చూడడం, తరువాత కాంక్షించడం మానవ సహజం దీన్ని దృష్టిలో వుంచుకునే పూర్వీకులు కేశఖండనాది ఆచారాల్ని విధించివుంటారు. భర్తృ విహీన అయిన స్త్రీ వివాహాలపట్ల వేడుకల

### శ్రీమతి చతుర్వేదుల విశాలాక్షి

పట్ల కనిపించకూడదనిశాసించారు. ఎప్పుడైనా పరాయి వాళ్ళకు కనిపిస్తే అందవిహీనంగా అసహ్యంగా కనిపించాలి. భర్తృ వియోగ దుఃఖంవలను, అంద విహీనత వల్లను, సంఘ బహిష్కరణ మూలంగానూ (విధవగా) స్త్రీకి జీవితంమీద తీపి నశిసుంది. కోరికలు వాడిపోతై. మానసికంగా తప్పక మార్పు వసుంది ఈ రోజుల్లో మాత్రం అలాకాదు. అలంకారాలతో పాటు, కేశఖండనతోపాటు చర్మం ఒలిచి పారవేసినాగాని కోరికలు చిగురిస్తూనేవుంటై. కారణాలు స్వాతంత్ర్య భావాలు, బాహాటంగా వ్యాపించిన పాశ్చాత్య నాగరికత, నాజూకుతనం, సౌకుమార్యం, ఆహారం, సినిమాలు మొదలైనవి.

"స్త్రీకి జీవితంలో మధ్యవచ్చి మధ్యనే పోయిన భర్తకోసమని ఈ కేశసంపదను తీసి వేయడం అన్యాయం...ప్రతి స్త్రీకి అలంకారప్రాయములైన బొట్టును నిషేధించడం, గాజులు పగులగొట్టించడం అసభ్యతతో కూడిన పనులు" అని రాజ్యలక్ష్మిగారి ఉవాచ. పోనీ ఇన్నిరోజులుగా వసున్న ఆచారాలన్నీ మంటగలిశాయ్ అనుకుందాం. అప్పుడు విధవకు ముత్తైదువకూ భేదం శూన్యం. అందాకా ఎందుకు? ఈ రోజుల్లో చాలా మంది—ముఖ్యంగా చదువుకున్న మహిళలు—భర్తలున్నా కూడా గాజులు నల్లపూసలు. బొట్టు మొదలైనవిగా ఎంచి తత్తుల్యంగానే కనిపిస్తున్నారు. అదేమంటే ఫాషనంటారు. నేనెరిగిన విద్యావతులు కొందరు మంగళ సూత్రాల్ని మెడలో వుంచుకోకుండా ఏ అలమరలోనో, ఏ వంకినో తగిలించివుంచడం ఫాషన్ పాటిస్తున్నారు మంగసూత్రం ప్రేమచిహ్నం మాత్రం కాదు. భర్తతో పాటు వచ్చిన ఈ మంగళ బంధనం అతనితో అంతరిసేనే అన్నివిధాలా మంచిది.

భర్తృవిహీన అయిన స్త్రీ మెడలో మంగళసూత్రం అలాగే వుంచాం అనుకుందాం. భర్తవున్నట్లే భావిసుంది కదూ! అంతటితో ఊరుకోక తీరనికోరికలకు లోనవుతుంది. ఈ ప్రేమ చిహ్నం మాటిమాటికి భర్తను గుర్తుకు దెచ్చి దుఃఖభారాన్ని ఇబ్బడిసుంది. కార్లకు, సైకిళ్ళకూ వేసే లైసెన్సు బిళ్ళల్లాగా పాపం ఆడవాళ్ళకి మంగళ సూత్రాలు! విడాకుల వివాహాలు, పునర్వివాహాలు సర్వసాధారణమైన ఈ రోజుల్లో గడువుదాటిన తర్వాత లైసెన్సు బిళ్ళలు (మంగళ సూత్రాలు) ఎన్నైనా మార్చుకోవచ్చునేమో! ఈ యాంత్రికమైన పని ఖర్చుతో కూడినదని కాబోలు భర్తలు సినిమా తెరమీది బొమ్మల్లా వస్తూ పోతూ వున్నా ప్రేమచిహ్నాలని చాలమందిచే యెంచబడే మంగళసూత్రాల్ని అలాగే శాశ్వతంగా ఉంచాలంటారు పూర్వాపరాలు తెలిపిన వారి రత్నాలు. పాపం! భర్త చనిపోయాక ఆచారప్రకారం గాజూ పూసా, మంగళ సూత్రాలు ఏ రేవులోనో, ఏ వూరి బయటనో ఏ చాకలిచేతనో తీసి వేయించేవారు. ఈ రోజుల్లో మరొకరి ప్రమేయం లేకుండా ఎవరికి వారే విలువబట్టి తీసిపారేస్తున్నారు, లేకుంటే ఉంచుకుంటున్నారు. సంఘం కాదని అంకెలు వేసినా ఈ మహిళలు లెక్కచెయ్యరు. అన్నీ మోటైపోయినై. ఆచారాలు మోటై అమానుషంగా కన్పిస్తున్నయ్ విధవకీ ముత్తైదువకు ఇసుమంతైనా భేదం కన్పించదు. కన్పించిన ప్రతి స్త్రీకీ ఎక్కడనో ఎవరో భర్త వున్నాడని (చచ్చి గాని, బ్రతికిగాని, ఇతర దేశాల్లో గాని, సినిమాల్లో గాని) భావించాల్సి వస్తున్నది.



 పరీక్షాఫలితం 

(23 వ పేజీ తరువాయి)

ఇంతలో రామశర్మ కొడుకు తిలక్కు యింటికిపోయి హాలు టిక్కెట్టు తెచ్చి తండ్రికి చూపించాడు. అందులో 725 నెంబరువుంది. తిలక్కు పేరుంది. శ్రీనివాస రావు పేరలేదు. పరంధామయ్య కొంచం జంకుతున్నాడు. ఇదేమిటి ఆఖరికి ఆ నెంబరు మన వాడిది కాదా? అని ఈ అలజడిలో సెర్వరు యిచ్చిన బిల్లు పరంధామయ్య చేతిలోంచి జారిపడింది కింద. ఆ ఆరుగురి స్నేహితుల గుండెలూ ఆ బిల్లుతో పాటు కింద పడినంత ప్రమాదం జరిగింది. కాని ఆ ఆరుగురూ ఐక్యకంఠంతో అందు కున్నారు. నిజంగా 725 నెంబరు యీ రామశర్మ కొడుకుదే అయితే—ఆయన కెందుకంట యింత వెరిఫికేషను. ఎవరి గోల వారికే—యీ 725 నాదేనని—ఎవరినీ లెక్క చేయకుండా వుండేవాడు. ఏ పెళ్ళి వాళ్ళో తిరిగివుంటారు. యీ తిలక్కును చూసుకోవడానికి. అబ్బే—పెళ్ళిళ్ళ సీజను కాదుటండీ—పది అబద్ధాలాడినా సరే—పెళ్ళి మాత్రం చేయించు అన్నాడు శాస్త్ర కారుడు. అంచేత పెళ్ళికోసం యీ 725 నెంబరు కోసం యింత అబద్ధం ఆడుతూన్న రామశర్మని యీగిచేస్తే—ఆ వచ్చిన పెళ్ళి వారికి యీ గుట్టు కాస్తా తెలిసిపోతుంది. రామశర్మకి అబద్ధాలకోరు అనేవాడు వచ్చినా—మనకి దంపతుల్ని విడదీసిన పాపం-పెళ్ళి అపుచేసిన పాపం చుట్టుకొని చివరికి గోహత్యాపాతకంలో యిజికోట్లు అవుతుంది. అంచేత పరంధామయ్యగారు—యీ 725 నెంబరు వాదంలో వుండే విశేష విషయాన్ని గురించి—రామశర్మను మన్నించి—తొందరగా మలబారుఅయ్యరు బిల్లు చెల్లించి యింటికిపోయి యావన్మందినీ ఆనంద పరవశుల్ని చేయండి అన్నాడు—వీడిఉపన్యాసం చల్లగావుండా ఆఆరుగురిలో అగ్రనాయకుడు. ఇదంతా చూసి రామశర్మ తెల్లబోయాడు—తిలక్కుతో పాటు.

చేతనయినవాళ్ళు అబద్ధాన్ని తియ్యని నిజంగా రూపొందిస్తారు. చేతకానివాళ్లు నిజాన్ని నిజంగా చెప్పలేక అబద్ధంగా అవ తారం చూపిస్తారు. ఇంత వాదించిన ఈ ఆరుగురు పరంధామయ్యగారిని మెప్పించడం కోసం అలా వాగ్ధాటిని విసిరిపారేశారు. పాపం పరంధామయ్య నమ్మి—రామశర్మని అసహ్యించుకున్నాడు. దర్జాగా తమల పాకులు సేవిస్తూ నమస్తేలు చెప్పి ఆ ఆరుగురూ హాయిగా రైలు గట్టుదాటి కిలకిల నవ్వుతూ పోతున్నారు.

మీ కాఫీ పిశాచాల హోరులో ఎంత చెప్పినా మీకు నచ్చదులెండి. మీ వాడి నెంబరెంత? అని అడిగిచూడండి. నిజం మీకే తెలుస్తుంది. ఈ విషయంలో అనవస రంగా నేను జోక్యం కలగజేసుకున్నందుకు మన్నించండి. మీ వాడు ఫేలవాలని నేను కోరతానా? నాకు తెలియదుటండీ-నాకు మావాడొకటీ-శ్రీనివాసరావుకటేనా-అంటూ యింకా చెబుతున్నాడేదో రామశర్మ. సరే యింటికిపోతే నిగ్గూ-నిజం తేలతాయిగా అంటూ చరచరా పరంధామయ్య యింటి వైపు పోతున్నాడు.

ఇంటికిపోయి యీజీచెయిర్లో కూర్చోగా—యిల్లంతా నిశ్శబ్దంగా వుంది. ఎవరూలేరా—అని అరిచాడు పరంధామయ్య. కన్నీళ్లు గుక్కుకుంటూ వచ్చింది కామేశ్వరమ్మ. పరంధామయ్య అనుకున్నాడు—పరీక్షాఫలితం లిటిగేషనులో పడిందని. ఏం-ఏడుస్తావ్ అన్నాడు పరంధామయ్య. నేను తిన్నగా వినిపించుకోలేదు యిందాకా. 725 నెంబరూ 720 నెంబరూ చూడమన్నాడట అబ్బాయి. 725 తిలక్కుదిట. 720 అబ్బాయిదిట. పరీక్ష తప్పిందని కుర్రాడు కుమిలిపోతున్నాడు. కోడలు మనస్సు మనస్సులోలేదు. కాచిన కాఫీ ఎవరూ తాగలేదు—అలాగే చల్లారి పోతూంది. ఏం చెప్పమన్నారు నాకే వరస చూస్తే పైత్యం దడవస్తూంది అని కామేశ్వ రమ్మ కిందపడింది. కొడుకూ-కోడలూ-భర్తా చుట్టూ మూగారు. వొణుకుడు గొంతుకతో భర్తని పిలిచింది కామేశ్వరమ్మ. కంగారుగా పరంధామయ్య డాక్టరుకి కబురుచేశాడు. అబ్బాయి పరీక్షపోయిందని-వాడిని సాధించ వని నా చేతిలో చేయివేయండి అంది దీనంగా కామేశ్వరమ్మ. ఛ ఛా! నేను మాత్రం మనిషిని కాదుటే-ధైర్యం తెచ్చుకో అని పరంధామయ్య అంటూండగానే కారులో డాక్టరుగారు వచ్చి కామేశ్వ రమ్మను పరీక్షించి-అబ్బే ఏమీలేదు. ఈవిడికి నరాల బలహీనత జాస్తి. ఒక యింజెక్షన కోర్సు యివ్వాలి-నెల్లాళ్ళు. యివాళనుంచీ ఆరంభిస్తాను. ఆఖరున యిద్దురుగాని బిల్లు పైకం. అంటూ డాక్టరు వెళ్ళిపోయాడు.

బి. ఎ. పరీక్షాఫలితాలనాడు మలబారు అయ్యరు దండుగ టీపార్టీ బిలు అక్కడ-డాక్టరుబిల్లు యిక్కడ-720 నెంబరు తాలూకు రోదన యిక్కడ—725 తాలూకు నవ్వులు అక్కడ! ఎంత అగాధంగం యివాళ అని అంతటి పరంధామయ్య నిరుత్సాహపడి నిలువునా నీరయ్యాడు.

కోడిపుంజులులాగ మీదిమీదికి వచ్చి—బల వంతం కాఫీపార్టీ న్యాయాలంగా సంపా యించి మలబారు హోటలులో పోటీ తిండి సాగించి—రామశర్మను డబాయించి—తనకు తానతందానపాట పాడిన దేవాంతకులు ఆరు గురు స్నేహితులూ పాపం పరంధామయ్యకి చటుక్కున జ్ఞప్తికి వచ్చారు—ఆరు రూపా యల అరువుబిల్లుతో సహా.

ఇంకా అలా డీలాగా వుంటూండగానే కుమ్ముల ఈశ్వరమ్మ-ఎదురయిన వితంతువు వెంకమ్మ విను వెంటనే జ్ఞాపకానికి వచ్చారు. ప్రళయ శకునాల నికర ఫలితం యిప్పటికి నిజరూపం చూపెట్టిందని పరం ధామయ్య బాధపడుతున్నాడు.

ఇంతలోనే రామశర్మ వచ్చి—చేతులు పట్టుకొని—నన్ను అపార్థం చేసుకున్నారా—అనిదిక్కు మొహం వేశాడు.

అబ్బే-అలాంటిది యేదీ లేదే—బాధ పడ కండి అని పరంధామయ్య బదులు చెప్పాడు.

నన్ను సంతోషపెట్టాలి-ఇవాళ మధ్యా హ్నం టీపార్టీ యిస్తున్నాను. మీరు తప్ప కుండా దయచేసి మావాడిని చల్లగా దీవిం చాలి అన్నాడు రామశర్మ.

పిల్లలుగల బీదవాడివి ఎందుకయ్యా యీ పార్టీ నెడద. పొద్దున నేను యిచ్చిన పార్టీ 725 కే కదా. ఆ బిల్లు నువ్వు చెల్లించేయ్. చాలు అని పరంధామయ్య అంటూండగానే—నవ్వుతూ రామశర్మ వెళ్ళిపోతున్నాడు.



# బాల సాహితి

దివి నరసింహారావు

[అది ఒక ఇల్లు. ఆ యింట్లో ఎవ్వరూ లేనట్లుంది. గుమ్మంలో తెల్లపిల్లి, నల్లపిల్లి ఉన్నాయి. తెల్లపిల్లి నల్లపిల్లితో మెల్లిగా ఏదో చెబుతోంది.]

**తెల్లపిల్లి:**

నల్లపిల్లి నేస్తమా!
చల్లని ఒక కబురునీకు,
చెబుతానిక వినుమా!
ఉట్టిమీద యింటివారు
రొట్టెలెన్నొ పెట్టినారు.
గుట్టుగ నే నటకుబోయి
పట్టితెత్తు రొట్టెలను.
గుమ్మంలో నిల్చి నీవు
గుట్టు తెలియనీయవద్దు!
ఎవ్వరేని వచ్చిరేని
మ్యావు! మ్యావుమని అరువుము.

**నల్లపిల్లి:**

ఇంటివారి కంటపడితె
తుంటిదాని పొదు వేమొ
పాడురొట్టె లేకుంటే
పొట్టనిండదా ఏమీ?
లేనిపోని బాధ లన్ని
జనికోయి మనకు నేడు.
కానిపనికి/దారితీయు
మనకు ముప్పువచ్చును.

**తెల్లపిల్లి:**

మొద్దుబారె నీమెదడు,
హద్దుతప్పె నీదు బుద్ధి
వద్దంటే లాభమేమి?
పద్దుచేయవద్దు నీవు
యిద్దర మా రొట్టెలను
పద్దుకొని తిందమోయి!
(తెల్లపిల్లి లోనికివెళ్ళి మూడు రొట్టెలు తెస్తుంది.)

**తెల్లపిల్లి:**

ఉట్టిపైన పెట్టినట్టి
బుట్టలోని రొట్టెలన్ని
గుటుగనే తెచ్చినాను
ఒకటి నీకు, రెండు నాకు,
ఇక వాదులాడగాకు!

**నల్లపిల్లి:**

గుమ్మంలో నిల్చి నేను
గుటుదాచి కాచినాను.
నా పాలుకు ఒక్క రొట్టె
న్యాయమోయి నీ వీయగ.

**తెల్లపిల్లి:**

కాలిగోరులివే
కందెను చూడు!

**నల్లపిల్లి:**

కంటిపాప లివే
కందెను చూడు!

**తెల్లపిల్లి:**

రొమ్ము రోమములు
రాలెను చూడు!

**నల్లపిల్లి:**

చిమ్మ చీకటులు
కమ్మెను చూడు!

**తెల్లపిల్లి:**

వాదమెందుకూ,
పోదము తీర్పుకు.

**నల్లపిల్లి:**

వైర మెందుకూ
రారా! పోదము.

(నల్లపిల్లి, తెల్లపిల్లి, నడుస్తుంటాయి. వాటి కొక కోతి ఎదురయ్యింది. ఆ కోతి చేతిలో "త్రాసు"కూడా వుంది. పిల్లులు కోతికి నమస్కరిస్తాయి.)

* * *

**తెల్లపిల్లి:**

ఉట్టిపైన పెట్టినట్టి
బుట్టలోని రొట్టెలన్ని
గుట్టుగనే తెచ్చినాను!
గుమ్మంలో కాపునిల్చి
గుటుదాచి పెట్టినది!
రొట్టెలివిగో అందుకొని
న్యాయంగా మాకుపంచి
సాయపడుము కపిరాజా!.
(ఆ మూడురొట్టెలు కోతికిస్తుంది.)

**కోతి:**

మర్మమేమి లేనట్టి
ధర్మకాటా నిలబెట్టి
దగాలన్ని కట్టిపెట్టి
తగవుతీర్తు న్యాయముగా.
సత్యంవద! ధర్మంచర!.

(కోతి రొట్టెలను త్రుంచి, "త్రాసు"లో వేసి తూస్తుంది. ఒకవైపు హెచ్చుగావుంది. దానిలో రొట్టెతీసి నోటితో కొరుక్కుతిని, మళ్ళా తూస్తుంది. చివరికది తగ్గుతుంది. మళ్ళా హెచ్చుగానున్న కిబ్బెలో రొట్టెముక్క కొరికి తిని తూస్తుంది. ఈసారి యిది తగ్గుతుంది. ఈ విధంగా మూడురొట్టెలు హరించిపోయి చిన్నముక్క మిగులుతుంది. పిల్లులు తెల్లబోయి చూస్తుంటాయి.)

**కోతి:**

పాపమేమి చేశారో
లోపమేమి చేశారో
రొట్టెల తూకంలో, నా
పట్టుతప్పి పోయింది!
మీ కర్మలు కాలిపోను
నాకు మిగుల శ్రమయయ్యెను.
చివరికొక్క చిన్నముక్క
కిబ్బెలోన నిల్చింది!
తక్కెడకూ అద్దె మీరు
తప్పక యివ్వాలిసుమా!
చిన్నముక్క అద్దెక్రింద
చెల్లిపోయె నదియుగూడ,
వెళ్ళివస్తా పిల్లులూ!
మళ్ళివస్తా పిల్లులూ!
(కోతి పోతుంటే పిల్లులు గుడ్లప్పగించి చూస్తుంటాయి.)

**రెండు పిల్లులు:**

కీచులాడుకొనుటవలన
కొసంతయు దక్కలేదు
టక్కులాడి మర్కటము
ఒక్కముక్క మిగల్చకనె
డొక్కనిండ మెక్కివేసె!
తగవులాడుకొనుటవలన
తగిన శాస్తి జరిగె మనకు!
(కళ్ళనీళ్ళతో నల్లపిల్లి, తెల్లపిల్లి, లెంపలేసుకుంటూ యింటిదారి పట్టాయి!) ★

# దుర్గమ్మ మొగుడు

ఒక గ్రామంలో విష్ణుశర్మ అనే బీద బ్రాహ్మణుడు నివసిస్తూండేవాడు. అతడు యాయవారం చేసుకుని జీవిస్తూ ఉండేవాడు. అతని భార్య దుర్గమ్మ. పేరుకి తగ్గట్టుగానే ఆమె పరమగయ్యాళి. రోజూ భర్త నొకసారైనా కొట్టందే ఆమెకి తోచేదికాదు. ఇట్లా ఉండగా కరువు వచ్చింది. ఇక మన శర్మకి పిడికెడు బియ్యమైనా దొరకడం చాల కష్టమైంది. చీవాట్లు, చెప్పు దెబ్బలు కూడ ఎక్కువయ్యాయి విష్ణుశర్మకి. ఒకరోజు ఎక్కువ బియ్యం తీసుకు రాకపోతే యింటికి రానివ్వనని చెప్పింది దుర్గమ్మ. శపించినట్లుగా ఆరోజు అసలు ఏమి దొరకలేదు. ఇంటికి వెడితే భార్య ఏంచేస్తుందో అనే భయంతో విష్ణుశర్మ ఇక్కడా అక్కడా తిరిగి ఒకయింటి అరుగుమీద విశ్రమించాడు.

ఆ రాత్రి భర్త యింటికి రాకపోవడంవల్ల ఎవరినీ కొట్టడానికి లేకపోయింది, దుర్గమ్మకు. ఆ కోపమంతా దొడ్లో ఉన్న రేగిచెట్టుమీద్ద చూపించింది. ఆ రేగి చెట్టుని బాదడం మొదలు పెట్టింది. చాల కాలంగా ఒక భూతం ఆ చెట్టుని ఆశ్రయించుకొని ఉంది. ఈ దెబ్బలకి తాళలేక ఆ భూతం పారిపోవడం జరిగింది. అది పోతూ పోతూ విష్ణుశర్మని చూసి జాలిపడి విష్ణుశర్మ దగ్గరకు వచ్చి "నేను మాళవదేశ రాజకుమారి చంపాదేవిని పడతాను. ఎంతమంది వైద్యులొచ్చినా వదలను. నువ్వువచ్చి 'నేను విష్ణుశర్మను, దుర్గమ్మ మొగుడిని' అని చెప్పు.

"రమ"

నేను ఆ రాకుమారిని వదులుతాను. దానివల్ల నీకుకీర్తి,ధనమూ వస్తాయి" అని చెప్పింది. శర్మకి భూతం చెప్పిన పద్ధతి నచ్చింది. భూతానికి తన సమ్మతి తెలిపి మాళవదేశానికి బయలుదేరాడు.

మాళవదేశపు రాజు విజయవర్మ తన కుమార్తెను పట్టిన భూతాన్ని వదిలించినవారికి అర్ధరాజ్యమిచ్చి, తన కుమార్తెనిచ్చి వివాహం చేస్తానని చాటించాడు. ఎంతోమంది వైద్యులు వచ్చి ప్రయత్నించారు. కాని లాభం లేకపోయింది. విష్ణుశర్మ తను భూతాన్ని వదల్చగలనని రాజుగారికి నచ్చచెప్పి రాజకుమారి వద్దకు వెళ్లాడు.

"ఎవరు నువ్వు? ఎందుకొచ్చావు?" అంటూ హుంకరించింది రాజకుమారి చంపాదేవి.

"నేను విష్ణుశర్మని. దుర్గమ్మ మొగుడిని" అని చెప్పాడు, విష్ణుశర్మ.

"సరే నేను వెళ్లిపోతున్నాను. నేను అవంతిదేశపు రాజకుమారి విద్యావతిని పడతాను. ఇంక అక్కడికి మాత్రం రాకు. వచ్చినా ప్రయోజనం ఉండదు" అని చెప్పి భూతం వెడలిపోయింది.

రాజకుమారి చంపాదేవి మామూలు మనిషయింది. అన్న ప్రకారంగా రాజుగారు విష్ణుశర్మకు అర్ధరాజ్యమిచ్చి, చంపాదేవి నిచ్చి వివాహం చేశారు. ఇక తన కష్టాలన్నీ తీరినట్లే అనుకున్నాడు విష్ణుశర్మ. కాని యింకో ఆపద వచ్చి పడింది.

అవంతిదేశపు రాజకుమార్తె విద్యావతికి భూతం పట్టింది. ఎవరూ నయం చేయలేకపోయారు. చంపాదేవిని విష్ణుశర్మ భూతంబారినుండి రక్షించాడని అవంతి రాజుగారు విన్నారు. విష్ణుశర్మని తనవద్దకు పంపమని మాళవదేశపు రాజుగార్ని



"బస్కీల బాబు"



దేనికోసం?

ప్రాధేయపడ్డారు. రాజుగారు అల్లుడిని వెళ్ళమన్నారు. విష్ణుశర్మకి వెళ్లక తప్పలేదు. తనజీవితం యింతటితో సరి అనుకున్నాడు. బయలుదేరాడు. ఒక ఉపాయం తట్టింది.

అవంతిదేశపురాజు విష్ణుశర్మని సగౌరవంగా ఆహ్వానించారు. రాజకుమార్తె వద్దకు వెళ్లాడు విష్ణుశర్మ.

“ఎవరు నువ్వు? నన్ను వదిలించడానికి వచ్చావుటరా!” అంటూ మీదికి వచ్చింది భూతం ఆవహించియున్న విద్యావతి.

“నేను విష్ణుశర్మని. దుర్గమ్మ మొగుడిని” అన్నాడు మెల్లగా.

“ఓరి, దుర్మార్గుడా! మళ్ళీ వచ్చావు! పోనీ అని దయ తలిస్తే అసలుకే మోసం వచ్చిందే. ఉండు. నీ జీవితం యివాల్టితో ఆఖరు” అంది భూతం.

“తొందరపడకు. నా గుఱించి నేను భయపడటం లేదు. నేను రాజకుమార్తెను పెండ్లిచేసుకుని సుఖాలు అనుభవిస్తున్నానని దుర్గమ్మకి తెలిసిందట. దీనికంతకీ కారణం నువ్వేనని గ్రహించి యిక్కడికి వస్తోందట. ఒక బండినిండా పెద్ద కఱ్ఱలతో వస్తోందిట. ఆ కఱ్ఱలన్నీ విరిగేదాక నిన్నూ, నన్నూ యిద్దరినీ కొడుతుందట. అప్పుడే ఈ వూరి పొలిమేరలదాక వచ్చిందట” అని తొణకకుండా చెప్పేశాడు, విష్ణుశర్మ.

ఈ మాటలు వినేసరికి హడలెత్తి పారిపోయింది భూతం. పాపం, తను తిన్న దెబ్బలు గుర్తుకివచ్చి ఉంటాయి. తన యుక్తి ఫలించినందుకు సంతోషించాడు విష్ణుశర్మ. ఇంకేముంది, అవంతిరాజ కుమారినికూడా పెండ్లాడి, యిద్దరు పెళ్లాలతో సుఖంగా కాలంగడిపాడు. విష్ణుశర్మ.



# ★ దగా పడిన తమ్ముడు ★

(31-వ పేజీ తరువాయి)

చీవాట్లు పెట్టాడట. నీ మొగుడికి ద్రోహం చేసినదానివి నాకు సెయ్యవా అని కోరికె వెళ్ళలీసిన మాటలు ఆడతాడట! ఆ యమ్మకి పచ్చవాతం-ఈ రాపులుతో అసలు మొగుణ్ని తల్చుకోని ఏడుస్తాదట! సావేనా వచ్చినాది కాదంటాడట. ఆడే సంగతో మరి. రాత్రుల్లు సరిగా పడుకోడట-పడుకున్నా యేదో పేలాపన! ఒకోనాడు ఎందుకో భయం భయం అనిపిస్తాదట-తప్పతాగేసి పడుకొంటాడట — అదిగో ఆ సమయంచూసి మనం యెయ్యాల కొటు!"

"అంత యెత్తు మేడఇంట్లో యెందరుంటారో వీలౌతాదా?" అన్నాడు పుల్లయ్య.

చంద్రయ్య నవ్వి "ఆ పిరికి వుంటే మనకు ఖతుకే లేదు. ఆకాసంమీద పడిపోతున్నా మనం అడ్డుతాం అన్నోడే యేమెనా యీ లోకంమీద సెయ్యగలడు. ఆ మేడ యేపు యెప్పుడైనా సూసావా?"

"ఓ యెన్నో సారు."

"సెప్పు. యెలాగ యెక్కుతావో?"

"అటు వేపు సంగు యిటు వేపు సందు. ముందు గోడ్డుమీద దీపం—అటు సందులో దీపం నేదుగానీ యిటు సందులో వున్నాదే—చిక్కే" అన్నాడు.

నేనంతా అప్పుడే పేనుయేసుకున్నాను. ముందు దీపం సందుదీపం బద్దలుకొట్టడం! పడమటి యేపు మూడో అంతస్తునుంచి నీళ్ళు పోడానికి రెండు సిమెంటు గొట్టాలు కిందదాకా వున్నాయి కొదా—సీకటిరాత్రి ఆ గోడ్డంట తొమ్మిద దాటితే యెవురూ తిరగరు—మంచి రాత్రిమీద యెక్కిపోవడం—చేసినపని చేసి రెండోపక్కనుంచి అలాంటివే మూడు గొట్టాలున్నాయి. నాలుగు మెట్లు దిగితే ఆ గొట్టాన్ని పట్టుకోవచ్చు. పట్టుకోని దిగిపోవడం సులభం—"

"ఇటు పక్కనుంచైతే?"

"వద్దు ఇటువేపు పెద్ద సందు...వచ్చినా రాతిరి పోలీసోలు తిరిగితే తిరుగుతారు... గప్పున దాగోడానికి అన్ని గుమ్మాలే యీలుండదు. అటు వేపు సందులో పెరటి గుమ్మాలు యేదోడ్లోనైనా దాగుండిగలం—"

"తలుపులు వేసిరా? అన్నాడు పులయ్య.

"నాను తీసానుకదూ? అలాగపోతే ఆ సందునుంచి రెండు మూడు సందులున్నాయి. యే సందునుంచి యెలిపోయినా సముద్ర పొమకే. వేసంగాలం మనలాంటోలు యెందరో పడుంటారు...ఇసికమీద పడుకున్నట్టు టక్కువేసిడమే......అంతా గేపకం వుంచుకోండి...ఆ సరియైన యేళకి నానే మీ యిళ్ళకి వస్తాను—"

మిగిలిన యిద్దరూ చంద్రయ్య చెప్పినట్లు అంగీకరించారు.

చీకటి రాత్రులు వచ్చాయి. అనుకోని పదిహేనురోజులైందిగానీ చంద్రయ్య వెళ్దామని అనటంలేదు. పుల్లయ్యకు చాలా ఆత్రుతగావుంది. ఎంతవేగిరం యీపని అయిపోతే తను మళ్ళీ నవిరి వెళ్ళిపోదామని కలలు గంటున్నాడు. మూడురోజులై పనిలేదని యింటిదగ్గిరే వుంటున్నాడు. రాత్రుళ్ళు కొడుకూ తనూ గడపలో పడుకుంటున్నారు. నీలి గదిలో పడుకుంటోంది.

ఆవేళ శనివారం. పొద్దున్ననుంచి పుల్లయ్యకు ఆందోళనగానే వుంది. యేమిటీ ఆలస్యమని చిరాకేస్తుతోంది. ఇదేదో అయిపోతే, తనవూరు వెళిపోదామని—నీలికి తనకూ తగువచ్చినా యెలాగో సర్దుబాటు చేసుకుందామని అనుకున్నాడు. తనవూరు యెంతగా మారిపోయిందో? తనూ యేదో చెక్కాముక్కా కొనుక్కొని మట్టిని నమ్ముకొని చెమటోడ్చి బ్రతికితే తానని— మళ్లీ అనుకున్న జన్మ తనకువసుందని యెన్నో విధాల అనుకున్నాడు. ఈ ఆశతో కూడుకున్న ఆలోచనలు ఈ ఆలస్యాన్ని సహించనివ్వకుండా చేస్తున్నాయ్. తను ఒంటిగా గడపలో పడుకోని యిటు అటు కదులుతున్నాడు. ఎదురుగుండా చెట్టు కొమ్మలు గాలికి కదులుతున్నాయి. కాలవకంపు ఘోరంగా వుంది ఏదోపిట్ట అగుపు వినటానికి పసందుగాలేదు. దూరాన్న రైలు కూత!

నీలి, ప్రక్కనవున్న ఇంటిగల అమ్మ వాకిట కూర్చొని ఆమె చెప్పున్న మాటలు వింటోంది. మలు అమ్మ ప్రక్కన కూర్చొని ఆమె చెప్పేమాటలు వింటున్నాడు. లోకాభిరామాయణం అయ్యాక విసిగెత్తిందేమో మలు అయ్య ప్రక్కకు వచ్చాడు. తండ్రీకొడుకులకు నిద్రపట్టలేదు. తండ్రికి భవిష్యత్తు ఆశాజనకంగా కనిపించడంచేత దాని విషయమై ఆలోచించుకుంటున్నాడు. కొడుకు పగటివేళ బాగా నిద్రపోయాడు. అంచేత నిద్దరరాలేదు.

మొగుడు యింట్లోలేడేమో, పిల్లికోసం యేడ్చిన ఆవిడ రానురాను స్వవిషయంలోనికి దిగింది. బహుశః ఆమెజీవితంలో యెవరికీ చెప్పరాని స్వవిషయాలు నీలితో గుటుగా గుసగుసలాడుతూ చెప్పుకుంటోంది— "నీలమ్మా! ఆమేల పిల్లి సచ్చిపోనేదు—నలుగురూ అని పోతారు నానే పిలినిసంపి, నాయేడుపు దానిమీద పెట్టి తీర్చుకున్నాననీ...నా మొగుడి సంగతి యేడాదికాలేదుగానీ...వచ్చి...నూ సన్నావుకదా! ఉతి ఆడదానికంటే అధ్వానం—నాను నోరెత్తితే పిల్లి నాగైపోతాడు. నువ్వు వున్న ఇంట్లో అద్దికి ఉండేవాడు...ఎవరూ నా అనేవోళువుండే వోరుకాగు—మొక్కలీసోడు—అయితే గడించుకోనేవోడు—అలాగే సుకపడేవోడు, తిండీ. తాగుడూ, ఒకటేంటి? వీధి వీదంతా నావంటె జడుస్తారా? అనేంటో ఆడివగర లొంగిపోనాను. ...తన్నేవోడు- ఆడుతన్నితే సుకమనిపించేది--మల్లా యెంతో సుకపెట్టేవోడు— అలాంటోడు సచ్చిపోతే—నానూ సచ్చిపోవాలనుకున్నాను - యెదవపేణం - తీపు - పిల్లిని దూరం దగిలేసి ఆదుఃఖం యేడిసి తీరుసుకున్నాను — నా సెప్పుడూ కళ్లంటనీరు తెచ్చుకోనేదు నీలమ్మా-

# ★ దగాపడిన తమ్ముడు ★

అప్పుడే అడొకలాగ పిచ్చిదాన్నయి పోయాను..."

నీలి యీ ఘోషవంతనూ విన్నది. అప్పటికే చాలా రాత్రయింది. "పడుకో నీలమ్మా—ఈ తిమనిషివి కావని" ఆవిడ లేచిపోయింది. నీలి గదిలోనికిపోయి పడుకున్నా మల్లువుండీ వుడిగీ అయ్యకు వేస్తున్న ప్రశ్నలు వింటూ వింటూ అలా నిద్రపోయింది.

కాలం దొర్లిపోతోంది. కానీ పులయ్యకు, కునుకురాలేదు. ఆ చెట్టు వేపుచూస్తున్న కొద్దీ బూచోడూ బంగారమే అగుపిస్తోంది. అతిలో ఆలోచనలు ఆల్లాడి పోతున్నయ్. కొడుకు మీద పడుకోని చిన్న చిన్న కూని రాగాలు తీస్తున్నాడు. తీస్తూ తీస్తూ వుండగానే వాడికి కండ్లు బరువెక్కి పోయాయి.

ఇంతలో పుల్లయ్య యింటి యెదరగా యిద్దరు నిల్చున్నారు. పుల్లయ్యకు వాళ్ళను చూడగానే ఆ ఆకారాలనుబట్టే పోల్చుకున్నాడు. సంతోషంతో లేవబోయి కొడుకును ప్రక్కకు వేస్తే వాడు లేచి పోయాడు. వాడ్ని మెల్లగా తట్టి లేచేసరికి లేచి వెంటపడగానే పుల్లయ్యకు పట్టరాని కోపం వచ్చింది—వాళ్ళని సైగచేసి నీలి యొక్కడ లేచిపోతుందనో మెల్లగా తిరిగి వచ్చి వాడిని వక్షంమీద వేసుకొని కాసేపు జోకొట్టినట్లుగా ఒళ్ళు తడిమాడు.

ఆ చిన్ని హృదయంలో అప్పుడే సంశయం పొడసూపింది—ఈ వేళ యెలాగైనా తనను అయ్యరానివ్వడని నిశ్చయించుకున్నాడు. ఆ రోజు రాత్రిలా అయ్య వెనకాలే మెల్లమెల్లగా అయ్యకు కనపడకండా అనుసరించాలని నిశ్చయించుకున్నాడే మో నిద్రపోతున్నట్లు నటించాడు. పుల్లయ్య కొద్దిసేపయ్యాక మల్లుని మెల్లగా పక్కమీద వేసాడు. కొడుకు నిద్రపోతున్నాడని నిర్ధారణ చేసుకున్నాక మెల్లగా లేచి అడుగులు ముందుకు వేస్తుంటే కొడుకు కళ్ళు తెరచి చూస్తున్నాడు.

అదిగో...ఆ రోడ్డుచివర! అయ్య ఆ యిదర్నీ కలుసుకున్నాడు. లేస్తే కనిపించి పోతానని యింకా అలా చూస్తూనే ఉన్నాడు. ముగ్గురూ కదిలి ఒకమూలకు చేరుకున్నారు. అక్కడ నిల్చున్నాక చంద్రయ్య గొణిగాడు. "తలుపుతీసుకొని ఏ డొక్కడే మేడమీద పడుకున్నాడు. ఇంటోవాళ్ళంతా పెళ్ళికి పోనారు. అంతా శ్రీగా వున్నాది. ఆడిదగ్గర పిస్తోలు వున్నాదట. ఒళ్ళంతా కళ్ళు పెట్టుకొనిపని సెయ్యాల. ఇలాగ ఏమిలేటప్పుడు యెవడైనా పోలీసోడడిగితే రెండో ఆట సినీమానించివస్తున్నాం సముద్రంపాడున పడుకోడానికి పోతున్నాం అని సెప్పాలి" తరువాత ముగ్గురి చేతులూ ఒకదాని మీద ఒకటి ఆన్చి "మన దినాలు బాగులేక మనలో యేఒక్కరు దొరికినా ఆదేముడు తోడుగా మిగతా యిద్దరిగుట్టూ పీక తెగినా సెప్పకూడదు" అని ముగ్గురూ ప్రమాణ స్వీకారం చేసారు. చంద్రయ్య ఇంకో విషయంకూడా చెప్పాడు. మిగతా వాళ్ళు వెంటనే దొరికిపోయిన వాడియింటికి వెళ్ళి పోలీసులు కొట్టినా తిట్టినా తమకేం తెలీదని చెప్పినట్లు చూడాలని దొరికినవాడు కూడా తను దొంగతనం చెయ్యలేదని చెప్పాలని మరి మరి చెప్పాడు.

ఇక ముగ్గురూ కాలుకదపటం యీ చిన్ని కళ్ళకి కనుపించాయి. అయ్యలో వున్న అన్న— చంద్రయ్యలను గుర్తుపట్టాడు. వారురోడ్డు మలుపు తిరిగారు. కంటికి ఆగపడలేదు! గబగబ లేచాడు—రోడ్డు చివరకు వెళ్ళి తొంగిమాసాడు—ముగ్గురూ అగుపించారు. అదిగో—చెత్తల డొక్కు—దొంగోని ప్రాకుతూ ఆ డొక్కుచాటునుంచి చూసాడు. అయ్య వెనుకకు చూసాడు. కాని, కొడుకు యిలా వచ్చాడనీ, యీ చాటున వున్నాడని యెలా తెలుసుకుంటాడు!—మళ్ళీ యింకోసందు...యీ సందు తనకు బాగా తెలుసు—యెన్నిసార్లో ఈ సందు త్రోవ తిరిగాడు...ఇక్కడే ఇదిగో ఆవీధిపిల్లలు గోళీకాయలు ఆట ఆడుకొనేవారు. తనూ చూసేవాడు సరదాగా. తన బడీ ఈసందులోనే కదా...వీధిలో చీకటిగా వుంది—వాళ్ళు వెళ్ళిపోవటం కాలవలో వంగి మరిచూసాడు—చీకటైనా ముగ్గురూ ఆగడం తనకు కనిపించింది—అలా కాలవ ప్రక్కనుంచే వడ్డివంచి నడిచాడు—అదిగో చెత్తలడబ్బా ఆచాటున కూర్చొని వంగి చూస్తుంటే ఆచుక్కల మిసమిస వెలుగులో ఆ తెల్లని గోడలు గలమేడమీదికి ప్రాకుతున్న మనుషులు స్పష్టంగా అగుపిస్తున్నారు. ఆశ్చర్యంగా రెప్ప వెయ్యకండా చూస్తున్నాడు. ఎక్కడలేని కోరికా తనను వుత్తేజపరుస్తోంది. అయ్యలాగ తనూ ఆ మేడపైకి యెగబ్రాకాలి—కానీ అయ్యకి తను అక్కడికి వచ్చావని తెలిస్తే...అమ్మతో ఆ సారి చెప్పితే కొట్టాడుకదా—అనకే మాటాడను అనుకొని అలా నోరుకటుకోని చూస్తున్నాడు.

ఇంతలో తనకు కుక్క అరుపు వినిపించింది. ఆ అరుపు వినిపించేసరికి చివరివాడు సగంవరకు యెగబ్రాకాడు. ఆగిపోయి మళ్ళీ యెగబ్రాకుతున్నాడు...

ఒక ప్లీడరు దొంగతనం కేసు ఒకటి తీసుకుని దొంగకు శిక్ష పడకుండా కేసు గెలిపించాడు. కోర్టు బయటకు వచ్చినతర్వాత దొంగ ఇలా అన్నాడు

"మీరుణం ఎలా తీర్చుకోవాలో తెలియడంలేదు ప్లీడరుగారు. తర్వాతవచ్చి మీ దర్శనం చేసుకుంటాను"

"ఫరవాలేదు. కాని తీరిక చేసుకుని కొంచెం పగలుపూట రా మా ఇంటికి" జవాబిచ్చాడు ప్లీడరు.

—బోసుబాబు

మేడ వీధివేపు వుండుండి బాబాయని అరుస్తున్న కుక్కకు బూచోడు "పడుకోరనాయనా!" అని అంటున్నా అరుస్తోంది. సగం నిద్దరనుంచి మేల్కొన్న బూచోడు ఇటూ అటూ తేరి చూసాడు...చీకటిగా వుంది. కుక్కతన దగరనుంచి ఒక్కగంతుగంతి అదే పనిగా అరవగానే బూచోడు లేచి దాని దగ్గరకు వచ్చాడు. మేడవేపు చూడగానే చివరివాడు మేడయెక్కి పోవడం చూసాడు. వెనువెంటనే కుక్క అరుపుతో బాటు "ఒరే శ్రీనీ దొంగలు దూరారురా... దొంగలురా...దొంగలూ—దొంగలంటూ" పెద్దకేకలు పెట్టసాగాడు. ఆ కేకలు కుక్క అరుపు శ్రీనివాసరావును మేల్కొల్పాయి. ఇంతలోనే! ఢన్ ఢన్ అన్న ప్రేలుడు శబ్దం వినిపించింది.

కొద్ది క్షణాలు అంతా భయంకరం అనిపించింది. మల్లుకూడా భయంవేసి ఆ చెత్తల డొక్కులోనికి దిగిపోయి దగ్గరకు ముడుచుకుని ఒకమూల కూర్చున్నాడు. అయ్యమళ్ళీ ఆ గొట్టం పట్టుకొని దిగిపోతాడేమోనని కళ్ళప్పచెప్పి చూస్తున్నాడు. ఆ డొక్కు ప్రక్కనుంచే మనుషులు పరగెత్తుతున్నప్పుడు వినిపిస్తోంది. ఎందరి గొంతుకలో వినిపిస్తున్నయ్. ఇంతలోనే లారీలు వచ్చే శబ్దం—అవన్నీ వింటుంటే ఆ చిన్నప్రాణం ఆ డొక్కులో యెవరికీ కనిపించకుండా చెత్తలో చెత్తై, మురికిలో మురికై—రెండు నక్షత్రాలులాంటి కళ్ళతో భువినుండి ఆకాశం వేపు చూస్తున్నది—ఆ కళ్ళు నిరీక్షిస్తున్న పనియెంతకీ జరగలేదు"—"అయ్య దిగలేదు. మా అయ్యరాలేదు...

అయ్య యెప్పుడొస్తాడు? మా అయ్య గానిది నాను కదలను!" అని ఆ చిన్న ప్రాణం బిక్కు బిక్కుమంటూనే పట్టుదల చూపుతోంది.

చాలాసేపటికి కోలాహలం తగ్గింది. మనుషులు తిరిగి వెళ్ళిపోతున్నారు. బూచోడూ, వుక్క గురించి చెప్పుకుంటున్నారు. దొంగలు గురించి యేదో అనుకుంటున్నారు కాని వాళ్ళకి యేమీ చెవిని పట లేదు. విన్న ముక్కలయినా అర్థం కాలేదు. "మా అయ్యని ఆయేళ కేషినిదగర అలా కొట్టేసి వారు—ఇక్కడా అలాగ సేసన్నారా? వాకెందుకుండి? మా అయ్యని కొట్నోలకి కరిసేస్తాను—యెలాను...యిప్పుడైతే...ఆ మేడయెక్క గలనా? ఎక్కితే మా అయ్య నన్ను చూసి యేల వచ్చినావని కొట్టడా? మా అయ్యకి యెవుడైనా కొట్టే అలిద్దరూ ఊరుకుంటారా?" ఇలా పరిపరి విధాల ఆ చిన్ని హృదయం ఆ చెత్తగృహంలోనే, ఒకప్రక్క కంటిరెప్పలు బరువెక్కుతున్నా ఓమూల కంపుతో ఒళ్లంత తెములుతున్నా ఆరాటం జెందుతోంది!

చూసి చూసి కన్నులు కాయలుకాసి పోయాయి- అంతా నిశ్శబ్దం ఆవరించింది. నల్లటి ఆకాశాన మిణుకుమనే చుక్కలూ —తనచుటూ రకరకాల వస్తు సముదాయంతో యేర్పడ్డ చెత్తయీ రెండే తోడయ్యాయి. చివరికి విసుగుజెందిన మనసుకు ఒక ఆలోచన తట్టింది. "అయ్య ఆతోవ యింటికి యెలిపోనాడేమో! లేకపోతే అలాగ ఓడదించడానికి యెలిపోనాడేమో యెళ్లి పొద్దులేసినదాకా చూస్తాను" అని అనుకొని మెల్లగాలేస్తూ చుట్టూ చూశాడు. అంతా చీకటిగా నిశ్శబ్దంగా ఉంది. భయపడి వచ్చినత్రోవ వెంబడే యింటికి పరుగెత్తాడు. గడపలో అయ్య లేడు. అలాగ అయ్యకోసం యెదురుచూస్తున్న కళ్ళు చాల సేపటికి గానీ మూతపడలేకపోయాయి.

(ఇంకా వుంది)

---

## "పెరల్ బక్"

(29-వ పేజీ తరువాయి)

...చేటేవారట. వారిసిద్ధాంతమే పెరల్ బక్ స్నేహితురాలి ప్రాణాలు బలితీసుకుంది. ఆ అమ్మాయి పూర్తిగా చావకపోయినా, ...లవంతంగా చంపింది వారిసిద్ధాంతం.—

ఒకసారి పెరల్ బక్ నిద్రపోతూండగా అర్ధరాత్రి ఎవరో తలుపు తట్టారు. తలుపు తీసి చూస్తే ఆవూళ్ళోనే కొత్తగా ప్రాక్టీసు పెట్టిన అమెరికన్ డాక్టరు. గుమ్మంలో నిలబడివున్నాడు. నాలుగువీధుల అవతల ఎవరో బీదయింటి కోడలుకు కష్టపు కాను పట. మంత్రసానివల కాలేదట. తెల్లడాక్టరంటే మనసులో చైనీయులకు నమ్మకం లేకపోయినా, చావుబ్రదుకులమధ్యవున్న భార్యను బ్రదికించుకోడంకోసం ఆ వూర్లో వున్న ఒక్కగానొక్క అమెరికన్ డాక్టరు సహాయాన్ని అర్థించాడా అమ్మాయి భర్త.

అసలే చావుబ్రతుకుల్లో వున్న మనిషి, తను వెళ్ళి ఆపరేషన్ చేసే లోపుగానే చనిపోతే అమెరికన్ డాక్టరు చంపేశాడంటారనే భయంతో చైనీయులభాష తెలిసిన పెరల్ బక్ ని మధ్యమాట్లాడ్డానికీ, నర్సు లేనందువల్ల, నర్సుగా కూడా కొంచెం సహాయపడ్డానికీ స్వజాతీయురాలైన పెరల్ బక్ ను కోరాడా డాక్టరు.

పరాయి దేశంలో స్వజాతి వాండ్లు ఒకళ్లిద్దరువున్నా చాలు ప్రాణాలు యిస్తారు ఒకళ్ళకోసం ఒకళ్లు. వాండ్లే స్వదేశంలో వుంటే కొట్టుకు చస్తారు.

వెంటనే పెరల్ బక్, డాకర్ వెంట గుడ్డి లాంతరు వెలుతురులో నాలుగు వీధుల అవతలవున్న చైనీయుల ఇంటికి నడిచివెళ్ళిందా అర్ధరాత్రి పూట.

### బాధగాధ

గాలీ వెలుతురూ లేని, ఒక చిన్న గదిలో చిన్న మంచంమీద, ప్రసవవేదనతో అప్పటికే సగం ప్రాణంపోయిన ఆ యింటి కోడలు పడుకొని ఉంది. ఆమెపక్కనే మొరటుగా పురుడుపోయబోయిననడివయసు మంత్రసాని భయపడుతూ నించుని వుంది - సాధారణంగా చైనాలోని పల్లెటూళ్లలో మంత్రసానిచేత కానంత కష్టపు కానుపైతే, కనలేని ఆయిల్లాలిని అమ్మలక్కలంతా రాళ్ళిపోస్తారట; అటు ఏడుతరాలూ, యిటు ఏడుతరాలూ తామెరగని తెల్లడాక్టరు, కోడలు పురుడు పోయడానికి రావడం చూచిన అత్తగారు కళ నీళ్ళు పెట్టుకుంటూ చుట్టూ చేరిన అమ్మలక్కల దగ్గర కోడల్ని తిట్టిపోయడం మొదలెట్టిందట.

డాక్టరు ఆ అమ్మాయిని పరీక్షచేసి మంత్రసాని మొరటు ప్రవర్తనవల్ల బిడ్డ కడుపులోనే చనిపోయాడనీ వెంటనే ఆపరేషన్ చేసి బిడ్డను తీయకపోతే తల్లి ప్రాణంకూడా దక్కదనీ చెప్పాడు—కాని తను ఆపరేషను చేసిన తర్వాత కూడా తల్లిప్రాణం దక్కకపోతే తను బాధ్యుణ్ణి కానని, అందుకు సమ్మతించితేనే ఆపరేషన్ చేస్తానని అన్నాడు. ఆ విషయాన్నే చైనీయుల భాషలో పెరల్ బక్ ను ఆ యింటివాళ్ళకి చెప్పి వాళ్ళ ఒప్పందం తీసుకోమన్నాడు—పెరల్ బక్ చెప్పింది.

"అపరేషన్ చేయకపోయినా ఆ అమ్మాయి చనిపోతుంది. సరేనా?" అన్నది.

"సరే" అన్నారు అత్త, ఆ అమ్మాయి భర్తా అందరూ.

"ఆపరేషన్ చేసి తెల డాక్టరు మా కోడల్ని చంపాడని అనకూడదు తర్వాత..."

"అనం" అన్నారు వాళ్లు. (సశేషం)

---

# అరువు సొమ్ము

(16-వ పేజీ తరువాయి)

ట్యూషన్లు చెప్పి పొద్దుపోయి యింటికి వచ్చేవాడు. ఈ విధంగా కష్ట పరంపరలను యెదుర్కొంటూ అతి జాగ్రత్తగా గడుపుతూ వచ్చినా వీరన్న బాకీ తీర్చేసరికి మూడు నాలుగు సంవత్సరాలుపైగానే గడిచింది. చిట్టచివరకు అతి కష్టంమీద బాకీ తీరిపోయింది.

కాని, ఆ యిద్దరు యెంతో మారిపోయారు. మూడు నాలుగేండ్లలోనే యెంతో ముసలివారు అయిపోయారు. తరువాత రంగారావుకు హైద్రాబాదు ట్రాన్స్ఫర్ అయింది.

ఆ రోజు ఆదివారం. సాయంకాలం ఆరుగంటలు అవుతుంది. 'సరోజినీ' అనే పిలుపు విని వెనుదిరిగి కనుపించిన ముసలి మనిషిని చూసి నిర్ఘాంతపడి నివ్వెరపోయి చూస్తూ నిట్ట నిలవున నిల్చొనిపోయింది సరోజిని పబ్లిక్ గార్డెన్సులో.

"అలా చూస్తావేం సరూ? నేనే అరవిందను."

"ఆ...అరవిందా? అదేంటి అరూ అలా మారిపోయావేం?

నిన్నుచూసి మూడు నాలుగేండ్లు అయిందేమో? యింతలో అంతమార్పా? ఏమిటి విశేషాలు. రా" అంటూ అరవిందను ప్రక్కనేవున్న కాంటీనుకు తీసుకొని వెళ్ళింది.

వేడి వేడి కాఫీ చప్పరిస్తూ "ఏమిటి అరూ చెప్పు యిలా మారిపోయావేం?" అని ప్రశ్నించింది సరోజిని ఆతురతతో.

"నిజం చెప్పనా సరూ? నా యీ మార్పుకు నీవే కారణం."

"నేనా?" త్రాగుతూన్న కాఫీ కప్పును అలాగే విడిచేసి అర్థంకాని ఆశ్చర్యంతో ప్రశ్నించింది సరోజిని.

"అవును నీవే సరూ!" అంటూ తాను సరోజిని దగ్గరనుండి చంద్రహారం పుచ్చుకొన్నది మొదలు అప్పటివరకు జరిగిన సంఘటనలు అన్నిటిని క్రమంగా చెప్పుకు వచ్చింది అరవింద.

"ఒసే. ఎంత చిత్రంగావుంది? నేను నీకు యిచ్చిన చంద్రహారం అసలు బంగారంది కాదు. పైన బంగారపు గిల్టు. నాకు మాత్రం యేం తెలుసు? నేను నీకు యిచ్చిన హారాన్నే నాకు తిరిగి యిచ్చివేశావనుకొన్నాను"

"ఆ. అలాగా" అంటూ ఆశ్చర్యంతో కిటికీగుండా అప్పుడే నాంపల్లీ స్టేషన్ వైపుకు నడుస్తూన్న రైలు బండిని చూస్తూ అలాగే కుర్చీలో కూర్చొనిపోయింది అరవింద!



(మొపాసా అనుసరణ)

ఫ్లోర్‌లో పెళ్ళికూతురు (విజయా స్టుడియోలో 4వ)ఫ్లోర్ వదలివెళ్ళి ఆరుబయట ఓ కుర్చీలో కూర్చుని, 'ఏ అబ్బ' అంటూ ఉడకపోత గురించి తన అభిప్రాయం వెల్లడించి, మెడ వెనక్కివాల్చి నీలాంబరంలోకి దృష్టి సారించింది. చుట్టూ కుర్చీలలో నాగేశ్వరరావు, 'చెంచులక్ష్మి' డైరెక్టరు బి. ఎ. సుబ్బారావు, 'సాహిణీ' సహనిర్మాత భావనారాయణ, ప్రభాపొడక్షన్స్ జెనర్లకబుర్లు చెప్పుకుంటున్నారు. ఆ కుర్చీలో 'అమ్మాయి' కబుర్లు వింటోంది కాని పోర్షన్ లేక కొన్నాళ్లు డైలాగులు చెప్పటంలేదు. నక్షత్రాలను లెక్కపెడుతూ ఉందని ఎవరన్నా సంజాయిషీ చెబితే నమ్మొచ్చు.

కాని ఆ 'అమ్మాయి' మాటతీరు, అతి ప్రయత్నంమీద మెల్లిగా మెడ పైకెత్తి

# వార్తావరణం

"జడ బరువు" అంది టూకీగా.

'అసలే ఏడు మల్లెపూల ఎతు సుకుమారిని అలా మొయ్యలేనంత పెద్దవాల్లడ ఎవరు వేసుకోమన్నారు' అన్నాడు నాగేశ్వరరావు.

'మల్లెపూల జడేగా అంచేత బరువుండ కూడదే.' అన్నారు మరొకరు.

"ఇవి మల్లెలుకావు. గులాబ్...గులాబ్‌కి మనవెంపున ఏమంటారండీ...అదేవో అంటారు. గులాబ్ పూలు చాలా బరువు. గజ న్నర జడ మొయ్యాలి." అంది అమ్మాయి మెడ ఎత్తకుండానే, అలా ఆకాశంలోకి చూస్తూ.

'అలా అవస్థ పడకపోతే, ఆజడకీ ఓకుర్చీ వేసి మర్యాద చేయించరాదూ' అన్నాడు నాగేశ్వరరావు...దగ్గరో ఉన్న ఓ పెద్ద మనిషి, అమ్మాయి గులాబ్ జడకోసం ఓ



జలరుహా వారి 'రాజనందిని'లో రామారావు, అంజలీ దేవి

క్రీ వేసి, జడని అందుమీద కూర్చో టారు.

అమ్మయ్య అంది ఆ అమ్మాయి నిటారుగా కూర్చుని. ఆ అమ్మాయి పేరు అంజలీదేవి అయినా, అమ్మాయి అనే అంతా పిలుస్తారు.

“అందుకనే మా పిల్లలికి ఎప్పుడూ గులాబ్ పూలజడ వెయ్యను...వాళ్ళసలే మొయ్యలేరు. ఏమల్లెలో పెట్టి వేసాం” అంది అంజలీదేవి. ప్రస్తుతం, ఆమె ప్రత్యేకం సరదా పడిగాని, పిల్లలికి తన బలం శక్తి సామర్థ్యాలు చూపాలనిగాని గులాబ్ పూలతో మణుగుజడ వేసుకో లేదు, ప్రభా ప్రొడక్షన్స్ వారి ఆడపెత్తనం చిత్రకథలో అమ్మాయి సంరక్షకులు పట్టుబట్టి ఈజడ వేయించారు. పెళ్ళికూతురులా ముస్తాబు చేశారు. కథ బలీయం కాకపోతే, వాళ్ళకి వచ్చిన పిల్లాడికిచ్చి ముచ్చటగా పెళ్ళిచేసేస్తారు కూడా. కాని ఆకథలో అమ్మాయికి, అచ్చు ‘సినిమా నాగేశ్వరావులా’ ఉన్న అబ్బాయిమీదఅపారమైనఅనురాగం. అతన్ని తప్ప ఒరులను కన్నెత్తి చూడదు. అలాటి సందర్భాలలో పెద్దలు మామూలుగా, అతను తప్ప ఒరు లెవ్వరైనా ఫరవాలేదంటారు. ఇలాటితబావతులు వచ్చిపడితే అమ్మాయిలు, అబ్బాయిలు, గత్యంతరం కనబడక ఆత్మహత్యకు మార్గాలు మార్గాంతరాలు పరిశీలిస్తారు.

* * *

కథలో అమ్మాయి, మూర్తీభవించిన శోక దేవతలా, ఊరి శివారున రావిచెట్టు నీడన ఉన్న సుబ్రహ్మణ్యేశ్వరస్వామి దగ్గరకు వెళ్ళి మొఱపెట్టుకుంది. ఆయన విని, గంభీర ముద్ర దాల్చాడు.

“నాకు నచ్చని వాడిచేత పుస్తెలతాడు కట్టించుకోవడం కన్న ఉరివేసుకు ఇక్కడే చనిపోతాను. నీపాదాల దగ్గరే ప్రాణాలు అర్పిస్తాను’ అంది పెళ్లికూతురు.

అయినా స్వామి తటస్థంగా ఉన్నట్టు, నటించాడు. అమ్మాయి దేవుణ్ణి బెదిరించడానికి, జబాయించడానికీ రాలేదు. ఆయన కాదని ఓ ముక్క వదిలేసి మరీ పోదామనుకుంది. చెప్పేసింది కాబట్టి, హారతి పళ్లెం మంటకి చీరచెంగు అంటించి ఆహుతి కావడానికి సిద్ధపడింది.

* * *

దేవుడు చూట్టానికి—ముఖ్యంగా కష్టాల్లో ఉన్న వాళ్లకి—కఠినుడుగా (రాయి తిష్ఠ వేసినందు వల్లనే కాదు) కనబడతాడు. ఆయన అంటే గిట్టనివాళ్లు, అవునూ కాదూ అని స్పష్టంగా చెప్పడానికి తటపటాయించే రాజకీయ నాయకుడినిసామ్యం తెస్తారు. కాని దేవుడు చెయ్యదలచుకున్నది చేసాడట. ఎటొచ్చీ ఆసంగతి చెప్పడు. ఈ సంగతి తెలిసినవాళ్లు ఆగుతారు. లేని వాళ్లు ఈకథలో అమ్మాయిలా నాలుగొందలరూపాయలుచేసే చీరని హారతిచ్చి, ప్రాణాలు నైవేద్యం పెట్టేయబోతారు. కాని అది అసాంతం జరగదు. ఈకథలోనూ జరిగినట్టు(చూసిన వరకూ)తోచదు. ఎందుకంటే, అమ్మాయి చెంగు అంటించేవరకూ ఆమెను ప్రేమించిన అబ్బాయి చెంగున గంతేసి, మంటలార్పి ‘కమలా మతి పోయిందా’ అన్నాడు. అమ్మాయి అతన్ని కౌగలించుకుని భోరున ఏడిచింది. అబ్బాయి ఆమెకురులు నిమిరి, ‘భయపడకు’ అని సముదాయిస్తున్నాడు.



ఆర్. ఆర్. పిక్చర్స్ వారి ‘కార్తవరాయుని కథ’ చిత్రంలో గిరిజ.

‘ఇంక చాలిండిసార్. కట్’ అన్నాడు దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు.

అమ్మాయి, నాగేశ్వరరావు పకపక నవ్వారు.

‘ఇంకో టేక్ తీసుకుందాం’ అన్నాడు సుబ్బారావు.

‘ఎందుకూ’ అంది అమ్మాయి సుతారంగా.

చీర బాగా అంటుకోలేదుగా...అంటుకోని చీరని ఈ అబ్బాయి అతి సాహసంగా ఆర్పేయడం బ్రహ్మాండంగా ఉండదు.

* * *

‘అయితే ఓ చిన్నదానా! చీర కాలకుండానే ఎలా చచ్చిపోదామనుకున్నావూ? దేవుడిదగ్గర ఉత్తుత్తి నాటకమా’ అన్నాడు నాగేశ్వరరావు ‘చెంచులక్ష్మి’లో ప్రసన్న నరసింహుడిలా పెంకెగా.

‘అయితే, ఓ చిన్నవాడా! చీర కాలకుండానే ఎలా ఆర్పబోయావూ.” అంది అమ్మాయి అంజలీదేవి వెటకారంగా.

“చీరకాలకుండా ఆర్పబోలేదు; ఆపబోయాను” అన్నాడు నాగేశ్వరరావు చమత్కారంగా.

* * *

రెండో టేక్ కు సిద్ధమయే వరకు డైరెక్టరు సుబ్బారావు ‘బర్నాల్’ ఆయింట్‌మెంట్ డబ్బా తెప్పించి, ‘ఇది చేతులకు రాసుకోండి. లేకపోతే చేతులు కాలవచ్చు’ అన్నాడు.

‘నాకు ఈ హంగులక్కర్లేదు. చెయ్యి ముద్రముంటే మరీ మంచిది...” అన్నాడు,



'ఆడపెత్తనం'లో కన్నాంబ, సూర్యకళ, కుటుంబరావు.

నాగేశ్వరరావు.

తోడివారు నచ్చచెప్ప చూశారు గాని ససేమిరా అన్నాడు నాగేశ్వరరావు.

*   *   *

ఈ సారి చీర బాగా అంటుకుంది.

'కమలా!' అంటూ పరుగెత్తి వచ్చాడు అబ్బాయి. వస్తూనే, చెంగు మండుతున్న చోటుకు ఓ అంగుళం పైన దొరకపుచ్చుకొని —అసలితరులో అనుకోకుండానే అంతా ఎలా చేస్తారో అలాగే—ఒక్క సారి ఝాడించే సరికి తుణారంలో మంట ఆరింది; ఉత్తరార్థంలో నాగేశ్వరరావు ఆ చెంగును నలిపి పూర్తిగా నిప్పును ఆర్పేశాడు.

అమ్మాయిని కౌగిట్లో పొదువుకున్నాడు. ఆమె ఘోగునవిడిచింది...డైరెక్టరు తృప్తిగా కట్ అన్నాడు.

*   *   *

"అబ్బా ఏమి ఎండలు. వీటికి తోడు గాడుపు" అన్నాడు నాగేశ్వరరావు మళ్ళీ ఆరుబయట కూర్చొని.

వచ్చే ఏడాదినుంచి మే నెల అంతా సెలవు తీసుకొని, చల్లని పట్నన ఉండ దలచుకున్నా నన్నాడు. సినిమా నటులకి ముఖ్యంగా వేసవిలో పగటిపూట పని చేయడం మహాయాతన. బయట ఎండకి తోడు స్టుడియో షెడ్ మూలాన లోపలా అంతకన్న ఉడికిపోతుంది. ఇదికాక, హైపవర్ దీపాలసెగ అదనపు వినోదం.

*   *   *

1960 నాటికి తీరుబాటు తీసుకుని విదేశ యాత్రలకు బయల్దేరి వెళ్ళదలచుకున్నట్టు కూడా నాగేశ్వరరావు మాటల సందర్భంలో చెప్పాడు.

'హీన పక్షం ఆర్నెల్లు తిరగ దలచుకున్నాను. గవర్నమెంటువాళ్లు అనుమతించే ఖర్చుతో మొత్తం భూగోళాన్ని పొదుపుగా ఒక ప్రదక్షిణం చేయవచ్చునను కుంటాను' అన్నాడతడు.

ప్రభావారి ఆడపెత్తనం దాదాపు పూర్తి అయినట్లే. ఆదుర్తి సుబ్బారావు దర్శకత్వాన తయారవుతున్న ఈ చిత్రంలో అంజలీదేవి, నాగేశ్వరరావు, సూర్యకళ, కన్నాంబ, రేలంగి, కుటుంబరావు మొదలగువారు నటిస్తున్నారు. రచయిత పినిశెట్టి.

సంగీత దర్శకుడు రాజేశ్వరరావు. నిర్మాత బెనర్జీ.

అగ్రశ్రేణి తారాగణంతో రూపొందుతున్న జలరుహావారి 'రాజనందిని' జులై నాలుగున విడుదలకాబోతోంది. మల్లాది రామకృష్ణశాస్త్రిగారు కథ, మాటలు పాటలూ వ్రాశారు. ఎన్ టి. రామారావు, అంజలీదేవి, జి. వరలక్ష్మి, గిరిజ, గుమ్మడి, రేలంగి, ఆర్. నాగేశ్వరరావు, మహంకాళి వెంకయ్య మొదలగువారు పాల్గొన్నారు. సంగీతం టి. వి. రాజు సమకూర్చారు. దర్శకుడు వేదాంతం రాఘవయ్య.

## మంచిరోజులు

కృష్ణచిత్రవారి 'మంచిరోజులు' చిత్రం నిర్మాణానికి, ప్రసిద్ధ నటుడు శ్రీ సి. ఎస్. ఆర్. ఆంజనేయులు జూన్ 12న వాహినీలో



"హలో! మా గుర్నాథం విమలాపురం వెళ్లాడని నీ కెలా తెలుసు?" అని దబాయిస్తున్నారు కాప్టెన్ ఆంజనేయులు (డా॥ శివరామకృష్ణయ్య) ఆశ్చర్యంగా రావుబహద్దర్ గంగాధరం (సి. ఎస్. ఆర్.) చూస్తూవుంటే తికమక జవాబేదో చెప్తున్నాడు "ధన్" (రమణారెడ్డి) —రిపబ్లిక్ వారి హాస్యచిత్రం "పెళ్లిసందడి"లో ఒక చిన్ని సీను.

ప్రారంభోత్సవం జరిపారు. ఈ చిత్ర ం నిర్మాత శ్రీ పి. ఎ. పద్మనాభరావును, సహోద్యోగులంతా అభినందించి శుభాకాంక్షలు తెలిపారు. పద్మనాభరావు, నిర్మాతగా, కథా రచయితగా ఆంధ్రప్రేక్షకులకు 'అక్కా చెల్లెళ్ళు' (కల్యాణీ పిక్చర్స్) ద్వారా పరిచితుడు. ఈ చిత్రానికి ఇప్పుడు దర్శకత్వం నిర్వహిస్తున్నారు. రచయితలు శ్రీశ్రీ, ఆరుద్ర. సంగీత దర్శకుడు పెండ్యాల.

తొలిరోజు చిత్రించిన సన్నివేశంలో రమణ (ఎం. ఎల్. ఎ.) మూర్తి, మాలిని పాల్గొన్నారు. ఆ రోజునుండి 25 వరకూ వరసగా ఆ సెట్ పై నిర్మాణం సాగించారు. ఛాయాగ్రహణం వేదాంతం చిదానందం. కళాదర్శకుడు శ్రీ మణి.

'మంచిరోజులు' చిత్రంలో సి. ఎస్. ఆర్, నాగభూషణం, రమణారెడ్డి, కుటుంబరావు, అల్లురామలింగయ్య, బొడ్డపాటి, సరోజిని మొదలగువారు ప్రముఖపాత్రలు నిర్వహిస్తున్నారు.

## హిందీ 'సువర్ణ సుందరి'

రజతోత్సవాలు జరుపుకొన్న 'సువర్ణసుందరి' చిత్రం, "ఏఆర్భాటం లేకుండా" మద్రాసులోని వీనస్ స్టుడియోలో హిందీలో తిరిగి తయారవుతోంది. ఆర్భాటం ప్రచారంలో కనిపించక పోయినా, చిత్రంలో పుష్కలంగా ఉంటుందనడానికి సందేహం లేదు. కారణం వేదాంతం రాఘవయ్యగారు. బ్రహ్మాండమైన సెట్లమీద అంజలీదేవి ప్రభృతులు పాల్గొన్న నృత్యం ఒకదాన్ని ఆయన ఇటీవల చిత్రించారు. ఛాయాగ్రహణ దర్శకుడు ఎం. ఎ. రెహమాన్. ఇటువంటి నృత్యాలు ఇందులో ఆరు ఉన్నాయని చెప్పారు. నిర్మాణంగా దాదాపు పూర్తి అయినట్టే.

నాగేశ్వరరావు, అంజలీదేవి ముఖ్యపాత్రధారులు. శ్యామ, కుంకుం, ఆగా, బి. ఎస్. జోహార్, రాధాకిషన్, ధుమల్, నిరంజన శర్మ, సప్రూ, బాలనటి డెయిసీ ఇరానీ, మొదలగువారు పాల్గొంటున్నారు. మాటలు విష్ణు మిత్రహోత్రా, పాటలు భరత్ వ్యాస్ వ్రాశారు.

నిర్మాత ఆదినారాయణరావే, దీనికి సంగీతం సమకూర్చారు.

అక్టోబరు నెలలో ఈచిత్రాన్ని రాజశ్రీ క్చర్స్ వారు దేశవ్యాప్తంగా విడుదల చేస్తారు.

## ప్రసాద్ కొత్తచిత్రం

దర్శక నిర్మాత ఎల్. వి. (శారద) ప్రసాద్ గారు జూలైలో తమ రెండవ హిందీచిత్రం నిర్మాణం ఆరంభించబోతున్నారు. పేరు 'ఛోటీబెహన్'. రచయిత ఇందర్ రాజ్ ఆనంద్.

బల్ రాజ్ సాహ్నీ, రెహమాన్, మహమూద్ ఇందులో ముగ్గురన్నదమ్ములుగా నటి



















జపాన్ పర్యటననుండి తిరిగివచ్చిన రామకృష్ణ. భానుమతికీ ఆయనకూ మధ్య నున్న బాలుడు వారి కుమారుడు భరణి.

శ్రీ రామకృష్ణ నివేదిక :

# ★ జపాన్‌లో ఫిలిం పరిశ్రమ ★

“ఎవరిమీద ఎవరికి ఎక్కువ గౌరవమో నాకు గట్టిగా తెలీదుగాని మొత్తానికి జపాన్‌లో ఇనుడూ, ప్రతి జనుడూ కూడా తెల్లవారుఝామున నాలుగున్నర గంటలకే మేలుకుంటారు.” అన్నారు భరణీ అధిపతి, దర్శకనిర్మాత శ్రీ పి. ఎస్. రామకృష్ణరావు తమ జపాన్ యాత్రా విశేషాలు చెబుతూ.

జనులకు మటుకు కష్టించి పనిచేయడంపట్ల గురి, గౌరవం, మక్కువా ఎక్కువ. ప్రతి వాళ్ళూ సగటున రోజుకు 18 గంటలు పని చేస్తారు. వేళచాలదని, బాగుండదనీ కాబోలు సూర్య భగవానుడూ నాలుగున్నరకే డ్యూటీలోకి వస్తాడు అన్నారాయన నవ్వుతూ.

జాపనీస్ వాణిజ్యప్రముఖుడు, శ్రీ షిరో కిడో అతిథిగా 18 రోజులు ఆ దేశంలో ఈయన పర్యటించారు. హాలాల దగ్గర్నుండి కలాలదాకా వివిధ రంగాలలో అక్కడి వారి జీవన విధానాలూ వారి దృక్పథాలూ, విలువలూ, కార్యదక్షత, క్రమశిక్షణ, వారి సౌందర్య పిపాస మొదలైన వివిధ విషయాల గురించి, సాధ్యమైనంతవరకూ సకలమూ కనీ, వినీ తెలుసుకువచ్చిన రామకృష్ణ, “జపాన్ గురించి ఏం చెప్పను? ఎంతని చెప్పను. అది చాలాగొప్పజాతి, గొప్పదేశం. ఆ దేశాన్ని వర్ణించడం స్వర్గసీమను వర్ణించడమే అవుతుంది... అతిశయోక్తి కాదిది.” అన్నారు...

## పొలాల విలువ

...జపాన్ చాలా చిన్నదేశం జనాభా ఎక్కువ. అందుకని, వారికి భూమి విలువ బాగా తెలుసు. ఒక్క అంగుళంమేరకూడా వృథా చెయ్యరు. రైల్వేలైనుకి గజందూరం దాకా పొలాలు ఉంటాయి. పల్లెలూ పట్నాలూకూడా అతిశుభ్రంగా ఉంటాయి. ఏది ఎక్కడ ఉండాలో అక్కడే ఉంటుంది. గొడ్లు, బద్ధకస్థులూ బేఖాతరీగా తిరగడం మనకి ఎక్కడా కనబడదు. ఇళ్ళు కూడా ‘తీరుగా’ అందంగా ఉంటాయి. ఎక్కువగా కర్రతో కట్టినవే. చక్కని వర్ణ చిత్రాలతో ప్రతి గోడనీ అలంకరించుకుంటారు. స్త్రీలు అందరూ, మన దేశంలో గృహిణులలాగానే, నిండుగా, గౌరవభావం కలిగించేవిధంగా ఉంటారు. జపాన్ లో పిల్లలగురించి చెప్పుకోవడానికి, చెర్రీబ్లాసమ్ పువ్వులనుమానే చాలు. అంత స్వచ్ఛంగా చక్కగా ఉంటారు అంతా బడికి వెళ్తారు. ఆ దేశంలో నూటికి 95 మంది చదువుకున్నవాళ్ళే. ఎటొచ్చీ డిగ్రీ చదువులు అందరూ చదవరు. వాటికి ఖర్చు జాస్తి. చాలామంది వృత్తులు—వీ ఇంజనీరింగో, నేర్చుకుంటారు.

జపాన్‌లో ప్రయాణ సదుపాయాలు ఎక్కడా తంటాపెట్టేందుకు వీలులేకుండా ఉంటాయి. అవన్నీ ప్రయివేటు యాజమాన్యాన నడుస్తాయి. రైళ్లు దగ్గరనించీ. అంచేత సహజంగానే పోటీఉంటుంది. దానివల్ల ప్రయాణీకులకు సదుపాయాలు హెచ్చుగా చేస్తారు టోకరా యివ్వడం ఎక్కడా లేదు. యాత్రికులకు క్షణాల మీద అభిమాన పాత్ర మయిపోతుంది జపాన్ అన్నారు రామకృష్ణ.

## సినిమా వార్తలు

స్తారు. కుమారిసందా వాళ్ళ ఛోటేబెహన్. శ్యామ రెహమాన్‌గృహిణి. శుభాఖోటే మహమూద్‌కు జోడా. జోకర్ రాధాకిషన్. వీరుకాక మరో ముఖ్యపాత్రను ధుమల్ నిర్వహించవచ్చు.

ఛాయాగ్రహణ దర్శకత్వం ద్వారకా దివేచా నిర్వహిస్తారు.

పాటలు హస్రత్ శైలేంద్ర వ్రాస్తారు.

వాటికి శంకర్ జైకిషన్‌లు సంగీతం సమకూర్చుతారు. ★

## ఫిలిం 'పొలం'లో

చలనచిత్ర పరిశ్రమ గురించిమాట్లాడుతూ, మన చిత్రాలకీ వాళ్ళ చిత్రాలకీ పోలిక లేక పోయినా స్టుడియోలుమాత్రం దాదాపు ఒక్కలాగే ఉంటాయన్నారు. అక్కడ సాలుకు ఆరువందల చిత్రాలు తయారవుతాయి. మరి నాలుగువందలు విదేశాలనుండి వస్తాయి. టోక్యోనగరంలో నాలుగు స్టుడియోలు ఉన్నాయట. పాత రాజధాని క్యోటోలో ఒకటి ఉంది. ఒక్కొక్క స్టుడియోలో ఏడెనిమిదినుండి పది ఫ్లోర్‌లు ఉంటాయి. దీనికి గచ్చునేలలేగు చెక్కతో ప్లాట్‌ఫారం వేసి దానిమీద సెట్ కడతారు. వాటికి కాయితం, ప్లైవుడ్, డీలీవుడ్ వాడతారు. ఒక్కొక్క స్టుడియోలో హీనపక్షం వెయ్యిమంది పనిచేస్తారు. జపాన్‌లో స్వతంత్ర నిర్మాతలు కొద్దిమందే ఉన్నారు. చిత్రాలన్నీ స్టుడియోల పరంగానే తయారవుతాయి. నటులూ టెక్నీషియన్‌లూ కూడా స్టుడియో ఉద్యోగులుగానో కాంట్రాక్టు పనివారుగానో ఉంటారు. అందువల్ల స్వతంత్ర నిర్మాతలుకూడా ఏదో ఓ స్టుడియోతో కలసే చిత్రం తీస్తారు. మనలా, అక్కడ 'స్టార్ సిస్టం' లేదు. నటులు, తమ యిష్టంవచ్చినన్ని చిత్రాలలో నటించరు. ఫ్రీలాన్సింగ్ లేదన్నమాట. పెద్ద నటులు పుచ్చుకునే మొత్తంకూడా పదివేల రూపాయలకు మించదు. నటీనటులు వేళకు షూటింగ్‌కు రాకపోవడం వంటి ఇబ్బందులు లేవు.

## ముడి ఫిలిం 'కట్'కటలేదు

"నేను చాలామంది పనివారితో, కళాకారులతో మాట్లాడాను. ఎవ్వరూ వర్తమాన స్థితిగతులను గురించికాని, తమ పనిగురించికాని అసంతృప్తి వెల్లడించలేదు. అందరూ చాలా హుషారుగా ఉంటారు. జపాన్‌లో డైరెక్టర్-ప్రొడ్యూసర్‌లు లేరు. దర్శకుడు అయినవాడు నిర్మాత కావాలని ఎన్నడూ ప్రయత్నించడు.

జాపనీస్ స్టుడియోలలో వాడే పరికరాలు ఎక్కువగా ఆ దేశంలో తయారైనవే. కొన్ని అమెరికానుండి వస్తాయి. కామెరాలు, శబ్దగ్రహణ యంత్రాలు, కలర్ ఫిలిం తప్ప మరేమీ దిగుమతి చేసుకోరు. మామూలు ఫిలిం పుష్కలంగా దొరుకుతుంది. ఉందికదా అని, అక్కడ చిత్రాలు మైళ్ళకొద్దీ ఉండవు.

కథలు ముఖ్యంగా సాంఘికాలూ, జానపదాలూను. వాళ్ళ జానపదాలు, జమీందారీ హయాంనాటివి. కథారచన, స్క్రిప్టు వగైరాలన్నీ క్షుణ్ణంగా పరిశీలించి, ఖరారుచేసుకుని, నిర్మాణం ఆరంభిస్తారు. 15 రోజులలో చిత్రం పూర్తిచేసి వేస్తారు. అలాగని రోజుకి 24 గంటలు పని చెయ్యరు. అసలు ఏ స్టుడియోలోను పొద్దుట 8కి ముందు, సాయంత్రం 5 తరవాత చిత్ర నిర్మాణం జరగదు. ఇక్కడలాగా, కరెంట్ కట్ చేస్తారు కాబోలనుకోకండి. అక్కడ స్టుడియోల వాళ్ళెవరూ విద్యుచ్ఛక్తి కార్పొరేషన్‌మీద ఆధారపడరు. అందరు సొంత జనరేటర్లు పెట్టుకున్నారు. ప్రతి స్టుడియోకి ఒక పవర్ హౌస్!

జపాన్‌లో వంటకి వాళ్ళు 'గాస్' వాడుతారు. తరవాత విద్యుచ్ఛక్తి. దేశం మొత్తంమీద మామూలుగా ఎక్కడా విద్యుత్ప్రసార పరిమాణం నూటపది ఓల్ట్‌లకు మించదు. అందువల్ల షాక్ తిని చనిపోయే ప్రమాదాలు బొత్తిగా నల్లపూసలైపోయాయి. "ఇంతవరకూ ఎలక్ట్రిక్ షాక్ వల్ల చనిపోవడం అనేది ఇక్కడ ఒక్కసారికూడా జరగలేదు" అని తమ స్టుడియోగురించి ఒకాయన నాతో చెప్పాడు.

## సినీరామంజోయుకం

జపాన్‌లో పక్కా థియేటర్‌లు మూడువేలు ఉన్నాయి. ఒక్క టోక్యోలోనే ఆరువందలున్నాయి వాటిలో సినిమాలు నాలుగు వందలు. మిగతావి నృత్యనాటక సంగీతశాలలు. టెంపరరీ షెడ్‌లు అనబడే శాలలు ఎక్కడా లేవు. చలచ్చిత్ర ధరిత్రి చరిత్రలో అద్భుతం అనతగ్గ సినేరమా థియేటరు టోక్యోలో ఉంది. అక్కడ ఏడాదినించి 'సెవెన్ వండర్స్ ఆఫ్ ది వరల్డ్' అనే చిత్రం ఆడుతున్నారు. సినేరమా ఎంత బ్రహ్మాండంగా ఉంటుందో, దాని ఖర్చుకూడా ఆ లెక్కలోనే ఉంటుంది. అది మన దేశంలో అవతరించడానికి పాతికేళ్లు పట్టవచ్చు. అసలు ఎన్నటికీ రాకపోనూవచ్చు.

సినిమాలుకాక, రోజా-స్ప్రిన్ టీన్ డాన్సు దగ్గరనుండి, జాపనీస్ జాతీయ నృత్యగానసభలవరకూ-అనేకరకాల కాలక్షేపాలు జరుగుతూ ఉంటాయి.

## స్వప్న సీమ

సాయంత్రం ఐదుగంటలకల్లా టోక్యో నగరం 'మేలినీలిముసుగు' ధరిస్తుంది. తక్షణం, నీలాంబరంపై నక్షత్రాలలాగే, ఈ చీకటి తెరమీద నియాన్‌లైట్‌లు రకరకాలవి రంగురంగులవి నేత్రపర్వంగా ఉదయిస్తాయి. అంతా స్వప్నసీమలో స్వర్గభూమిలా, చిత్రసీమలో 'డిస్నీలాండ్'లా భాసిస్తుంది ... దైనందినీయాలతో అలసిపోయిన జాపనీస్ స్త్రీ పురుషులు, అక్కడి అమెరికన్‌లూ, మనోహరమైన ఈ స్వప్నసీమలోకి క్రమంగా మేలుకుంటారు. ఈ 'నాగరిక నిశాజీవితం' ఇతర పశ్చిమదేశాలకి మల్లే తెల్లవారేదాకా సాగదు. రాత్రి పదకొండుగంటలకల్లా మొదలై ఐదునిమిషాలలో 'ఫేడౌట్' అయిపోతుంది. అక్కడితో హోటళ్ళన్నీ మూసేస్తారు. ఒక సీమదొర అన్నట్టు 'ఒక్క చుక్క దాహం' కూడా దొరకదు.



బిమల రాయ్ చిత్రం 'మధుమతి'లో జానివాకర్, బుధు అద్వాని, బ్రైజ్ శర్మ



సంగీతావారి "ఇంటిగుట్టు"లో పుష్పవల్లి

'త్రాగుబోతులు' ఎవరైనా ఏ 'కాబరే' హాలులోనో, బారులోనో ఒళ్ళు తెలియక, కళ్ళు మూసుకుని ధ్యానం చేస్తూ ఉన్నా, హోటలులో హోస్టెస్ లే, ఓ టాక్సీ మాట్లాడి అందులోకి ఎక్కించి, అతని జేబులో కార్డు ప్రకారం అతని బసకు బట్వాడా చేయిస్తారు. టాక్సీవాళ్ళుకూడా అక్కడ చాలా పెద్దమనుషులు. బహుయోగ్యులు. బండిలో 'త్రాగుబోతు'గారు రోగసమాధిలో ఉన్నారని లోకువకట్టి, జేబులు సవరించి, అతనికి 'పన్ను' విధించరని చాలామంది చెప్పారు. ఆఖరుకు టిప్ కూడా తీసుకోరట.

అసలు వాళ్ళే, ఇక్కడ యాత్రికులకు కళ్ళు అంటే నమ్మండి" అన్నాడొక మిత్రుడు నాతో.

## నాట్యశాలలు

'టోక్యో ఒడారి' లేక 'సోచికోకై కొకా' అనేది టోక్యోలోని పెద్ద నాట్యశాల. అది షిరోకిడోది. రెండువేలమంది కూర్చోవచ్చును. పదహారేళ్ళపైన 18 లోపు వయసుగల జాపనీస్ చిన్నదాన్ని, చూడచక్కనిదాన్ని చూడదలచుకుంటే, ఈ థియేటర్ కి వెళ్ళాలి. వెళ్తే ఒక్కసారి మూడువందలమందిని చూడవచ్చు. చూసి చక్కారాకుండా ఒక్క నిముషం కూర్చుంటే, చిరకాలం మన కళ్ళఎదట మెదులుతుందనిపించేటంతటి రమణీయ నృత్యాన్ని చూడవచ్చు. చిరకాలం మనసులో మెదిలే మధుర సంగీతాన్ని వినవచ్చు. అప్పుడు కలిగే అనుభూతి గురించి వాకబుచెయ్యడంకన్న వెళ్ళిచూడడం మంచిది. ఏడాదికి 365 రోజులూ ఈ షాన్ను ఉంటుంది కాబట్టి మీరెప్పుడు వెళ్ళినా చూడవచ్చు.

జపాన్ జాతీయ సంస్కృతి కేంద్రాలలో, ముఖ్యంగా ఈ భాగానికి సంబంధించి చూడతగ్గది 'బంరుకు' అనే తోలుబొమ్మలాట. దీనికై ప్రభుత్వం ప్రత్యేకం ఒక థియేటరు నిర్మించి నిర్వహిస్తోంది. భూగోళాన్ని రెండుగా భాగించి, ఒక సగాన్ని బోర్లిస్తే ఎంతఎత్తుగా కిరిగా ఉంటుందో, ఊహించదలచుకుంటే, ఈ థియేటరును ముందు చూడండి.

'టకారాజూకా' అనేది అపెరాహౌస్. ఇక్కడ పాశ్చాత్యబాణీలో సంగీత నాటకాలు ప్రదర్శిస్తారు. అన్ని పాత్రలను స్త్రీలే నిర్వహిస్తారు. కన్నులపండువగా ఉంటుంది అంతా. సంగీతంకూడా వీనుల విందుగా ఉంటుందిగాని, అందులో కొంత పాశ్చాత్య ప్రభావం కనిపిస్తుంది. బాగుండదని కాదు. సంగతి చెప్పాను. మిగతాది జాతీయ సంగీతం; భాష జాపనీసే.

మరొకటి 'కబూకి' ఇక్కడ, సంప్రదాయబద్ధమైన జాపనీస్ నాటకాలను ప్రదర్శిస్తారు. పురాణకథలు. ప్రాచీన జాపనీస్ అలంకరణ. సంగీతంకూడా శాస్త్రీయమైనదే. ఇక్కడ విశేషం అన్ని పాత్రలనూ పురుషులే ధరించటం.

టోక్యోలోని ఇతర వినోద కాలక్షేపాలన్నీ దొరలపద్ధతివి. మాజీరాజధాని క్యోటో నగరంలో మటుకు ప్రాచీన కళలను పరిరక్షించి, పైకి తేవడానికి ప్రభుత్వం అన్వర్యాన కృషి జరుగుతోంది. అందుకు శిక్షాలయాలు ఉన్నాయి. ఇక్కడే ప్రపంచ ప్రసిద్ధమైన గెయిషా సంగీత నృత్యాలు కూడా నేర్పుతారు. ఇక్కడ గెయిషావాడ ఒక మైలు పొడుగుంటుంది. గెయిషాలు నాట్యశాలకు వచ్చి నృత్య ప్రదర్శనలు ఇస్తారు. వాళ్ళ యిళ్ళకు వెళ్ళి చూడాలంటే రాత్రి 9 తరవాతే. చక్కని మెత్తనిసంగీతం వింటూ, గ్రీన్ టీ, పర్ ఫుల్ టీ, కావలసినవారు బీరు, త్రాగుతూ కొంతసేపు కూర్చునివెళ్తారు. గెయిషాల ఇళ్లన్నీ, రమ్యంగా అలంకరించి ఉంటాయి. చక్కటి చిత్రాలు కాగితపు దీపాలు మొదలైన వాటితో ఆహ్లాదకరంగా ఉంటాయి.

మొత్తానికి జపాన్ సందర్శనం ఒక మధురానుభూతి అన్నారు రామకృష్ణ. ★

## న్యూఢిల్లీ లేఖ

(10 వ పేజీ తరువాయి)

దేశానికి అతిప్రధానమైన ప్రాతిపదికలనుకూడా తప్పులేదనే కారణంతో వెనక్కు నెట్టేస్తున్న ఈ కాలంలో విద్యాశాఖ తనకు కేటాయించినధనాన్ని ఏమి ఉపయోగముందో తెలియని కార్యక్రమాలకు ఖర్చు చేస్తోంది. ఇందులోని సబబేమిటో తెలియదు.

రాష్ట్రాలకు ప్రత్యేకించిన అధికారాలన్నిటినీ కేంద్రమే హస్తగతం చేసుకునేందుకు వీలుగా భారత రాజ్యాంగాన్ని త్వరగా సవరించటం మంచిది. ప్రస్తుత రాజ్యాంగం ప్రకారమే కాదు, 1921 నుంచీ విద్యాధికారం రాష్ట్రాలకే అప్పగించబడింది. ప్రాథమిక విద్య రాష్ట్ర ప్రభుత్వాల అధికారంలోది కూడా కాదు. మునిసిపల్ సంస్థలది. కేంద్ర విద్యాశాఖ రాజ్యాంగ బాధ్యతలకు అతీతమైనదైనా తను రాజ్యాంగ విరుద్ధ ప్రవర్తనకు అనుగుణంగా రాజ్యాంగాన్ని మార్పించుకుంటే బావుంటుంది. ★

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



వే కపిల్లలు

ఫొటో : వి. నారాయణ, రాజమండ్రి.]